శ్రీరస్తు

"స్వధర్మే నిధనం శ్రేయః."

# ఈశ్వర దర్శనము

(శ్రీ బ్రహ్మానందస్వామికృతము.)



పండిత, పురాణం

సూర్యనారాయణతీర్థులవారిచే

ఆంధ్రీకృతము

---

(స్వధర్మప్రకాశినినుండి ఉద్ధృతము)

తత్ప్రకాశాధిపతిచే


చెన్నపురిలోని

శ్రీవాణీనిలయముద్రాలయమున

ముద్రితము.




1814

వెల 1-0-0

# విజ్ఞాపన:

ప్రియపాఠకమహాశయులారా!

ఈ "ఈశ్వరదర్శనము" ను రచించిన శ్రీ బ్రహ్మానందస్వామి కృతములైన "యోగకల్పద్రుమము, యోగరసాయనము, విచారదీపికము" మొదలగు వేదాంతగ్రంథములుగూడ నిట్లే మేము కొలఁదికాలమున ముద్రింపించి ప్రకటింపఁబోవుచున్నాము. పై మూఁడు గ్రంథములును నాగరాక్షరములతో నాల్గయిదుసారులు ముద్రితము లయినవి. కావున వానియుపయోగము చదువరులే గ్రహింతురుగాక.

ఈ గ్రంథముయొక్క పునర్ముద్రణాద్యధికారము రాజకీయశాసననియమానుసారముగ స్వాధీనము చేసికొనఁబడియున్నది గాన దీనిమాయనుమతి లేకుండ నితరులు ముద్రింపఁగూడదు.

ఇట్లు
ఆంధ్రభాషా సేవకవరమాణువు
పురాణం - సూర్యనారాయణతీర్థులు.

# కృతిసమర్పణము



శ్రీమంతుల కన్యలకును
ధీమంతుల కితరులకును దేవతవై తత్
కామములం బూరించెడి
కామేశ్వరి! తల్లి! భక్తకల్పకవల్లీ!

క. అవధారు నంబ! నీయాజ్ఞ విధిగ శిరసావహించి చక్కనినీపై
భవము విధమ్మున శాశ్వత, మవువిధి నాచేయు కృతిసమర్పణవిధమున్.

ఉ. శ్రీశుకవాణిచేతఁ దన చేతను ఖ్యాతిగ నేతదీయమౌ
కోశగృహమ్మునన్ హృదయకోశము నింపుగ నింపి శౌరి తా
మాశివరామనాయనికుమారు నుదారుని సూరిదీనతన్
నాశముసేయు నాథముని నాయనిఁ బాయని ప్రేమ నోముతన్.

ఉ. నాథమునీంద్రతోడఁ దొలసం బొనరింపఁగఁ దగ్గవాఁడు శ్రీ
నాథపదారవిందములనారతమున్ మది నిల్పువాఁడు వి
ద్యాధికులైనవారల కుదారముగా నిడువాఁడు తొంటిభూ
నాథులవంటి నాథముని నాయఁడు లోకానొకనాఁడు వేడుకన్.

మ. ధనవంతుం డని కాదుగాని తగు విద్యావత్ప్రియుం డంచు నీఁ
చినతద్యోగ్యత పేర్మిఁ జేసి తను దర్శింపం దలంపూని పి
ల్చినవానిన్ భవదుల్లసచ్చరణనాళీకోద్యదుద్యన్మరం
దనిమజ్జన్మధుపన్మనస్కుని పురాణం - సూర్యనారాయణుం
డను పేరన్ నిఖిలాంధ్రదేశమున విద్యావత్ప్రియుల్ సూపుమ
న్ననకుం బాత్రము లైన శైలిగల విన్నాణంపు గ్రంథమ్ములన్
దెనుఁగుం బాసను వ్రాయువానిని సదా ధీమంతులౌ వారిచెం
తను సంతే వినయమ్ముతో నరయుచిత్తమ్మొప్పువానిన్ ననున్.

మ. ముదమొప్పం గని సేమ మారసి కరమ్మం గేలఁ గీలించి యా
యదువంశోద్భవుఁ డెల్లనాథముని నాయం డాదృతిన్ మున్ను నా
రదమౌనీంద్రునిఁ బోలెఁ దా నడిగి వార్తల్ వించు నీనాఁడు బల్
సుదినమ్మంచు మహోదయంచును మహాత్ముకృత్యమ్ము పెంపారఁగన్.

గీ. రాయపురరాజవీథీవిరాజదాత్మ; సౌధభూమికిఁ దోడ్కొనిచని మహార్హ
పీఠికోపరిఁ గూర్చుండఁ బెట్టి తాను; నెదుటఁ గూర్చుండి బత్తిమై నిట్టు లనెను

క. "నారాయణతీర్థులవా, రూరక రారనుట యొప్పునో కో? మదీయా
గారమ్మొనరించినసుకృ, తారంభము చాలఁ బ్రబలమై యుండంగన్

క. ఇహపరముల కనువగు మీ, గృహస్థకంఠాభరణము గీతలును ముదా
వహములు సదివితి నయ్యవి, బహులాభమ్ములను గూరుపం జాలుఁ జూఁడీ!

క. ఎవరో బ్రహ్మానందయ, తివరుండఁట! మేటిపాండితీధనుఁడఁట! ఆ
కవి వ్రాసిన గ్రంథములాం, ధ్రవాక్కులను వ్రాసితిరఁట! తథ్యమొకో?

ఉ. వైనుకను మూర్తిపూజవిధి వెల్లడిసేసెడి దేదొ కాని ద
ర్శనమఁట! దాని మీరు "సరసమ్ముగఁ దెల్గొనరించి" రంచుఁ దా
విని చెను మీసరస్వతులవేంకటసుబ్బయశాస్త్రి దాని నే
వినఁదగనో కొ? మీరు వినిపింపరుగాక యొకప్పుడేనియున్."

క. అని యిట్లడిగినయానా, యనికిన్ నే నిట్టు లంటి "నవునయ్యా! నీ
వనినది యంతయు నిజమే, వినఁగోరికయున్న నిపుడె విను"మని ప్రీతిన్.

ఉ. అదివఱ కచ్చుకూర్పఁబడినట్టిది యంతయు సంతసమ్ముమైఁ
జదివితి నప్పుడే, యతఁడుఁ జాల మనంబున సంతసించి "యి
య్యది కడు యుక్తియుక్తమయినట్టిది యిట్టిది తెల్గువారి కెం
ముద మొనగూర్చు" నంచుఁ గరముల్ ముకుళించి సుహర్షమిట్లనెన్.

క. "అన్నా! యేమీ? వీఁడీ, ట్లన్నాఁడే! అనక "అట్లు" అని నాపరి
పున్నెపుఁ గృతిలోఁ దగిలిచి, నన్నుం జరితార్థునిగ నొసర్పరె?" అనుచున్.

క. వేయిన్నూటపదార్లా, నాయఁడు బహుమతిగఁ దత్క్షణమ్మొసంగన్.
వేయేల? అట్టిసుకవివి, ధేయుని నేఁ జూచి యెఱుఁగ దేవికా! యెందున్.

ఉ. విశ్వము లన్నిఁటిన్ జతురవీక్షణమాత్రన యేలుచుండు కా
మేశ్వరి! దీనినిం గృతిగ నిమ్మను సమ్మహనీయుకోర్కి నీ
యీశ్వరదర్శనమ్మతని కే కృతి యిచ్చితి నిద్ది నీవలెన్
శాశ్వతమై రసజ్ఞులకు సంతసముం గలిగించుచుండుతన్.



పండిత, పురాణం-సూర్యనాగాయణతీర్థులు.

# సంగతి.

స్వధర్మనిష్ఠాగరిష్ఠు లగుసజ్జనులారా! "కలౌ వేదాన్తినస్సర్వే" యనున్యాయమునఁ బ్రకృతకాలమున మనభరతఖండమునం దెక్కడఁ జూచినను వేదాంతులు విశేషముగాఁ గానంబడుచున్నారు. తదర్థము వేదాంతగ్రంథములు ప్రతిభాషలోను విశేషముగాఁ బ్రచారదశను బొందినవి పొందుచున్నవి. కాని యనధికారదశలో నాగ్రంథములను విచారింపఁబూని తుదముట్టఁ జాలక యుభయభ్రష్టు లగుచున్నారు. గతానుగతికన్యాయమున ముఖ్య మగుసగుణోపాసనను విడిచి నిర్గుణోపాసనవంకకుఁ బరువెత్తుచున్నారు. అయినను బ్రహ్మస్వరూపమునయొక్క యాథార్థ్యమును దెలిసికోలేకుండ నున్నారు. కాఁబట్టి క్రమక్రమముగాఁ బరమాత్మని స్వరూపమును దెలిసికొనుటకుఁగా నీగ్రంథము నూతనముగా రచింపఁబడినది. మేడ యెక్కువానికి మెట్లెంత ముఖ్యమో పరమాత్మను బొందఁ దలఁచినవారికి సగుణోపాసన యంత ముఖ్య మైనది. ఈశ్వరారాధనవిధి వేదములు, పురాణములు, మున్నగుగ్రంథములలో నిరూపణ చేయఁబడియే యున్నది. కాని యది వేఱువేఱుస్థలములయం దుండుటవలన నల్పజ్ఞు లగుజిజ్ఞాసువులకు సమగ్రముగాఁ దెలిసికొనుటకు వీలు గాకుండ నున్నయది. అట్టిబాధను దొలగించి యందఱకును నీశ్వరారాధనమునందు విశేషశ్రద్ధ గలిగించుటకై దాని నంతయును నొక్కచోటునఁ జేర్చినచోఁ జాల మంది కుపయోగించు ననుతలంపున నట్లు చేయఁబడినది. ఈగ్రంథమునం దేమతమునకును విరోధముగాఁ గాని ఖండనముగాఁ గాని వ్రాయుట లేదు. మఱియు భిన్నభిన్న దేవతల యుపాసనాప్రకారము వ్రాసినచో గ్రంథవిస్తర మగు నని దిగ్దర్శనన్యాయమున నిందు విష్ణుభగవానుని యారాధనప్రకారముమాత్రమే నిరూపింపఁబడినది. ఆరీతి ననుసరించి యన్యదేవతోపాసకులు తమతమయిష్టదేవత నారాధించు విధిని దెలిసికొని యారాధించుకొనుచుందురు గాక. మొత్తముమీఁద నామరూపములే వేఱు గాని ప్రధానవస్తు వొక్కటియే కదా! అదియే యందఱకును బునరావృత్తిరహిత మైనగమ్యస్థానము. మఱియు వేదాంత సాంఖ్య యోగాది దర్శనములలో వేఱువేఱురీతుల వివరింపఁబడియున్న సృష్టి

క్రమ మంతయు నేకత్ర సమన్వయము చేసి యీగ్రంథమున సంక్షేప ముగాఁజెప్పఁబడి యున్నది. ఇట్టి యీగ్రంథమును ,,విచారదీపకము, యోగకల్పద్రుమము" మొదలైన గ్రంథములను రచించిన బ్రహ్మానంద స్వాములవారు ముందు సూత్రములు చేసి వానికి సరళమైన సంస్కృత భాషలో భాష్యరూప మైనవివరణము వ్రాసి సంస్కృతము తెలియని ముముక్షువుల యుపయోగార్థము హిందీభాషలోఁ దామే తర్జుమా చేసి ముంబాపురమందలి నిర్ణయసాగర ముద్రాక్షరశాలాధికారులగు శ్రీతుకారామ్‌జావజీశ్రేష్ఠిగారి కీయఁగా వారు ప్రకటించిరి. మే మీగ్రంథమును దెప్పించి చదువుచుండఁగా మామిత్త్రులు పలువురు విని దీనిని దెలుఁగుబాసలోఁ బ్రకటింపుఁ డని కోరుటచేఁ దెలుఁగుబాసలో వ్రాసి యుంచితిమి గాని ప్రకటింప వీలు చిక్కినది కాదు. కాఁగా నిన్నాళ్లకు స్వధర్మప్రకాశినీ పత్త్రికాధిపతులును మాకు మిత్త్రులును సహృదయులును అగు బ్రహ్మశ్రీ కనుపర్తి మార్కండేయశర్మశాస్త్రులవారుచూచి తమ పత్త్రికాముఖంబునఁ బ్రకటింపఁ గోరినందున "నొక్కనాఁడైన యనేకులు మహానుభావులు దీనిని జదువుదురు గదా" యను నానందముచేఁ గృతజ్ఞతాపూర్వముగా నిచ్చితిమి. మఱియు నిదివఱలో మాచే సంపాదించి తాత్పర్యము వ్రాయఁబడిన "గృహస్థకంఠాభరణము" వారొకవేయిప్రతులు తమపత్త్రికాముఖంబునఁ బ్రకటించుటయే కాక మాకొక వేయినూటపదాఱుపుస్తకములు దయచేసిరి ఇంచుమించుగా నా రెండువేలు పుస్తకములును కొలఁదికాలముననే విక్రయింపఁబడుటచే రెండవకూర్పునకు సిద్ధులమై యుండఁగా చాలమంది రెండవభాగమును బ్రకటింపుఁడని వ్రాయుచున్నను ముం దీయీశ్వరదర్శనమును బ్రకటించి పిదప నది ప్రకటింత మని యూహించితిమి. కావున "గృహస్థకంఠాభరణము" రెండవభాగమును గోరుచున్న వా రీపుస్తకము ముగియునందాఁక మమ్ము మన్నింతురు గాక. ఇం దెవ్వియైనను లోపము లున్నచో మాకుఁ దెల్పినయెడలఁ గృతజ్ఞతాపూర్వకముగా సవరించుకొందుము.

ఇట్లు,

పురాణం సూర్యనారాయణతీర్థులు.



శ్రీ గస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# ఈశ్వరదర్శనము.

## ( ఆనన్దకాణ్డము. )

"శ్లో. ఆనన్దః కిల మన్యతే విభుతయా వేదేఽపి లోకే చిరా
దానన్దప్సృషిశత్వసా నయ మిహాఽనన్దేన యో జీవతి,
ఆనన్దాయ కరోతి యత్న మధునాఽఽనన్దా దిహాఽయా త్సదా
నన్దస్యానుభవత్యణో గణుక మానన్దేఽస్తంలో లీయతే."

అవతారిక. బ్రహ్మానన్దస్వామి యనుయతీశ్వరుఁడు నూటయేఁబది తొమ్మిదిసూత్రములతో నాలుగుపాదములపరిమితి గల "ఈశ్వరదర్శన" మనునుపాసనాశాస్త్రమును వ్రాసి దానికి భాష్యము వ్రాయఁబోవుచు ముందు నిర్విఘ్నముగా గ్రంథము పూర్తి యగుటకుఁ బరమాత్మనమస్కారరూపమైనమంగళమును జేయుచున్నాఁడు:—

శ్లో. నమ స్తస్మై పరేశాయ పరానన్దైకహేతవే
విశ్వవృక్షైకబీజాయ సంసారార్ణవసేతవే.

అర్థము. పరానన్దైకహేతవే, పర=ఉత్కృష్టమైన, ఆనన్ద=ఆనందమునకు, ఏక=ముఖ్యమైన, హేతవే=కారణమును, విశ్వవృక్షైకబీజాయ, విశ్వ=ప్రపంచమనెడి, వృక్ష=చెట్టునకు, ఏక=ముఖ్యమైన, బీజాయ=బీజమును, సంసారార్ణవసేతవే, సంసార=సంసారమనెడి, అర్ణవ=సముద్రమునకు, సేతవే=ఆనకట్టయును, తస్మై=తచ్ఛబ్దవాచ్యుఁడును అగు, పరేశాయ=పరమాత్మునికొఱకు, నమః=నమస్కారము.

తా. మనుష్యానందము మొదలుకొని బ్రహ్మానందమువఱకును గలయానందము లన్నింటిలో నెక్కువది యగునానందమునకు ముఖ్య కారణమును, వృక్షము పుట్టుటకు గింజయెట్లో యట్లే ప్రపంచము పుట్టుటకుఁ గారణమును, ఆనకట్ట సముద్రమును దాటించుటకు సాధనమైనట్లే సంసారమును దాటించి గమ్యస్థానమును బొందించుటకు సాధనమును, సామవేదములోని "తత్త్వమసి" యనుమహావాక్యమునందలి "తత్" అనుపదమునకు వాచ్యుఁడును నగుపరబ్రహ్మముకొఱకు నమస్కారమగుఁ గాక.

సూ. అథేశ్వరారాధనమ్. ౧.

భాష్యము. ఈశ్వరుని నారాధించువిషయమై జీవమాత్రమున కెల్ల సర్వకాలసర్వావస్థలయందును నధికారము గలదు గావున నిచట "అథ" శబ్దమున కొకానొకసాధనసంపత్తి గలిగినపిమ్మట నని యర్థము చెప్పనక్కఱ లేదు. మఱియు సూత్రములోని "ఈశ్వర"శబ్దమే మంగళవాచకము గావున "అథ" శబ్దమునకు మంగళ మర్థము చెప్ప నక్కఱ లేదు. కాఁగా సూత్రములోని "అథ"శబ్దమున కారంభమే యర్థము గాని యనంతరమేని మంగళమేని యర్థము గాదు. ఈశ్వరారాధన మందఱచేతను జేయఁదగినది యని వాక్యశేషము.

అవ. ఈశ్వరారాధన మెందులకుఁ జేయవలయును ? అని శంకించుకొని రెండవసూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. ఉభయసాధనత్వాత్. ౨.

భా. ఉభయ మనఁగా భోగము మోక్షము ననురెంటికిని సాధన మనఁగా ముఖ్యకారణము గనుక. పరమేశ్వరారాధనముచేతనే బ్రహ్మలోక మవధిగాఁగల భోగజాతమును, కైవల్య మవధిగాఁగల మోక్షమును బ్రాప్తించుచున్నది గనుక భోగములయం దభిలాష గలవారును మోక్షమునం దభిలాష గలవారును దప్పకుండ నీశ్వరారాధనమే చేయుచుండవలయును.

అవ. కామములతోఁగూడినజ్యోతిష్టోమాదికర్మములును, పర్యంకాద్యుపాసనలును జేయుచు నిజీవ్పుఁడు స్వర్గము మొదలుకొని బ్రహ్మ

లోకమువఱకును గలవిషయసుఖములను, శమదమాద్యనుష్ఠానపూర్వకముగా వేదాంతవాక్యముల విచారణ చేయుచు మోక్షపదమును బొందుచున్నాఁడు. కాఁగా భోగము మోక్షముఁ గూడఁ బురుషప్రయత్నసాధ్యములే యగుచుండఁగా మరల వ్యర్థముగా నేల యీశ్వరు నారాధించువిషయమై ప్రయాసపడవలయును? అని శంకించుకొని మూఁడవసూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. స్వప్రయత్నాత్తత్సిద్ధి రితి చే న్నాన్యతన్త్రత్వా జ్జీవస్య. ౩.

భా. జీవుఁడు పరాధీనుఁడు గనుక స్వప్రయత్న మనఁగాఁ గర్మములు, ఉపాసనలు, వేదాంతశాస్త్రవిచారణము ననువానిచేఁ జేయఁబడినపురుషప్రయత్నముచేతనే తత్సిద్ధి యనఁగాఁ బైని జెప్పఁబడిన భోగమోక్షములసిద్ధి యగు నని చెప్పుటకు వలను పడదు. జీవుఁడు పరాధీనుఁడు గదా! అటు గాక స్వతంత్రుఁడై యుండినచోఁ దనప్రయత్నముచేతనే భోగములను గాని మోక్షమును గాని పొందుటకు సమర్థుఁడగును. కాఁగా జీవుఁడు పరమేశ్వరున కధీనుఁ డగుటవలన నాయీశ్వరునియనుగ్రహముచేతనే వానిని బొందుటకుఁ దగి యున్నాఁడు. ఈ విషయమై "సమాధిసిద్ధి రీశ్వరప్రణిధానాత్" అనఁగా నీశ్వరారాధనమువలననే సమాధి సిద్ధించుచున్నది. అని యోగసూత్రములలోఁ బతంజలిభగవానులును "పరాత్తు తచ్ఛ్రుతేః" అనఁగా వేదప్రమాణమునుబట్టి యీజీవునికి శుభాశుభకర్మములఫల మీశ్వరునివలననే కలుగుచున్నది. అని బ్రహ్మమీమాంసలో వ్యాసభగవానులవారును సూత్రములు చేసియున్నారు. ఈ యర్థమునే:—

"శ్రు. ఏష ఉహ్యేవ సాధు కర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతే, ఏష ఉహ్యేవాఽసాధు కర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్యోఽధో నినీషతే"

అనఁగా నీయీశ్వరుఁ డేజీవుని నున్నతపదమునకుఁ దీసికొనఁబోవఁ దలంచునో వానిచేతను శుభకర్మములను జేయించుచున్నాఁడు. ఏజీవుని నీచగతికిఁ బంపఁదలంచునో వానిచేత నశుభకర్మములను జేయించుచున్నాఁడు. అని శ్రుతియుఁ జెప్పుచున్నది. ఈశ్రుత్యర్థమునే:—

"శ్లో. అజ్ఞో జన్తు రనీశోఽయ మాత్మన స్సుఖదుఃఖయోః,
ఈశ్వర ప్రేరితో గచ్ఛే త్స్వర్గం నరక మేవనా"

అనఁగా నజ్ఞాని యగునీజీవుఁడు తనకు సుఖమును గలిగించుకొనుటకుఁ గాని దుఃఖములను దొలఁగించుకొనుటకుఁ గాని సమర్థుఁడు గాఁడు. ఈశ్వరునిచేతఁ బ్రేరేపింపఁబడినవాఁడై తనకర్మమునుబట్టి స్వర్గమునకుఁ గాని నరకమునకుఁగాని పోవుచుండును. అని స్మృతి యనువదించుచున్నది. ఈసంగతి:—

" శ్లో. నారాయణేన దృష్టస్తు ప్రతిబుద్ధో భవే త్పుమాన్,
ఏవమాత్మేచ్ఛయా రాజన్ ప్రతిబుద్ధో నజాయతే"

అనఁగా నోరాజా! ఈ జీవుఁడు నారాయణునిచేఁ జూడఁబడినవాఁడయిననే జ్ఞాని యగుచున్నాఁడు. కాని కేవలమును దనయిచ్ఛచేత నెప్పటికిని జ్ఞాని కాఁజాలఁడు. అని భారతమోక్షధర్మపర్వములోనను జెప్పఁబడియున్నది. కాఁగా జీవులబంధమోక్షములు పరమేశ్వరాధీనములు గనుక నెప్పుడును వానినే యారాధించుచుండవలయును.

అవ. జీవుఁడు పరాధీనుఁ డని యెట్లు తెలియును? అని శంకించుకొని నాలుగవదైనసూత్రములచే సమాధానము చెప్పుచున్నాఁడు:-

సూ. అహితాచరణాత్. ౪

భా. తన కనిష్టము లగుపనులు చేసికొనుచుండుటవలన జీవుఁడు పరాధీనుఁ డని తెలిసికోఁ దగును. స్వతంత్రుఁ డగుచు నుండెనేని తన కనిష్టము లగుపనులు చేసికొనునా? ఎవ్వఁడైనను దా నధోగతికిఁ బోవలయు నని కోరునా? ఎఱిఁగియు ననిష్టఫలముల నిచ్చుకర్మముల యందుఁ బ్రవర్తించుచున్న యీజీవుఁడే తనపరాధీనతను బ్రకటించుకొనుచున్నాఁడు. ఈ విషయమై:—

"శ్లో. జానామి ధర్మం నచ మే ప్రవృత్తిర్జానా మ్యధర్మం నచ మే నివృత్తిః, కేనాపి దేవేన హృది స్థితేన యథా నియుక్తోస్మి తథా కరోమి"

అనఁగా నాకు ధర్మములసంగతి తెలియును గాని యందుఁ బ్రవృత్తిమాత్రము లేదు. నే నధర్మముల నెఱుంగుదును గాని వాని నుండి నివృత్తిమాత్రము నాకు లేదు. నాహృదయమం దున్న యొకా నొకదేవుఁడు న న్నేరీతిని నియోగించుచుండునో నే నట్లు చేయుచున్నా ను. అని మహాభారతములో దుర్యోధనవాక్యముగా వ్యాసభగవానుల వారు వ్రాసిరి.

సూ. విఘ్నబాహుళ్య దర్శనాచ్చ. ౫.

భా. తాను జేయుపనులకుఁ దఱుచుగా విఘ్నములు సంభవిం చుచుండుటవలనఁగూడ జీవుఁడు పరాధీనుఁడే యని తెలిసికోవలయును. తమకు శ్రేయస్సును గలుగఁజేయుకర్మములయందుఁ బ్రవర్తించుచున్న జీవుల కాధ్యాత్మికాధి దైవికాది విఘ్నము లనేకములు గలుగుచుం డుట మన ముందఱను నెఱింగినవిషయమే కదా! ఆ విఘ్నము లనేక జన్మములనుండి సంపాదింపఁబడి భోగమోక్షములకు సాధనములైనపుణ్య ములను క్షణమాత్రముననే నిష్ఫలముగాఁ జేయుచున్నవి. సర్వసంగపరి త్యాగులై వనమునకుఁ బోయి తపస్సు మొదలగుపుణ్యకర్మములయందుఁ బ్రవర్తించుచున్నమునీశ్వరులపుణ్యాదుల కప్సరఃస్త్రీలసంగమాదులును శరీరసంబంధము లైనరోగాదులును విఘాతకము లగుచుండుట మనము పురాణేతిహాసాదిగ్రంథములలోఁ జదువుచునే యున్నారము. నిజముగా జీవునకే స్వాతంత్ర్యమున్న యెడల నట్లు విఘ్నబాహుళ్యము గలుగకపోవును. ఒకవేళఁ గలిగినను దానిని తొలఁగించుకొనుటకు జీవుఁడు సమర్థుఁడే నగును. అట్లు జీవునకు సామర్థ్యమును లేదు. జీవుఁడు పశ్చాత్తాపమును జెందకపోవును. కాని పశ్చాత్తాపపడుచున్నట్లు మనము చూచుచున్నాము. కావున ననిష్టమును జేసికొనుటనుండి మరలకుండు టనుబట్టియు, నిష్టమును సంపాదించుకొనువిషయమై విఘ్నములు గలుగుచుండుటవలనను జీవుఁడు పరాధీనుఁడే యని సిద్ధాంతము.

అవ. సరియే పైని జూపినరెండుదోషములును తొలఁగుట కేమి యుపాయ మున్నది? యని శంక గాఁగా నీక్రిందిసూత్రముచే సమా ధానము చెప్పుచున్నాఁడు:—

సూ. తన్నివృత్తి రీశ్వరప్రసాదాత్. ౬.

భా. పైని జూపిన రెండుదోషములు నీశ్వరానుగ్రహమువలననే తొలఁగిపోవును. పరమేశ్వరు నారాధించుటవలనఁ బాపములన్నియు నశింపఁగా శుద్ధమైనయతఃకరణము గలవాఁ డగుచు నీజీవుఁడు తన కనిష్టములను జేసికొనుట మానును. ఆపరమేశ్వరునికృపాకటాక్షవశముననే యీజీవునికిఁ గలుగుచుండు నాధ్యాత్మికాదివిఘ్నము లన్నియు నశించుచుండును. ఎప్పుడు విఘ్నములన్నియు నశించునో అప్పు డా జీవునకుఁ గలుగనున్న శ్రేయస్సులన్నియు వెంటనే సిద్ధించుచుండును. ఈవిషయమై "తతః ప్రత్యక్ చేతనాధిగమోఽప్యంతరాయాభావశ్చ" అనఁగా నీశ్వరారాధనచేయుటవలన నాత్మస్వరూపజ్ఞానమును సర్వవిధములైన విఘ్నముల నాశనమును గలుగును. అని యోగసూత్రములలోఁ బతంజలి భగవానులవారు చెప్పియున్నారు. శాస్త్రోక్తవిధానముగాఁ బరమేశ్వరుని నారాధించిననే యాయన కనుగ్రహము గలుగును. సర్వసముఁడగు పరమేశ్వరునకు సమస్తజీవులయందు ననుగ్రహబుద్ధి సమానముగానే యుండును. అయినను బరమేశ్వరారాధనవలన నంతఃకరణశుద్ధిగలపురుషులకే యతనియనుగ్రహమును బొందుటకు యోగ్యత గలదు గాని యశుద్ధాంతఃకరణులును బాపాత్ములును అగువారికి లేదు.

" శ్లో. సమోఽహం సర్వభూతేషు నమేద్వేష్యోఽస్తినప్రియః,
యే భజన్తితు మాం భక్త్యా మయి తే తేషు చాఽప్యహమ్."

అనఁగా నోయర్జునా! నేను సర్వభూతములను సమదృష్టితోఁ జూచుచున్నాను. నాకు ద్వేష్యులనియుఁ బ్రియులనియు భేదము లేదు. అయినను నెవ్వరు నన్ను భక్తిచే నారాధించుచుందురో వారికిని నాకును భేదము లేదు. అనియీవిషయమునే శ్రీకృష్ణభగవానులవా రర్జునునితోఁ జెప్పినట్లు భారతము ప్రమాణ మున్నది.

అవ. అనిష్టాచరణమును,ఆధ్యాత్మికాదివిఘ్నములను నివారించు నుపాయము లనేకము లున్నవి. అవియేవనఁగా:—మంచిశాస్త్రములను వినుచుండుటవలనఁగాని చదువుచుండుటవలనఁగాని చూచుచుండుటవలనఁగాని యనిష్టాచరణమునుండి నివృత్తి గలుగుచున్నది. శరీరసం

బంధము లైనవ్యాధులు మొదలయినవిఘ్నములు మంచిమంచిమం దులుతినుటవలన శాంతిని బొందుచున్నవి. దేవప్రేరితము లైనయతి వృష్టి, అతిశీతము, ఎండ, గ్రహములు, పీడలు, పిశాచములు మొదలగు వానిని తొలఁగించుకొనుటకు గృహములు, కంబళ్లు, గొడుగులు, జప ములు, తంత్రములు మంత్రములు మొదలైనసాధనము లున్నవి. సర్ప వృశ్చికసింహవ్యాఘ్రాదిభూతజాతములవలనఁ గలుగువిఘ్నములు విష మునుహరించునౌషధములవలనను, శస్త్రాదులవలనను దొలఁగించుకొను టకు వీలుపడుచున్నవి. ఇఁక నేల నిష్కారణముగా నీశ్వరారాధనము విషయమై శ్రమపడవలయును? అని శంకించుకొని యీడవసూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు.

సూ. నాన్యతస్తు సాఽత్యంతతాభావాత్. ౭

భా. తుశబ్దముచేఁ బూర్వపక్షమునకు వ్యావృత్తి చేయఁబడు చున్నది. పూర్వోక్త మైనయాదోషద్వయనివృత్తి యొక్కయీశ్వ రునివలననే కాఁదగినది గాని యితరము లగుసాధనములవలనఁ గా దని తెలియవలయును. ఏమనఁగా, ఇతరము లగునుపాయములచేఁ జేయఁ బడినవివృత్తి యత్యంతమును ఫలించునది కాదు. కేవలమును శాస్త్ర శ్రవణాదులు చేసినంతమాత్రమున ననిష్టాచరణమున కత్యంతనివృత్తి కలుగుట లేదు. పండితులుగూడ సాంసారికవిషయములయందుఁ బ్రవ ర్తించుచున్నారు. ఔషధసేవనాదులచే వ్యాధిమొదలగునవి యత్యం తమును శాంతిని బొందుట లేదు. ఒకప్పుడు రోగాదులు శాంతించినను మఱియొకప్పుడు వానియుత్పత్తి కనఁబడుచున్నది. ఈవిషయము "సదృష్టా త్తత్సిద్ధి ర్నివృత్తేఽప్యనువృత్తిదర్శనాత్" అనఁగా మందులు మొద లగులౌకికసాధనములవలన సర్వదుఃఖములును నివర్తించుట లేదు. ఒక మాఱు రోగాదులకు నివృత్తి గలిగినను గాలాంతరమం దవి మరలఁ గనఁబట్టుచున్నవి. అనుసాంఖ్యసూత్రమువలనఁ దెలియుచున్నది. కావున ముఖ్యముగా నత్యంతము సర్వవిఘ్ననివృత్తిపూర్వకముగా శ్రీయ స్సును సిద్ధింపఁజేసికొనుటకుఁ దప్పకుండఁ బరమేశ్వరారాధనమే చేయ వలయును.

అవ. "ఈశ్వరానుగ్రహమువలననే యందఱకును శ్రేయఃప్రాప్తియు విఘ్ననివృత్తియుఁ గలుగు ననునియమము లేదు. ఇతరు లగు దేవతలయు మహర్షులయు దయవలన నవి సిద్ధించుచున్నవి, ఎట్లనఁగా దేవేంద్రుని యనుగ్రహమువలనఁ బ్రతర్దనుఁ డనురాజు ముక్తిని బొంది యున్నాఁడు. సనత్కుమారునియనుగ్రహమువలన నారదుఁడు జీవన్ముక్తుఁ డాయెను. నారదభగవానులవారియుపదేశబలమున ననేకులు రాజులు సంసారసముద్రమును దాఁటి గమ్యస్థాన మగుముక్తిపదమును బొందియున్నారు. దత్తాత్రేయునికృపవలన నలర్కుఁ డనురాజు ముక్తుఁ డాయెను. యాజ్ఞవల్క్యమునిదయచే జనకుఁడు జీవన్ముక్తపదమును గాంచెను. ఇఁకను నెందఱెందఱో ముక్తిని బొందినట్లు వేదముల లోను స్మృతులలోను బురాణములలోను నితిహాసములలోను నందల కొలఁదిగ వినఁబడుచున్నారు." అని శంక రాఁగా ముందుసూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. పరతో దర్శనా దితి చేన్న, ఈశ్వరానుగ్రహా దేవ తద్యోగాత్. ౮.

భా. ఈశ్వరునికంటె నితరు లగుదేవాదులవలన జనులకు శ్రేయః ప్రాప్తి కలిగినట్లు కనుపడుచున్న దని చెప్పు టంత యుక్తముగా లేదు. ఏమన, జనులకు దేవాదులతోఁ గలుగు సమావేశమున కీశ్వరునియను గ్రహమే కారణము గాని వేఱు గాదు. అట్లు గానిచో నందఱకును నేల కాకపోవలయును? ఈశ్వరుని బాగుగా నారాధించినచో నాయన దయదలఁచి దేవాదులయంతఃకరణములయందుఁ బ్రవేశించి వారిని బ్రేరేపించుచుండును. అపుడు వారు నాయాయిజంతువులకుఁ బ్రత్యక్షమై వరప్రదానముచేఁ గాని యుపదేశముచేఁ గాని భోగమునో మోక్షమునో పొందింతు రని తెలిసికోవలయును. ఈవిషయమై:—

"శ్లో. యోయోయాంయాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి,
తస్యతస్యాఽచలాంశ్రద్ధాం తామేవ విదధా మ్యహమ్.
స తయా శ్రద్ధయా యుక్త స్తస్యాఽరాధన మీహతే,
లభతేచ తతః కామా న్మయైవ విహితా న్హి తాన్,"

అనఁగా నోయర్జునా! ఏయేభక్తుఁడు శ్రద్ధాపూర్వకముగా నేయే దేవత నారాధింపఁ దలంచుచుండునో ఆయాభక్తున కాదేవతయందచల మగుశ్రద్ధను గలిగించుచుందును. ఆభక్తుఁ డాశ్రద్ధతోఁ గూడినవాఁడై యాదేవత నారాధించుచుండును. ఆయాదేవతవలన నేనే కల్పించియుంచినకామములను బొందుచుండును. అని గీతాశాస్త్రములో శ్రీకృష్ణభగవానుఁ డర్జునునితోఁ జెప్పియున్నాఁడు. అట్టియీశ్వరునియనుగ్రహమే లేనిపక్షమునఁ బశువులు మొదలగుతిర్యగ్జంతువులకును దేవాదులకును సమావేశమే దుర్లభ మగుచుండఁగా నిఁక శ్రేయఃప్రాప్తివిషయమై చెప్ప వలయునా? ఈవిషయమై:—

"శ్లో. క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు,
అసురం యోని మాపన్నా మూఢా జన్మనిజన్మని,
మా మప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం గతిమ్."

అనఁగా నోయర్జునా! నేను బాపకర్మములను జేయుచుండు పాపాత్ముల నెప్పుడును నసురాదినీచజన్మముల నెత్తించుచుందును. వాండ్రు ప్రతిజన్మమునందును మాటిమాటికిని నీచజన్మముల నెత్తి నాస్వరూపమును దెలిసికోఁజాలక యధమగతిని బొందుచుందురు. అని శ్రీకృష్ణభగవానుఁడు గీతలలో నర్జునునితోఁ జెప్పియున్నాఁడు.

అవ. ఆయాశ్రుతిస్మృతీతిహాసపురాణాదులయందు దేవతలయు మహర్షులయునానుములే ప్రసిద్ధముగా వినఁబడుచుండఁగా నిఁక నావిషయమై యీశ్వరానుగ్రహకల్పన యేల చేయవలయునని శంక రాఁగా నీసూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. తదంశభూతత్వాచ్చేత రేషాం న విరోధః. ౯.

ఇతరు లగుదేవతలు మహర్షులును నాయీశ్వరుని కవయవతుల్యులై కనఁబడుచున్నారు. ఈవిషయమై:—

"శ్రు మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్,
తస్యాఽవయవభూతై స్తు వ్యాప్తం సర్వ మిదం జగత్."

అనఁగా మూలప్రకృతిని మాయనుగాను నామాయ కధిష్ఠాతను బరమేశ్వరునిగాను దెలియఁదగును. ఆ పరమేశ్వరుని కవయవతు

ల్యైనదేవాదులచే నీ ప్రపంచ మంతయు నిండియున్నది. అని శ్వేతాశ్వతరోపనిషత్తులో నున్నది. మఱియు:—

"శ్లో. వేదనాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః,
మహర్షీణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరమ్."

అనఁగా నోయర్జునా! వేదములలో సామవేదము నేను. నేనే దేవతలలో నింద్రుఁడను. మహర్షులలో భృగువనుమహర్షిని నేను. వాక్కులలో నోంకారము నేను. అని భగవద్గీతలలో నున్నది. కావున దేవాదులనామములే ప్రసిద్ధముగా వినఁబడుచున్నను వారి నీశ్వరుని కంటె నితరులనుగాఁ జెప్పుటకు వీలుకాదు. ఆలోచింపఁగా:—

"శ్లో. మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః."

అనఁగా సనాతన మగునాయంశమే ప్రపంచమునందు జీవభూతమై యున్నది. అనుగీతాప్రామాణ్యమునుబట్టి జీవమాత్ర మంతయుఁ బరమేశ్వరాంశభూతమే యయినను సత్త్వగుణప్రధాను లగుదేవాదులయందే యీశ్వరాంశ మెక్కువగా నుండును. కావున వారినే యిచట నంశశబ్దముచే గ్రహింపఁ దగును. ఈ విషయమై:—

"శ్లో. యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవవా,
తత్త దేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్."

అనఁగా నోయర్జునా! ఈ లోకమం దేయేపదార్థము విభూతిమంతము, శోభావంతము, ప్రతాపవంతమునై యున్నదో ఆయాపదార్థము నా తేజస్సుయొక్కయంశమువలనఁ బుట్టినదే యని తెలిసికొనుము. అని గీతలలోఁ జెప్పఁబడి యున్నది. దేవాదులే యీశ్వరాంశము లైనప్పుడు వారలయనుగ్రహముమాత్ర మీశ్వరానుగ్రహ మేల కాకుండును? అని తలంచునది.

అవ. ఈ ప్రకారముగా దేవతలు మహర్షులును బరమేశ్వరాంశభూతులే యయినచో "వృక్షశాఖోద్ధరణ" న్యాయమున సుకరము గనుక వారినే యారాధించుట యుక్తము గాని యతిప్రయాససాధ్యమైనయీశ్వరారాధనమువలన నేమిప్రయోజనము? అని శంక రాఁగా యీక్రిందిసూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు.

సూ. విశిష్టఫలహేతుత్వాదీశస్య. ౧౦.

భా. ఆలోచింపఁగా నీశ్వరాంశభూతులే కనుక దేవాదుల నారాధించుట విరుద్ధమైనపని కాదు. అయినను బరమేశ్వరుఁ డందఱికంటె నెక్కువఫలము నిచ్చువాఁడు గనుక నాయననే యారాధింపవలయును గాని యితరుల నారాధింపరాదు. దేవాదులు పరిమితమైనశక్తి గలవారగుటంబట్టియుఁ బరమేశ్వరుఁ డనంతమైనశక్తి గలవాఁ డగుటంబట్టియు ఫల మిచ్చువిషయమునను యీశ్వరున కాధిక్యము యుక్తముగానే యున్నది. దేవేంద్రు నారాధించినచో నాతఁ డెంతప్రసన్నుఁ డైనను నింద్రాధిపత్యముకన్న నెక్కువపద మెప్పుడును నీయఁజాలఁడు గదా! ఈశ్వరుఁడో అఖిలబ్రహ్మాండాధిపత్యమును గూడ క్షణమాత్రములో నీయఁగలఁడు. కనుక నీశ్వరునిఁ గాని యితరదేవతలను గాని యారాధించువిషయమున ప్రయాసము సమమే యైనను ఫలవైషమ్యమునుబట్టి యీశ్వరారాధనమే చేయఁదగినది యని ముమ్మాటికిని జెప్పవచ్చును.

అవ. ఈ కారణమునుబట్టికూడ నీశ్వరారాధనమే చేయఁదగినది యని చెప్పుచున్నాఁడు:—

సూ. తల్లబ్ధత్వాచ్చేతరసిద్ధేః. ౧౧.

భా. ఇతరులగు దేవాదులకుఁ గలవరదానాదిశక్తి యంతయు నాపరమేశ్వరునివలననే పొందఁబడియున్నది. పూర్వజన్మములయందు జపము తపము వ్రతములు మొదలగు సుకృతవిశేషములచే నీశ్వరు నారాధించి యతనియనుగ్రహమువలననే వారు దేవత్వము మొదలైన పదములను బొందిరని తెలియవలయును. ఆ యితరదేవత లనాదిసిద్ధులైన ట్లెచ్చటను జెప్పఁబడి యుండలేదు. పరమేశ్వరుఁడో:—

"శ్రు. త మీశ్వరాణాం పరమం మహేశ్వరం
తం దేవతానాం పరమం చ దైవతమ్."

అనఁగా నాయీశ్వరుఁడు బ్రహ్మాదులకు మహేశ్వరుఁడు. అతఁడే యింద్రాదిదేవతలకుఁ బరమదైవము. అని శ్వేతాశ్వతరోపనిషత్తుచేఁ జెప్పఁబడుచున్నాఁడు. కనుక నీశ్వరుఁడే యందఱికంటెను విశేషముగా

ఫల మిచ్చువాఁ డగుటంజేసి సమస్త శ్రేయస్సులను గోరుకొనుచుండువా రందఱును నతనినే యారాధించుచుండవలయును.

అవ. "ఇపుడు చెప్పినసంగతి యుక్తముగానే యున్నది. అయినను ఫలానుసారముచే రాజానుచరన్యాయమున నితరదేవతారాధనము కంటె నీశ్వరారాధనము దుస్సాధ్యమే యగు" నని శంకించుకొని సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. చిత్తమాత్రసాధ్యత్వాన్న దుష్కరమ్. ౧౨.

భా. ఈశ్వరారాధన మొక్కచిత్తమాత్రముచేతనే సాధ్యమగుచుండుటచే నితరదేవతారాధనకంటెఁ గఠిన మని తలఁచుట కేవలము నజ్ఞానమూలకము గాని వేఱు గాదు. ఇతరదేవతలయారాధనమువిషయమై యాయాశాస్త్రములలోఁ జెప్పఁబడిన బలిహోమాదులావశ్యకము లైన ట్లీశ్వరారాధనమువిషయమై యక్కఱ లేదు. ఈశ్వరారాధనమో బాహ్యసామగ్రి యక్కఱలేకుండఁ గేవలమును జిత్తముచేతనే సాధ్య మగుచున్నది. ఆలోచింపఁగా దుష్కరములే యైనను యజ్ఞములు దానములు, తపస్సు మొదలగుకర్మము లీశ్వరార్పణబుద్ధిచేతనే చేయఁబడినవై యీశ్వరారాధన కుపయోగములే యగుచున్నవి యనుట సత్యమే. అయినను, ఏకాగ్ర మైనదియొక్కమనస్సుచేఁ జింతితుఁడై పరమేశ్వరుఁడు ప్రసన్నుఁ డైనట్లు యజ్ఞములు మొదలగువానిచేఁ ప్రసన్నుఁడు కాఁడు. ఈవిషయమై:—

"శ్లో. ధ్యానోపహార ఏవాఽత్మా ధ్యాన మస్య మహార్చనమ్,
వినా తేనేతరేణాఽయ మాత్మా లభ్యత ఏవ నో."

అనఁగా సకలాంతర్యామి యగుపరమేశ్వరునకు ధ్యానమే యుపహారము. ధ్యానమే యతనికి మహార్చనము. ఆయన ధ్యానముచే దొరకిన ట్లితరము లగుపూజాదులచే దొరకఁడు. అని యోగవాసిష్ఠములో వాల్మీకిభగవానులు చెప్పియున్నారు. వేదాదులయందుఁ జెప్పఁబడినయజ్ఞాదికర్మములుమాత్రము చిత్తవిక్షేపాదులు గలవారికొఱకే విహితములై యున్న వని తెలిసికొవలయును.

అవ. ఈకారణమువలనఁగూడ నీశ్వరారాధనము దుష్కరము గాదని చెప్పుచున్నాఁడు:—

సూ. అధికారనియమాభావాచ్చ. ౧౩.

భా. ఇతరదేవతల నారాధించుటకు సాధనములైనబృహస్పతి సవనము, రాజసూయము మొదలగుయజ్ఞములు చేయుటకు బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలైనవారికే యధికారము గలదు గాని మఱియొకరికి లేదు. ఈశ్వరారాధనమువిషయమై జాతిగుణాదివిశేషనియమము లేదు. ఎచ్చటను నెవ్వరికిని బరమేశ్వరుని నారాధించుట ప్రతిషేధము గాదు. ఈవిషయమై భగవంతుఁడు దానే:—

"శ్లో. మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాన్తి పరాం గతిమ్."

అనఁగా నోయర్జునా! స్త్రీలుగాని వైశ్యులుగాని శూద్రులుగాని యితరు లగుపాపాత్ములుగాని వారు వీ రనుభేదము లేకుండ నెవ్వరైనను సరియే నన్నాశ్రయించినచో నందఱును బరమపద (మోక్ష) మును బొందుచున్నారు. అని చెప్పియున్నాఁడు.

అవ. "పరమేశ్వరుఁ డున్నాఁ డని కొందఱును లేఁ డని కొందఱును వాదించుచున్నారు. కావున నీశ్వరుఁడే వివాదాస్పదమై యుండఁగా నిఁక నతని నారాధించుట యెట్లు"అని శంక రాఁగా నీక్రింది సూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. ప్రమాణసిద్ధత్వా న్నవివాదః. ౧౪.

భా. శ్రుతిస్మృతీతిహాసపురాణములు మొదలగుప్రమాణములచే నీశ్వరుఁడు నిరూపింపఁబడియున్నాఁడు గనుక నీశ్వరుఁ డున్నాఁడా లేఁడా యనువిషయమై వివాదమే యక్కఱలేదు. ఈవిషయమై:—

"శ్రు. తమీశ్వరాణాం పరమం మహేశ్వరం తం దేవతానాం పరమంచ దైవతమ్, పతిం పతీనాం పరమం పరస్తా ద్విదామ దేవం భువనేశ మీడ్యమ్. విశ్వస్యైకం పరివేష్టితార మీశం జ్ఞాత్వాఽమృతా భవన్తి."

అనఁగా బ్రహ్మాదులగు నీశ్వరులకుఁ బరమేశ్వరుఁడును, దేవతలకుఁ బరమదైవతమును, ప్రజాపతులకుఁగూడఁ బతియును, ప్రకృతికిఁ

ుఁ బైఁగా నుండువాఁడును, సకలభువననియంతయును, స్తుతి సేయఁ దగినవాఁడును స్వయంప్రకాశమానుఁడును నగు నాపరమాత్ముని దెలిసికొనుచున్నాము. సమస్తప్రపంచమునకు ముఖ్యమైనవాఁడును సర్వమును నావరించి యున్నవాఁడును నగు నాపరమేశ్వరుని దెలిసికొన్నవారు ముక్తిని బొందుచున్నారు. అని శ్వేతాశ్వతరోపనిషత్తునందును,

"శ్రు. భీషాఽస్మా ద్వాతః పవతే, భీషోదేతి సూర్యః,
భీషాఽస్మా దగ్ని శ్చేంద్రశ్చ, మృత్యు ర్ధావతి పంచమః."

అనఁగా నాపరమేశ్వరునివలనిభయముచేతనే వాయువు వీచుచుండును. సూర్యుఁ డుదయించుచుండును. అగ్ని ప్రజ్వరిల్లుచుండును. ఇంద్రుఁడు వర్షించుచుండును. మృత్యువు పరుగెత్తుచుండును. అని తైత్తిరీయోపనిషత్తునందును,

"శ్రు. య ఈశోఽస్య ద్విపద శ్చతుష్పదః,
ఈశావాస్య మిదగ్ం సర్వమ్."

అనఁగా నేయీశ్వరుఁ డీప్రపంచమునందలిమనుష్యాదిద్విపాదులను, పశువులు మొదలగు చతుష్పాదజంతువులను ప్రేరేపించి నియమించుచుండునో యాతనిచేతనే యిది యంతయు నిండి యున్నది. అని వేదాంతరమందును జెప్పఁబడి యున్నది. మఱియు:—

"శ్లో. ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా."

అనఁగా నోయర్జునా! ఈశ్వరుఁడు సకలభూతములహృదయములయందును గలఁడు. అతఁడే సర్వభూతములను మాయారూపమైన సంసారచక్రముపై నెక్కించి త్రిప్పుచుండును. అను గీతలవలనను,

"సూ. క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః."

అనఁగా నవిద్యాదిక్లేశములు, శుభాశుభకర్మములు, ఆకర్మముల ఫలము, వానిసంస్కారములు మొదలగువానితో శూన్యుఁ డగునొకానొకపురుషుఁడే యీశ్వరుఁడు. అనుయోగసూత్రమువలనను నీశ్వరునిస్వరూపము తెలియుచున్నది.

అవ. పైని జూపినరీతి నీశ్వరునియునికివిషయమై శాస్త్రప్రమాణమును జెప్పి యిప్పు డనుమానప్రమాణముచేఁగూడ నీశ్వరుని న్నిశ్చయింప వలసిన దని చెప్పుచున్నాఁడు:—

సూ. జగజ్జన్మాదిహేతుత్వాత్. ౧౫.

భా. ఈచరాచరప్రపంచముయొక్క యుత్పత్తిస్థితిసంహారములకుఁ గారణ మగుటవలన నీశ్వరాస్తిత్వమును నిశ్చయింపవలయును. ఈవిషయమును:—

"సూ. జన్మా ద్యస్య యతః"

అనఁగా నీప్రపంచముయొక్కయుత్పత్తిస్థితినాశము లెవ్వనిచే నగుచున్నవో యతఁడే యీశ్వరుఁడు. అని బ్రహ్మమీమాంసలో వ్యాసభగవానులవారు సూత్రించియున్నారు. మఱియు:—

"శ్రు. యతోవా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి,
యత్ప్రయ న్త్యభిసంవిశన్తి త ద్విజిజ్ఞాసస్వ, త ద్బ్రహ్మ"

అనఁగా నెవనివలన నీసర్వభూతములును బుట్టుచున్నవో, పుట్టిన భూతము లెవనివలన జీవించుచున్నవో, అంతమం దెవ్వనియందు లీన మగుచున్నవో యతఁడే పరబ్రహ్మ మని తెలిసికొనుము. ఇత్యాదిశ్రుతివచనములవలనను నీశ్వరుఁడే జగత్కారణ మని యూహింపఁ దగియున్నది.

అవ. "ఈసమస్తపదార్థములును దమంతటఁ దామే పుట్టుచుఁ బెరుఁగుచు నశించుచుండును నానివిషయమై కారణానుమాన మెందులకుఁ జేయవలయును" అని శంక రాఁగా నీసూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. నాకారణం దృష్టవిరోధాత్. ౧౬.

భా. కారణము లేకుండ నేపదార్థమును బుట్టుచున్నట్టు కనుపట్టమింజేసి యీప్రపంచముకూడఁ గారణము లేకుండఁ బుట్టుచున్న దని తలంపరాదు. ఏయేపదార్థ మెచ్చట నెచ్చటను బుట్టుచున్నదో ఆయా

పదార్థ మంతయు నాయాకారణమునుండియే పుట్టుచున్నట్లు మనము చూచుచున్నారము. కావునఁ గారణానుమానము తగియేయున్నది.

అవ. ఈహేతువుంబట్టిగూడ నిది యకారణము గాదని చెప్పుచున్నాఁడు:—

సూ. కారణాదానప్రవృత్తేశ్చ. ౧౭.

భా. ఏయేమనుజుఁ డేయేకార్యమును జేయఁదలంచునో ఆయామనుజుఁడు ముందుగా నాయాకార్యమునకుఁ దగినకారణమును స్వీకరించుచుండును. ఎట్లనఁగా:—కులాలుఁడు స్వర్ణకారుఁడు మొదలగువారు ఘటములు భూషణములు మొదలగువానిని నిర్మింపఁదలంచినప్పుడు వానివానికిఁ గారణములైన మన్ను సువర్ణము మొదలైనవానిని స్వీకరించుచుందురు. లోకములోఁ బ్రతివస్తువును గారణము లేకుండఁ గనే యగుచున్నచో నెవ్వరును గారణపదార్థమును స్వీకరింపకుండనే యుందురు. స్వీకరించుటను మనము చూచుచునేయున్నాము. కావున నాప్రకారముగానే ఘటపటాదికార్యత్వసాధర్మ్యమునుబట్టి జగత్తుగూడఁ గార్యమే కనుక దీనికిని దప్పకుండ నొకానొక కారణము నంగీకరించి తీరవలయును.

అవ. ఈప్రపంచమంతయుఁ దనంతటఁ దానే కలుగుచున్నదను వారిమతమును నిరాకరించుటకై మరల నాక్షేపపూర్వకముగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. స్వభావా దితి చేన్న నియమదర్శనాత్. ౧౮.

భా. "ప్రతివస్తువును దనంతటఁ దానే పుట్టుచున్నది. ఇది పదార్థములకు స్వభావమే. ఎట్లనఁగా:—వీర్యము శరీరాకారముగాను గింజ వృక్షాకారముగాను మాఱుచున్నవి. జలమందు ద్రవత్వము, అగ్నియం దుష్ణత్వము, వాయువునందు సదాగతిత్వము మొదలైనవి స్వభావసిద్ధములు. ఇత్యాదిసర్వజగత్తును స్వభావమువలననే కలుగుచున్నది గాని వానివిషయమై కర్త్రపేక్ష లేదు." అనిశంకించువారిమత మంగీకరింపఁదగినది కాదు. ఏమనఁగా:—ఈపదార్థమునుండియే యీవస్తువు

పుట్టుచున్నది గాని యితరపదార్థమునుండి గాదు. ఆనునియమము ప్రతి వస్తువుయొక్క పుట్టువువిషయమైకన్పట్టుచున్నది. స్వభావమువలననే సర్వ పదార్థములును బుట్టుచున్నయెడలఁ బైనిచెప్పఁబడిననియమమే యక్క అలేకుండ సర్వపదార్థములవలనను సమస్తవస్తువులును గలుగుచుండ వలయును గదా! అట్లు గలుగుచుండుట లేదు. కావున స్వభావమే జగ త్తునకుఁ గారణ మని చెప్పుటకు వలనుపడదు.

అవ. 'పదార్థములయుత్పత్తివిషయమైకార్యకారణములకు నియ మము చెప్పుదురుగాక. మేము వల దనము. కాని యాయాపదార్థము నం దాయావస్తువును బుట్టించుటకై యట్టిశక్తియే యున్నది. ఎట్లనఁ గా:— తిలలయందుఁ దైలము, విత్తనమందు వృక్షవిస్తారము, శుక్లము నందు శరీరము, అగ్నియందు దాహకత్వము, మొదలైనవి. అంతటను ఆయాకార్యములను గలిగించు సామర్థ్యము స్వభావసిద్ధమై పదార్థముల యందున్నది. కావున మీరు చెప్పిన నియమ మున్నను మా కేహానియు లే' దని శంకింపఁగా నీసూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు.—

సూ. శక్తేరపి సనియామకత్వం విభాగదర్శనాత్. ౧౭.

భా. తిలలనుండియే తైలము వచ్చుచున్నది గాని యిసుకనుండి రాదు. బీజమునుండియే చెట్టు మొలచుచున్నది గాని కాలినుండి మొల వదు. ఈరీతిగా నొక్కొక్కపదార్థమునందుఁ గలశక్తి యితర మగుపదా ర్థమునందుఁ గన్పట్టుట లేదు. ఇట్లంతటను ప్రతిపదార్థమునందును శక్తి యొక్కవిభాగము కన్పట్టుచున్నది. అట్టిశక్తి కాయాపదార్థమునందు విభాగముచేయుట కొకనియామకుఁ డుండవలయును. అట్లు నియామ కుఁడే లేనిపక్షమున నగ్నియందున్నదాహకత్వము జలమునందును జల మందలిచల్లఁదన మగ్నియందును క్షణమాత్రములో సంక్రమించును. ఇసుకనుండి తైలముగూడ వచ్చును కాఁగాఁ బైని జెప్పినచొప్పున నియామకుఁడు లేనియెడలను అంతటను శక్తిసాంకర్యము కలుగును. అట్లు శక్తికి సాంకర్యమే కలిగినచో నీప్రపంచ మంతయు నవ్యవస్థాపన్న మై పరస్పరమును విహన్యమానమై నశించిపోవును. కాఁబట్టి యంతటను

శక్తికి విభాగము కనుపడుచుండుటవలన నావిభాగము చేయుటకై యొకానొకనిని నియామకునిగా నంగీకరింపక తీఱదు. నియామకుఁడే లేనప్పుడు నియమ మెప్పుడును నుండదు గదా! నియమశబ్దమే నియామకుని లక్షింపఁజేయుచున్నది. కావున నెవని సంకల్పమువలన నంతటను శక్తికి విభాగము కలుగుచున్నదో యెవనికి భయపడి సూర్యుఁడు, అగ్ని హోత్రుఁడు, వాయుదేవుఁడు, భూమి, సముద్రము, మొదలైనవి తమ తమమర్యాదలను దాఁటకుండ నున్నవో, ఆసర్వశక్తి గలయీశ్వరుఁడే కనుపడుచున్న యీ ప్రపంచము యొక్క జన్మస్థితిసంహారములకుఁ గారణ మని నిశ్చయింప వలసియున్నది.

అవ. "పైని జెప్పినరీతిగాఁ బ్రపంచము సకారణమే యగుఁగాక. అయినను బరమేశ్వరుఁడు కారణ మని చెప్ప వలనుపడదు. ఏమనఁగా:—

"శ్రు. యథాచారీ యథాకారీ తథా భవతి.
సాధుకారీ సాధు ర్భవతి. పాపకారీ పాపో భవతి
పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన."

అనఁగా నీజీవుఁడు పూర్వజన్మమునం దెట్టికర్మమును జేయునో యెట్టియాచారము గలవాఁడుగా నుండునో రెండవజన్మమునం దట్లే యగుచున్నాఁడు. మంచికర్మమును జేసినవాఁడు మంచివాఁడగు చున్నాఁడు. పాపకర్మమును జేసినవాఁడు పాపాత్ముఁ డగుచున్నాఁడు. పుణ్యకర్మముచేఁ బుణ్యాత్ముఁ డగుచున్నాఁడు. పాపకర్మముచేఁ బాపాత్ముఁ డగుచున్నాఁడు. అని శ్రుతియందును,

"శ్లో. శుభై రాప్నోతి దేవత్వ మశుభై ర్నారకీం గతిమ్,
ఉభాభ్యాం పుణ్యపాపాభ్యాం మానుష్యం లభతేఽ వశః."

అనఁగా శుభకర్మములచేతను దేవత్వమును, అశుభకర్మముల చేతను నరకగతిని పుణ్యపాపమిశ్రమ మైనకర్మములచే మనుష్యత్వమును బొందుచున్నాఁడు. అని స్మృతియందును గర్మమే ప్రపంచమునకుఁ గారణ మని నిశ్చయింపఁబడుచున్నది." అని శంక రాఁగా నీసూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. న కర్మా ఽస్వతంత్రత్వాత్. ౨౦.

భా. కర్మము స్వతంత్ర మైనది కాదు గనుకఁ బ్రపంచమునకుఁ గారణ మని చెప్పుటకు వీలు లేదు. క్రియ యెప్పుడును స్వతంత్రముగా నున్నట్లు కనుపడుట లేదు. అది కర్త్రధీనమై యుండును. ఏరీతిగాఁ గరణకాలమున నితరుఁ డగునో కాక కర్తచేతనే కర్మములు చేయఁబడు చున్నవో అరీతిగానే ఫలదానకాలమందును నితరుఁ డగునో కానో కసాక్షి చేతనే వానికిఁ దగినఫల మీయఁబడుచున్నది. కావునఁ గర్మము పరాధీన మగుటవలనను గర్తృకరణములు క్రియకంటెఁ బూర్వమే యున్నవి గనుకను గర్మము ప్రపంచమునకుఁ గారణము గాదు. పరస్పరమును బ్రపంచమునకును గర్మమునకును గలసంబంధ మనాది యైనను గర్మము నిమిత్తమాత్ర మనియే యంగీకరింపఁబడ లేదు. వెనుకఁ జూపినశ్రుతి స్మృతులకును నిమిత్తమాత్ర మని చెప్పుటయందే ప్రయోజన మున్నది గాని వేఱు ప్రయోజనము లేదని తెలిసికొనుము.

అవ. "సరియే కర్మము జగత్తునకుఁ గారణము గాదేనిఁ గాక పోవుఁగాక:—

"శ్రు. అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః
సృజమానాగ్ం సరూపామ్."

అనఁగా రజస్సత్త్వతమోగుణాత్మికయుఁ బుట్టుక లేనిదియు నేకాకినియుఁ దనతో సమానమైన యనేక ప్రజలను గనుచున్నదియు ననియ జుర్వేదము చెప్పుచుండుటవలనను, సాంఖ్యశాస్త్రప్రవర్తకు లగుకపిలాదులచే నంగీకరింపఁబడి యుండుటవలనను త్రిగుణాత్మిక యగుప్రకృతియే జగత్తునకుఁ గారణ మని చెప్పరాదా?" అని శంకరాఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. నచ ప్రధాన మచేతనత్వాత్. ౨౧.

భా. అచేతనము గనుకఁ బ్రధానము (ప్రకృతి) గూడ జగత్కారణ మగుటకుఁ దగదు. త్రిగుణాత్మక మగుటచేతఁ బ్రధాన మచేతనమే కదా! అచేతన మగువస్తువునందుఁ గర్తృత్వ మెట్లు చెప్పవచ్చును?

క్రియలయొక్క యారంభ మెప్పుడును బుద్ధిపూర్వకమే యగుచుండును. "ఇది యారీతిగాఁ జేయుటకుఁ దగినది" అని ముందుగా మనస్సులో నాలోచించి కదా కర్త చేయుట కారంభించుచున్నాఁడు. ఆలోచింపఁగా నొకప్పుడు వర్షజలమువలన వృక్షలతాదులు మొలచుటయు, నదీప్రవాహ వేగమువలన నొడ్డున నున్న చెట్లు కూలుటయుఁ గొండశిఖరములు పడుటవలనఁ గ్రింద నున్న జంతుజాలము నలిగి చచ్చుటయు నిత్యాదిస్థలములయం దచేతనములయందును నుత్పత్తివినాశాదిక్రియ కన్పట్టుచున్నది. అయినను; ఇంతమాత్రమున నవి కర్తలని చెప్పుటకు వీలు కాదు. ఏమన:—జడపదార్థములయందుఁ గన్పట్టుక్రియ "ఇది యిట్లు చేసినచో దీని కుపయోగించును గనుక నిట్లు చేయవలయును" అని విచారపూర్వకముగాఁ బ్రవర్తించుట లేదు. జగద్రచనవిషయమైకూడ నిట్లే యంగీకరింపఁబడినచో, అప్పుడు సర్వమును అనియమితము, అనాకారము, అనుపయోగి, అవ్యవస్థితము నగును. కాని యట్లు కనుపడుట మాత్రము లేదు. మఱి యేమనఁగా ననేకవిధములచేఁ బరస్పరము నుపయోగించునదియై నియమితవస్తుజాతసమన్వితమై, ఆకాశము, భూమి, అంతరిక్షము, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, గ్రహములు, మొదలగువానిచే యథాయోగ్యముగా సువ్యవస్థితమై కనుపడుచున్నది. ఏప్రపంచకమునం దొకవస్తువును విచారణచేసినను బండితులకుఁగూడ బుద్ధి భ్రాంతిని బొందుచున్నదో ఆప్రపంచము బుద్ధిపూర్వకముగా నిర్మింపఁబడిన దని వేఱుగాఁ జెప్పవలయునా? ఈవిషయమై:—

"శ్రు. స ఈక్షాంచక్రే స ఈక్షత లోకాన్ను సృజాః."

అనఁగా నాపరమేశ్వరుఁడు సృష్టికిముందు లోకములను సృజింతునా యని యాలోచించెను. అనుమొదలైనవాక్యములవలన జగదుత్పత్తి బుద్ధిపూర్వక మనియే నిరూపింపఁబడి యున్నది. మఱియు మీఁదఁ జూపినశ్రుతియర్థమును బ్రకటించుచు,

"సూ ఈక్షతే ర్నాశబ్దమ్"

అనఁగా వేదములో జగద్రచనాకాలమందు "ఈక్షణ" మనఁగా విచారమునకుఁ బ్రసంగము వచ్చుటవలన విచారశూన్యము, అచేతన

ము, అగు ప్రకృతి యీ ప్రపంచమునకుఁ గారణము కాఁజాలదు. అని వ్యాసభగవానులవారు బ్రహ్మమీమాంసలో సూత్రించియున్నారు. "అజా మేకామ్" అను శ్రుతిచేతను 'బాణము చంపుచున్నది' అనుదాని వలెనే కరణమందుఁ గర్తృత్వమారోపింపఁబడుచున్నది కాని ప్రధానమునకు స్వతంత్రముగాఁ గర్తృత్వము లేదని తెలిసికోవలయును. కావునఁ బ్రధాన మనుపేరు గల తనమాయాశక్తి నాశ్రయించి యీశ్వరుఁడు తద్ద్వారమున నీప్రపంచమును నిర్మించుచున్నాఁడు. ఈవిషయమై:—

"శ్రు. మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు
మహేశ్వరమ్, అస్మా న్మాయీ సృజతే విశ్వ మేత
త్తస్మిం శ్చాన్యో మాయయా సన్నిరుద్ధః."

అనఁగాఁ బ్రకృతినే మాయనుగాను ఆమాయ కధిష్ఠాతను బరమేశ్వరునిగాను దెలిసికోవలయును. ఆమాయానియామకుఁ డీప్రపంచమును సృజించుచున్నాఁడు. ఆప్రపంచమునందు మాయచేతను జీవుఁడు కట్టుపడి యున్నాఁడు. అని శ్వేతాశ్వతరోపనిషత్తునందును,

"శ్లో. మమ యోని ర్మహ ద్బ్రహ్మ తస్మి న్గర్భం దధా మ్యహమ్,
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత!
మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్."

అనఁగా నోయర్జునా! నాకు మాయ స్త్రీస్థానీయ యయి యున్నది. దానియందు నేను సంకల్పరూప మయినగర్భమును ఉంచుచున్నాను. దానివలన సకలభూతములును బుట్టుచున్నవి. ఈరీతిగా నా యాశ్రయమువలననే ప్రకృతి యీచరాచరప్రపంచమును బుట్టించుచున్నది. అని భగవద్గీతలలోనను జెప్పఁబడి యున్నది.

అవ. ఈప్రకారముగా ననుమానప్రమాణముచేఁ బరమేశ్వరుఁడున్నాఁ డని నిరూపించి యిపుడు ప్రత్యక్షప్రమాణముచేఁ గూడ నీశ్వరుఁ డున్నాఁ డని చెప్పుచున్నాఁడు:—

సూ. సమాధా వాలోకనా త్ప్రిత్యక్షత్వమ్. ౨౨.

భా. సమాధిసమయమునఁ గనుపడుచుండుటవలనఁ బరమేశ్వరుఁడు ప్రత్యక్ష మగుచున్నాఁ డనికూడఁ దెలిసికోఁదగును. యోగాంగములైన యమనియమాదులను జిరకాల మాచరించుటచే మన స్సంతర్ముఖ మగుటవలన సంప్రజ్ఞాతసమాధికాలమున యోగులు సర్వజగత్కారణుఁడును జ్యోతిఃస్వరూపుఁడును నగునాపరమేశ్వరుని జూచుచున్నారు. ఈవిషయము:—

"శ్రు. తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః."

అనఁగా ధ్యానము చేయుచున్నవాఁడై యోగి నిష్కలుఁ డగు నాపరమేశ్వరుని జూచుచున్నాఁడు. అని ముండకోపనిషత్తులోను,

"శ్రు. నీహారధూమార్కానలానాం ఖద్యోతవిద్యుత్ స్ఫటికశశీనాం, ఏతాని రూపాణి పురస్సరాణి బ్రహ్మ ణ్యభివ్యక్తికరాణి యోగే."

అనఁగా ధ్యానకాలమందు యోగికి ముందుగా మంచు, పొగ, సూర్యుఁడు, అగ్ని, వాయువు, మిణుఁగురుబూచి, మెఱుపు, స్ఫటికమణి, చంద్రుఁడు, మొదలగురూపములు గనఁబడి వెనుకఁ బూర్ణజ్యోతిర్మయ మగు పరబ్రహ్మము గనుపడును. అని శ్వేతాశ్వతరోపనిషత్తునందును,

"శ్రు. దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః."

అనఁగా సూక్ష్మమును గనుఁగొనుపండితులు సూక్ష్మమును, శ్రేష్ఠమును నగుతమబుద్ధిచేతను బరమేశ్వరుని జూచుచున్నారు. అని శ్రుత్యంతరమందును,

"శ్లో. యతంతో యోగిన శ్చైనం పశ్య న్త్యాత్మ న్యవస్థితమ్,
యతన్తోఽ ప్యకృతాత్మానో నైనం పశ్య న్త్యచేతసః."

అనగాఁ బ్రయత్నమును జేయుచు యోగీశ్వరులు తమయాత్మయం దున్నపరమాత్ముని జూచుచున్నారు. పుణ్యాత్ములు గానిమూఢు లెంత ప్రయత్నించినను జూడఁజాలరు. అని గీతాశాస్త్రమునను,

"శ్లో. యం వినిద్రా జితశ్వాసాః సంతుష్టాః సంయతేంద్రియాః,
జ్యోతిః పశ్యన్తి యుఞ్జానా స్తస్మై యోగాత్మనే నమః.

విధూమ ఇవ దీప్తార్చి రాదిత్య ఇవ రశ్మిమాన్,
వైద్యుతో ఽగ్నిరివాకాశే దృశ్యతేఽఽత్మా తథాత్మని."

అనఁగా జ్యోతిఃస్వరూపుఁ డగునేపరమాత్మని నిద్రాశూన్యులును, ప్రాణాదివాయువులనవృత్తులను జయించినవారును, సంతుష్టులును, ఇంద్రియనిగ్రహముగలవారును నగుయోగులు ధ్యానముచేయుచుఁ జూచుచుందురో యోగస్వరూపుఁ డగునట్టి పరమాత్మునకు నమస్కారము. ఆపరమాత్మ పొగలేని యగ్నివలెను, కిరణములుగల సూర్యునివలెను, ఆకాశమునందలిమెఱుపుసంబంధమైన యగ్నివలెను, ప్రకాశించుచు సమాధికాలమందు యోగికిఁ దనయాత్మయందుఁ గనఁబడుచుండును. అని మహాభాగతమందును,

"సూ. విశోకా వా జ్యోతిష్మతీ."

అనఁగా నేకాలమున యోగికిఁ దనహృదయమం దానందమయమైన జ్యోతి యగపడునో అప్పుడు వానికి దానియందుఁ జిత్తనిరోధమగుచున్నది. అని పతంజలికృతయోగసూత్రములయందును,

"సూ. అపిచ సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యామ్."

అనఁగా మఱియు నీయాత్మను భక్తిధ్యానప్రణిధానాద్యనుష్ఠానకాలమందును యోగులు శ్రుతి, స్మృతిప్రమాణములవలనను జూచుచున్నారు. అని వ్యాసకృతబ్రహ్మమీమాంసయందును జెప్పఁబడియున్నది. కాఁబట్టి పైనఁ జూపినప్రమాణములవలనఁ బరమేశ్వరుఁడు యోగులకుఁ బ్రత్యక్ష మగుచున్నాఁ డని తెలియుచున్నది.

అవ. "సరియే యింతవఱకును గష్టపడి యనేకప్రమాణములు చూపి యీశ్వరుఁ డగపడుచున్నాఁ డంటిరి. అగపడుట యనునది నేత్రేంద్రియమువలనఁ గదా యగుచున్నది. సమాధికాలమునఁ జక్షురాదీంద్రియములు లయమును బొందియుండుటవలన నెట్లాజ్యోతి యగపడును?" అని శంక రాఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ: ద్విధా ప్రవృత్తే ర్నానసమంజసమ్. ౨౩.

భా. సమాధికాలమున యోగులకుఁ బరమేశ్వరుఁడు ప్రత్యక్షముగు నని చెప్పు టయుక్తము గాదు. ఏమనఁగా:—చక్షురాదీన్ద్రియములకు రెండువిధములుగాఁ బ్రవృత్తి గలుగుచున్నది. అందొకటి శరీరముకంటెఁ బైఁగా నున్న విషయములయందును రెండవది శరీరము లోపలను నగుచున్నది. అనేకజన్మములనుండి సంచిత మైన సంసారము సంబంధము లైనవాసనలతోఁ గూడినయింద్రియములకు స్వాభావవశమునఁ దఱుచుగా బాహ్యవిషయములయందే ప్రవృత్తి కలుగుచుండును. యోగాభ్యాసముచేతనో శబ్దాదివిషయములనుండి మరలింపఁబడినయింద్రియముల కత్యంతము నంతర్ముఖత్వము కలుగుటవలన శరీరములోపలఁ బ్రవృత్తి గలుగుచున్నది. తరువాతను సమాహితచిత్తుఁడగుయోగికిఁ బుణ్యాధిక్యమువలన నంతర్యామిరూపముగా నున్న పరమాత్మునిదర్శనము తనశరీరములోపలనే యగుచున్నది. ఈసంగతి:—

“ శ్రు. పరాంచి ఖాని వ్యతృణ త్స్వయంభూ స్తస్మా త్పరాఙ్పశ్యతి నాన్తరాత్మన్, కశ్చి ద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష దావృత్తచక్షు రమృతాత్మాన మిచ్ఛన్.”

అనఁగాఁ బరమేశ్వరుఁ డింద్రియములను బహిర్ముఖస్వభావముగలవానినిగానే సృజించెను. కావున నవి యెల్లప్పుడును బాహ్యవిషయములవంకకే పరుగెత్తుచుండును గాని పరమాత్మను జూచువిషయమై ప్రవర్తింపవు. ఒకానొకధీరుఁ డగుయోగి సర్వేన్ద్రియములను బహిర్ముఖములు గాకుండ నడ్డి మోక్షేచ్ఛచేఁ బరమాత్మను జూచుచుండును. అని యజుర్వేదమునందలికఠోపనిషత్తులో నున్నది.

అవ. “సరియే యింద్రియములకును విషయములకును గల సాన్నిధ్యమువలనఁ గలుగుచున్నజ్ఞానమునకే కదా ప్రత్యక్ష మందురు. అదియే సర్వజనసాధారణముగాఁ బ్రవర్తించుచున్నదై పదార్థమును నిశ్చయించుటకుఁ గారణ మగుచున్నది. యోగులప్రత్యక్షమో అలౌకిక మగుచున్నది. కావున నాయేకదేశవర్తి యగుప్రమాణము

చేతను వస్తునిర్ణయ మెట్లు కలుగును?" అని శంక రాఁగా నీ సూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. సర్వేషాం నేతి చేన్న ప్రయత్నసాధ్యత్వాత్. ౨౮

భా. అందఱకును నీశ్వరుఁడు ప్రత్యక్షమగుట లేదు కాఁబట్టి యనేకదేశవర్తి యగు ప్రత్యక్షమువలన నీశ్వరసిద్ధి యెట్లగు ననరాదు. ఏమనఁగా:—ఈశ్వరప్రత్యక్షము యోగశాస్త్రప్రసిద్ధములైన యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, సమాధి యనునష్టాంగయోగరూపమైన ప్రయత్నము చేసిననే కలుగును. ఏమహానుభావుఁ డట్టిప్రయత్నమును యోగశాస్త్రములోఁ జెప్పినరీతిని జేయునో ఆతఁడే యీశ్వరునిఁ జూడఁగలఁడు గాని యితరులు చూడఁజాలరు. ఈసంగతి మహాభారతములోని మోక్షధర్మపర్వమునందు:—

"శ్లో. జ్యోతి రాత్మని నాన్యత్ర సర్వభూతేషు తత్సమమ్,
స్వయం చ శక్యతే ద్రష్టుం సుసమాహితచేతసా."

అనఁగా:—ఈశ్వరప్రత్యక్షము తనశరీరమందే కాని మఱియొకచోటునఁ గలుగదు. అతఁడు సకలభూతములయందును సమానుఁడు. అట్టిపరమాత్ముని ధ్యానపూర్వకముగాఁ జిత్తమును స్థిరముగఁ జేసినచో నీజీవుఁడు స్వయముగాఁ జూడఁగలఁడు. అనివ్యాసభగవానుల వారు చెప్పియున్నారు. కావున నీశ్వరప్రత్యక్షము పురుషప్రయత్నమున కధీనమై యుండుటంబట్టి యీశ్వరుఁడు సర్వజనసాధారణముగాఁ బ్రత్యక్షము గాఁడని తెలిసికోఁదగును. యోగుల కగు ప్రత్యక్షము గూడ లౌకికమే యగుటవలన "యోగుల కగు నీశ్వరప్రత్యక్ష మలౌకిక మగుటచే నది వస్తునిర్ణాయకము గాదు" అను మీవాద మొప్పుకోఁదగినది కాదు. అలౌకిక మనఁగా నేమి? లోకులు సాధింపరానిదియా? ఒండె నందఱయందు ననుగతమై యుండనిదియా? యోగులు గూడ లోకములోని వారే కనుక "లోకులు సాధింపరానిది" అనుటకు వీలు లేదు. అందఱకును అన్నివస్తువులును బ్రత్యక్ష మగుట లేదు గనుక "అందఱియందును ననుగతమై యుండనిది" అనుటకును

పీలు లేదు. ఒక్కయీశ్వరునకుఁ దక్కఁ దక్కినయందఱకును నెప్పుడును అన్నివస్తువులును బ్రత్యక్షమగుట లేదేలేదు. కావున లౌకికాలౌకికముల కింతమాత్రమే విశేషము. ఎవని కేది ప్రత్యక్ష మగునో వాని కది లౌకికము. ఏది ప్రత్యక్షము కాదో యది యలౌకికము. ఇంతమాత్రముచేతనే ప్రత్యక్షమునకుఁ బ్రామాణ్యము గాని యప్రామాణ్యము గాని సిద్ధింప నేరదు. ఒక పండితునిచే నధ్యయనము చేయఁబడినశాస్త్రము వేలకొలఁది చదు వెఱుఁగనివారియెదుట నప్రమాణిక మెప్పుడును గాదుగా! కన్ను లున్నవానిచేఁ జూడఁబడినవస్తువు పలుమంది గ్రుడ్డివారికిఁ బ్రత్యక్షము గాకున్నను అది యనవస్థితము గానే. అనఁగా నెటుల నైనను అది స్థిరముగానే యుండును. అటులనే యొక యోగికిఁ బ్రత్యక్ష మగుటవలన నందఱకును బ్రత్యక్షము గాకపోయినను "ఈశ్వరుఁడు ప్రత్యక్షముగాఁడు" అని నిర్ధారణ సేయరాదు. లౌకిక మగుప్రత్యక్షమే ప్రమాణ మైనచో నలౌకికము లగుపదార్థములను దెలుపుడుసేయు యోగశాస్త్రము మొదలగునవి కూడఁ బ్రమాణములు కాకపోవలసి వచ్చును. కావున యోగుల కగునీశ్వరప్రత్యక్షమలౌకికము గా దని తెలిసికోఁ దగును.

అవ. "ఇపుడు మీరు చెప్పినచొప్పున నీశ్వరుఁడు యోగులకుఁ బ్రత్యక్ష మగుఁగాక. కాని స్త్రీలు మొదలుగాఁగల విషయములను విడువఁజాలని వారమును, గురూపదేశప్రకారము యమము నియమము మొదలగు యోగాంగముల ననుష్ఠించు పరిశ్రమను సహింపఁ జాలని వారమును, మలిన మైనయంతఃకరణము గలవారమును నగుమావంటి వారల కీశ్వరుఁడు ప్రత్యక్ష మగు ననుటకు నిశ్చయ మెట్లు గలుగును?" అని శంక రాఁగా నీసూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. ప్రమాణదోషే ప్రమేయాఽభావో నాఽతిప్రసంగాత్. ౨౫

భా. ప్రమాణమునకు దోషము గలిగియున్నప్పుడు పదార్థము లే దని చెప్ప వలను పడదు. అట్లు చెప్పినచో నతిప్రసంగ మనుదోష మొకటి తటస్థించును. అది యెట్టి దందువేమో వినుము. గ్రుడ్డివాని యెదుట నున్న ఘటము పటము మొదలగు పదార్థములు లేకపోవలసి

వచ్చును. చదువురానివానియెదుటను జదువుకొన్నవానిశాస్త్రము నిరర్థకమగును. ఈరీతిగా నంతటను నతిప్రసంగము గలుగును. అట్లు గలిగినచోఁ బ్రమాణప్రమేయవ్యవహార మంతయు లోపించియే పోవును. కావున గ్రుడ్డివాఁడు చూడఁజాలకపోయినను ముందర నున్నఘటము పటము మొదలగు వస్తువుల కెట్లభావము లేదో యెట్లు చదువఁజాలనిమాత్రమున శాస్త్రము నిరర్థకము గాదో యట్లే యోగాభ్యాసమన నెట్టిదో యెఱుఁగని వేలకొలఁదిజనులు చూడఁజాలనియంత మాత్రమున నీశ్వరప్రత్యక్షమున కభావము చెప్పవలనుపడదు. కావునఁ దమతమ యంతఃకరణములు మాలిన్యాది దోషదూషితము లగుటవలన నీశ్వరుఁడు తమకుఁ బ్రత్యక్షము కాలే దని యప్రత్యక్షత్వ మతనికిఁ జెప్ప టుచితము గాదు. మఱియుఁ దమరు, స్త్రీలు మొదలుగాఁగల విషయములయం దాసక్తిని వదలుకొని యంతఃకరణమునందలి దోషమును దొలఁగించుకొనుటకుఁ దగినయమనియమాదిప్రయత్నము చేయఁజాలనివా రగుచుచో నది తమదోషమా? భగవంతుని దోషమా? చెప్పుఁడు? "మాదే" అని యొప్పుకొందురేని యాదోషము తొలఁగిపోవుట కేదేని యుపాయమును జూచికొనుఁడు. రోగము తటస్థించినప్పుడది కుదురుటకు మందు పుచ్చుకొనుచున్నారు కారా? అటులనే. "అట్టి యుపాయమును జేసికొనుటకు శక్తి లేదు" అందురేని యీశ్వరుని బ్రత్యక్షము చేసికొన్నవ్యాసులు, పతంజలి, వసిష్ఠు మొదలగుఋషిభగవానులవాక్యములను బ్రత్యక్షప్రమాణ మగు వేదములవచనములను ఆశ్రయించియే యీశ్వరుని నారాధించుచుండుఁడు.

ఇట్లు శ్రీ బ్రహ్మానందస్వాములవారిచే సంస్కృతమున రచింపఁబడినభాష్యము ననుసరించి పురాణం - సూర్యనారాయణతీర్థులచే నాంధ్రీకరింపఁబడినయీశ్వరదర్శనభాష్యమునందు మొదటిపాదము సమాప్తమయినది.





శ్రీ ర స్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# ఈశ్వర దర్శనము.

---

## ద్వితీయపాదము.

అవ. పైనఁ జెప్పినరీతిగా "ఈశ్వరారాధనము తప్పక చేయఁదగినది" అని ప్రథమపాదమునందుఁ జెప్పి శాస్త్రాదిప్రమాణత్రయముచే నీశ్వరుఁ డున్నాఁ డని చూపించి యిపు డాయీశ్వరు నారాధించురీతిని నిరూపించుటకుఁగా రెండవపాద మారంభింపఁబడుచున్నది. అందుఁ బూర్వము "తప్పకుండ నీశ్వరారాధనము చేయఁదగినది" అని చెప్పఁబడి యుండుటచే నాయారాధనకు స్వరూప మెట్టిది యని తెలిసికొన నిచ్ఛ గలుగఁగాఁ జెప్పుచున్నాఁడు:—

సూ. భక్తి రేవాఽఽరాధనమ్. ౧

భా. భక్తి యనఁగా భజనము. భజన మనఁగా సేవించుట. "సూ. భజ సేవాయామ్" అని పాణిన్యాచార్యులవారు సూత్రించియున్నారు. మనస్సుచేతను వాక్కుచేతను కర్మములచేతను భగవంతుని సేవించుచుండుటయే యారాధన మని చెప్పఁ బడుచున్నది. సూత్రములోని "ఏవ" కారముచేతను భక్తిని గలిగింపని సకామములగు యజ్ఞాదికర్మములు నిషేధింపఁబడుచున్నవని తెలియవలయును. అనఁగా సకామకర్మము నెవ్వరును నీశ్వరారాధన మని చెప్పరు. కేవలము భక్తి గాని యాభక్తిని గలిగించు నిష్కామకర్మమును గాని యీశ్వరారాధన మందురు. ఈసంగతి ముందు "సూ. విక్షేపహేతుత్వాన్న బహుళమ్" అనుచోటునఁ జెప్పఁబడును.

అవ. "భక్తియే యీశ్వరారాధన మని చెప్పితిరి గదా! ఆ భక్తి యెట్లు చేయఁబడుచున్నది?" అని తెలిసికోఁగోరఁగా నీక్రింది సూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. తదాజ్ఞానుస్మృతే రభ్యర్చనా చ్చ. ౨

భా. ఆయీశ్వరునియాజ్ఞ ననుసరించి నడుచుకొనుచుండుటవల నను, ఆయనను బూజించుచుండుటవలనను, ఆయనయెడల భక్తి గలుగుచుండును.

అవ. "ఆపరమేశ్వరునియాజ్ఞ యనఁగా నెట్టిది? దాని ననుసరించి నడుచుకొనుచుండుట యన నేమి?" అని తెలిసికోఁగోరఁగా నందు ముందుగా నాజ్ఞాస్వరూపమును జూపించుచున్నాఁడు:—

సూ. ఆమ్నాయ స్తజ్జాతత్వాత్. ३

భా. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, ఆథర్వణవేదము ననునవియే యీశ్వరునియాజ్ఞ యని తెలిసికోఁ దగును. ఏమనఁగా— ఆనాలుగువేదములును ఆయనవలననే యావిర్భావమును బొందినవి. ఈవిషయమై:—

"శ్రు. అస్య మహతో భూతస్య నిఃశ్వసిత మేత ద్యదృ
గ్వేదో యజుర్వేద స్సామవేదో ఽథర్వాంగిరసః"

అనఁగా—ఋగ్యజుస్సామాథర్వవేదములు నాలుగును మహాభూతస్వరూపుఁ డగుపరమేశ్వరుని నిఃశ్వాసములే. అని శ్రుతియే చెప్పుచున్నది. మఱియు "సూ. శాస్త్రయోనిత్వాత్" అనఁగా వేదరూపమగుసమస్తశాస్త్రమునకును కర్త యగుటీశ్వరుఁడు సర్వజ్ఞుఁడు. అని బ్రహ్మమీమాంసలో వ్యాసభగవానులవారు సూత్రించి యున్నారు. సూత్రములోని "ఆమ్నాయ" శబ్ద మిచట భగవద్గీతకును, మను, యాజ్ఞవల్క్య, పరాశరాదులచేఁ జేయఁబడిన స్మృతులకును నుపలక్షణ మని తెలియవలయును. ఏమన:—వేదానుసారిణు లగు స్మృతులు వేదములలోని యర్థమునే బోధించుచుండుటవలన నీశ్వరునియాజ్ఞలనుట యుక్తముగానే యున్నది.

అవ. ఇట్లాజ్ఞాస్వరూపమును నిరూపించి యిపుడు దాని ననుసరించి నడుచుకొనుటను వర్ణించుచున్నాఁడు:—

సూ. విహితార్థానుష్ఠానమ్. ४.

భా. వేదశాస్త్రములచే నాచరింపఁదగినవిగాఁ జెప్పఁబడిన చోదనాత్మకము లగునేయమనియమాదికర్మములు గలవో వానిని యథావిధిగా ననుష్ఠించుచుండుటయే యీశ్వరునియాజ్ఞ ననుసరించి నడుచుకొనుట యని చెప్పఁబడుచున్నది. సూత్రములోని "అర్థ" పదముచేఁ గ్రమముగా ననర్థములను గలిగించు శ్యేనయాగము మొదలగు కర్మములు వేదవిహితము లైనను ముముక్షుజనులు చేయఁదగినవి కావని తెలుపుడు చేయఁబడుచున్నది. ఈవిషయమై "సూ. చోదనాలక్షణో౽ర్థో ధర్మః" అనఁగా నేకర్మముల నాచరింపవలసిన దని వేదములు ప్రేరేపించుచున్నవో వేని నాచరించుటవలన ననిష్టఫలము కలుగదో ఆకర్మములే ధర్మము. అని కర్మమీమాంసలో జైమిన్యాచార్యులవారు సూత్రించియున్నారు. కావున నేకర్మములు వేదశాస్త్రవిహితములై యిహలోకపరలోకములయం దనిష్టఫలమును గలిగింపక యుండునో వానినే విధిపూర్వకముగా ననుష్ఠింపవలయును గాని వేదశాస్త్రవిహితము లైనను గ్రమముగా ననర్థమును గలిగించుకర్మముల ననుష్ఠింపఁగూడ దని యభిప్రాయము.

అవ. "శ్లో. పథ్యే ౽సతి గదార్తస్య కి మౌషధనిషేవణైః." అనఁగాఁ బథ్యము చేయనిరోగి కౌషధసేవ యేమిప్రయోజనము? అనున్యాయమున వేదశాస్త్రవిహిత మైనధర్మము ననుష్ఠించు పురుషుఁడు జీవహింస, పరస్త్రీగమనము, అసత్యభాషణము మొదలైన ప్రతిషిద్ధకర్మములను వదలనిచో నవు డీశ్వరునియాజ్ఞను యథావిధిగాఁ బాలింపనివాఁడే యగుచున్నాఁడు. కావున నీసూత్రముచే నింక నొక సంగతి చెప్పుచున్నాఁడు:—

సూ. విపరీతవర్జనం చ. ౫.

భా. విపరీతము లనఁగా శ్రుతిస్మృతిప్రతిషిద్ధములును, అకరణీయములుగాఁ జెప్పఁబడినవియు నగుహింసా౽స్తేయాదికర్మములు. వానియొక్క వర్జన మనఁగా సర్వవిధములచేతను బరిత్యజించుట యని యర్థము. ఈరీతిగా విహితార్థానుష్ఠానము, నిషిద్ధకర్మవర్జనమును జేయుచున్నపురుషుఁడు బాగుగా నీశ్వరాజ్ఞ ననుసరించినవాఁ డగుచున్నాఁడు.

అవ. "ప్రథమపాదమునందు జీవుఁడు పరాధీనుఁ డనియు వానిని భగవంతుఁ డెట్లు ప్రేరేపించునో యట్లు చేయుచుండు ననియుఁ జెప్పఁబడినది గదా! ఇపు డేల యిట్లు విహితార్థానుష్ఠానము, ప్రతిషిద్ధవర్జనము నని మరలఁ గ్రొత్తగా విధింపఁబడుచున్నది? పరాధీనుఁ డగుజీవునకు విహితప్రవృత్తి నిషిద్ధనివృత్తి యెట్లు సంభవించును?" అని శంక రాఁగా నీసూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. న సర్వథా పారతంత్ర్యం కర్మాధికారిత్వాత్. ౬.

భా. ఆలోచింపఁగాఁ బూర్వము జీవుఁడు పరమేశ్వరున కధీనుఁ డనియే చెప్పఁబడినది. అయినను జీవుఁడు కర్మాధికారి గనుక శుభాశుభకర్మముల నాచరించువిషయమై సర్వవిధములచేతను బరాధీనుఁ డని యంగీకరించుటకు వలను పడదు. శ్రుతిస్మృతివిహితము లగుకర్మముల నాచరించువిషయమై జీవునకే యధికారము గలదు. కావున జీవుఁడు సర్వవిధములచేతను బరాధీనుఁడు గాఁడు.

అవ. ఈముందుఁ జెప్పఁబోవుకారణముచేఁగూడ జీవుఁడు సర్వవిధములచేతను బరాధీనుఁడు గాఁ డని చెప్పుచున్నాఁడు:—

సూ. శాస్త్రవైయర్థ్యాపత్తేశ్చ. ౭.

భా. జీవునకు శుభాశుభకర్మముల నాచరించువిషయమై స్వాతంత్ర్య ముండిననే విధినిషేధరూపము లగుశాస్త్రము లన్నియు సార్థకము లగుచుండును. జీవునకు సర్వవిధములచేతను బారతంత్ర్యమే యున్నచో శాస్త్రము లన్నియు వ్యర్థములే యగును. అధికారి లేకున్నచో నధికారవిధాన మెప్పుడును యుక్తమై యుండదు గదా! అటులే యయినచో నీశ్వరుఁడు మొదలుగాఁగలశాస్త్రకారు లందఱును పిచ్చివాండ్ర నియే చెప్పవలసి వచ్చును. కావున జీవునకు సర్వవిధములచేతను బారతంత్ర్యము లేదు. „ అటులేని పూర్వము చెప్పిన "ఏష ఏవహ్యేవ సాధు కర్మ కారయతి, అజ్ఞో జంతు రనీశో౽యమ్" అని మీరు చూపిన శ్రుతిస్మృతిప్రమాణములకును „స్వప్రయత్నా త్తత్సిద్ధి రితి చేన్న.- అన్యతంత్రత్వా జ్జీవస్య" అనుమీమాంసాలసూత్రమునకును గతి యేమి?"

అందు వేమో యీవిషయమై జీవుఁ డెంతవఱకుఁ బరాధీనుఁడో యెంత వఱకు స్వాతంత్రుఁడో నిర్ణయించి చెప్పెదను వినుము.

"శ్రు. ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం
వృక్షం పరిషస్వజాతే, తయో రన్యః పిప్పలం
స్వా ద్వత్త్యనశ్న న్నన్యో ఽభిచాకశీతి."

అనఁగా:—రెండుపక్షులు గలవు. అవి జంటగా నుండును. ఒకదాని కొకటి మిత్రము, అవి రెండును ఒకేచెట్టు నాశ్రయించి యున్నవి. ఆరెంటిలో నొకటి (జీవుఁడు) రుచిగా నుండు రావియాఁకులను దినుచుం డును. రెండవది (ఈశ్వరుఁడు) తినకుండ నుండి దీనిచేఁ దినిపిం చుచుండును. అనుసథర్వవేదవాక్యముచేత జీవుఁడు కర్మఫలము ననుభ వించుచుండు ననియు నీశ్వరుఁ డసంగుఁడై యుండి జీవునిచేఁ గర్మఫల మనుభవింపఁజేయుచుండు ననియుఁ జూపఁబడి యున్నది. కావునఁ బూర్వజన్మములందుఁ జేయఁబడిన శుభాశుభకర్మములఫలము ననుభ వింపవలసి వచ్చినపుడు జీవుఁడు పరాధీనుఁ డనియుఁ గ్రొత్తకర్మముల నాచరించునపుడు స్వతంత్రుఁ డనియుఁ దెలిసికొనుము. ఆలోచించి చూడఁగాఁ గ్రొత్తకర్మముల నాచరించుసమయమునఁ గూడఁ బూర్వ జన్మవాసనయొక్క ప్రేరకత్వము లేకపోలేదు. అయినను బురుషార్థము చేత నావాసనను జీవుఁడు జయింపఁజాలఁడు. పురుషార్థము చేసినను నెప్పు డావాసన జయింప సాధ్యము గాదో అప్పు డది బలవంతమైన దని తెలిసికొని యధికపురుషార్థము సంపాదింపఁదగి యున్నది. అట్లు సంపాదించినచో నొకజన్మముచేతను గాని యనేకజన్మములచేతనుగాని యావాసనను జయింపవచ్చును. ఈ విషయమై:—

"శ్లో. జన్మాంతరచిరాభ్యస్తా రామ! సంసారవాసనా,
సా చిరాభ్యాసయోగేన వినా నక్షీయతే క్వచిత్."

అనఁగా:—ఓరామచంద్రా! సంసారవాసన యనునది యనేక జన్మములనుండి యభ్యస్తమై పరంపరగా వచ్చుచున్నది. కావునఁ జిర కాలము యోగాభ్యాసము చేసిననే కాని యెప్పటికిని నది క్షీణించు నది కాదు. అని శ్రీరామచంద్రునితో వసిష్ఠభగవానులు చెప్పినట్లుగా

యోగవాసిష్ఠములో వాల్మీకిభగవానుఁడు వ్రాసియున్నాఁడు. "శ్రు. ఏష హ్యేవ సాధు కర్మ కారయతి" అనుశ్రుతిచే నీశ్వరుఁడు శుభాశుభ కర్మములఁ జేయించుచున్నాఁడు నని చూపితిమే యది జీవుఁడు సంపాదించుకొన్న పూర్వజన్మవాసన ననుసరించుటచేతనే యని తెలియఁదగును. అట్లే కానిచో నొకానొకజీవుని శుభకర్మములచే నూర్ధ్వలోకమును నొకానొకజీవుని నశుభకర్మములచే నధోలోకమును బొందించుపరమేశ్వరుఁడు విషముఁడనియు నిర్దయుఁడనియుఁ జెప్పవలసి వచ్చును. అట్లు చెప్పుట మంచిది కాదు. ఆవిషయమున్ను:—

"సూ. వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్ తథాహి దర్శయతి."

అనఁగా:—ఈశ్వరునియందు వైషమ్యము నిర్దయత్వము లేవు. ఎందుచేత ననఁగా నీశ్వరుఁడు జీవుఁడు చేసికొన్న పూర్వజన్మకర్మముల ననుసరించి ఫలము నొసంగుచున్నాఁడు. ఈసంగతి శ్రుతి చూపించుచున్నది. అని బ్రహ్మమీమాంసలో వ్యాసభగవానులవారు సూత్రించి యున్నారు. కావునఁ బూర్వజన్మవాసనాజయము జీవుని ప్రయత్నమున కధీనమగుటం జేసి జీవునకు స్వాతంత్ర్యము గూడ సిద్ధించుచున్నది.

అన. ఈరీతిగా నీశ్వరాజ్ఞానుసరణపదముయొక్క యర్థము నైదు సూత్రములచే నిరూపించి యిపుడు రెండవది యగు "అభ్యర్చన" పదమును వర్ణించుచున్నాఁడు:—

సూ. ద్విధార్చనం వ్యక్తావ్యక్తభేదాత్. ౮.

భా. వ్యక్తము, అవ్యక్తము ననుభేదమువలనఁ బరమేశ్వరుని యర్చనము రెండువిధము లని తెలిసికోవలయును. వ్యక్తము, అవ్యక్తము నని యీశ్వరునకు రెండువిధము లగుస్వరూపము గలదు. ఈ సంగతి.

"శ్రు. ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తం చైవామూర్తంచ."

అనఁగా:—పరమేశ్వరునకు రెండురూపములు గలవు. అందొకటి మూర్తిమంతము. అదియే వ్యక్తరూపము. రెండవది యమూర్తము. అదియే యవ్యక్తము. అని యజుర్వేదీయబృహదారణ్యకోపనిషత్తులోఁ

జెప్పఁబడియున్నది. కావున నీశ్వరార్చనముగూడ రెండువిధములుగానే చేయవలయును.

అవ. "సరియే ముఖ్య మగుటవలన నవ్యక్తుఁ డగుపరమేశ్వరు నర్చించుటయే యుక్తము గాని యవాంతర మగువ్యక్తార్చనచే నేమి లాభము?" అని శంక రాఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. క్రమేణారోహణం దుర్గమత్వాత్. ౯.

భా. వ్యక్తక్రమముచేతనే యూర్ధ్వమునకుఁ బోవుట కాలోచింపవలయును గాని క్రమము లేకుండ నీశ్వరు నర్చింప నభిలషింపరాదు. ఏమనఁగా, అవ్యక్త మగునీశ్వరరూపము తెలిసికొనుటకు సాధ్యముగాదు. స్థూల (ముసలాగ్ర) బుద్ధులు పరమేశ్వరునియవ్యక్తస్వరూపమును వేగముగాఁ దెలిసికోఁజాలరుగా! ఈసంగతి:—

"శ్రు. క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథ స్తత్కవయో వదన్తి"

అనఁగా:—వాఁడి యగుమంగలికత్తిదారమీఁద నడుచుట యెట్లు కష్టమో అట్లే పరమేశ్వరునియవ్యక్తమార్గము దెలిసికొనుట గూడఁ గఠిన మైనది యని పండితులు చెప్పుచున్నారు. అని కఠోపనిషత్తులోఁ జెప్పఁబడి యున్నది. మఱియు:—

"శ్లో. క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్,
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే."

అనఁగా:—ఏపురుషుఁడు తొలుతనే యవ్యక్తపరమేశ్వరు నారాధింపఁదలఁచునో వానికి మిక్కిలి కష్టము సంభవించుచుండును. ఎందుచేత ననఁగా దేహధారు లవ్యక్తమార్గము నతిదుఃఖముచేతఁగాని పొందఁజాలరు. అని భగవద్గీతయందును జెప్పఁబడియున్నది. లోకమునందుఁ గూడ నున్నత మగుస్థానము క్రమముగానే యారోహింపఁబడుచుండుటను మనము ప్రత్యక్షముగాఁ జూచుచున్నేయున్నారము. కావున వ్యక్తక్రమముచేతనే యీశ్వరు నర్చించుట యుక్తము.

అవ. "అటులేని యీశ్వరునకు వ్యక్తస్వరూప మేమున్నది?" యని తెలియఁదలఁచఁగా నీక్రిందిసూత్రముచేఁ జెప్పుచున్నాఁడు:—

సూ. నారాయణః ప్రమాణాత్. ౧౦.

భా. నారాయణుఁ డనఁగా విష్ణుమూర్తియే యీశ్వరునివ్యక్త రూప మని తెలిసికొనుము. విష్ణుభగవానున కీశ్వరత్వమును బ్రతిపాదించు ప్రమాణములు శ్రుతిస్మృతీతిహాసపురాణాత్మకములు పెక్కులు గలవు. అవి యేవనఁగా:—

"శ్రు. నారాయణ ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చ
భావ్యమ్, నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాతః శుద్ధో
దేవ ఏకో నారాయణో నద్వితీయోఽస్తి కశ్చిత్."

అనఁగా:—భూతభవిష్యద్వర్తమానరూప మగునీజగత్తంతయు నారాయణరూపమే. ఆనారాయణుఁడు నిరంజనుఁడు, నిర్వికల్పుఁడు, నిరాఖ్యాతుఁడు, శుద్ధస్వరూపుఁడు, కేవలుఁడు, స్వయంప్రకాశమానుఁడు నై యొప్పుచున్నాఁడు. తనకంటె రెండవవాఁ డొక్కఁడును లేఁడు. అని నారాయణోపనిషత్తు చెప్పుచున్నది. మఱియు:—

శ్లో. తత్ర యః పరమాత్మా హి స నిత్యం నిర్గుణః స్మృతః,
స హి నారాయణో జ్ఞేయః సర్వాత్మా పురుషో హి సః,
స ఈశో భగవాన్ దేవః సర్వభూతాత్మభావనః."

అనఁగా:—ఏపరమాత్ముఁడు నిత్యుఁ డనియు నిర్గుణుఁ డనియుఁ జెప్పఁ బడుచున్నాఁడో అతఁడే నారాయణుఁ డని తెలిసికోఁ దగును. ఆనారాయణుఁడు సర్వాత్మస్వరూపుఁ డగుపురుషుఁడు. ఆభగవానుఁడే సర్వప్రపంచమునకు నీశ్వరుఁడు. అతఁడే సర్వభూతములను బరిపాలించువాఁడు. అని మహాభారతమోక్షధర్మపర్వమునందును జెప్పఁబడి యున్నది. ఇట్లనేకశ్రుతిస్మృతివాక్యములు నారాయణున కీశ్వరస్వరూపత్వమును బ్రతిపాదించుచున్నవి.

అవ. ఈకారణమునుబట్టి కూడ విష్ణున కీశ్వరత్వము తెలియవలయు నని యీముందుసూత్రముచేఁ జెప్పుచున్నాఁడు:—

సూ. తద్ధర్మాన్వయాచ్చ. ౧౧.

భా. అవ్యక్తుఁ డగునాయీశ్వరునకు శ్రుతిస్మృతీతిహాసాదులయందు జగత్కర్తృత్వము మొదలగునవియు సర్వజ్ఞత్వము సర్వశక్తి

త్వము మొదలగునవియు నగునేధర్మములు వినఁబడుచున్నవో అవి య
న్నియు నారాయణునందే సమన్వయించుచున్నవి. ఈవిషయమై:—

"శ్రు. పురుషో హ వై నారాయణో ఽకామయత, ప్రజాః సృజే
యేతి, నారాయణా త్ప్రాణో జాయతే, మనః సర్వేంద్రి
యాణి చ, ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ."

అనఁగా:—నారాయణుఁ డనుపురుషుఁడు సృష్టికిఁ బూర్వము 'జగద్రూప మైనప్రజను సృజించెదను' అని యిచ్ఛయించెను. తరువాత నానారాయణునిసంకల్పమువలనఁ బ్రాణము మనస్సు సర్వేంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, సర్వజగత్తుల్లను ధరించుభూమి యివి యన్నియుఁ బుట్టినవి. అనుశ్రుతివచనమును,

"శ్లో. అహం సర్వస్య ప్రభవో మ త్తః సర్వం ప్రవ ర్తతే,
వేదా ఽహం సమతీతాని వ ర్తమానాని చార్జున!"

అనఁగా:—ఓయర్జునా! నేనే సమస్తప్రపంచమునకును బుట్టుటకుఁ గారణము. నావలననే సర్వప్రపంచమును బ్రవ ర్తించుచున్నది. నేను భూత భవిష్య ద్వ ర్తమానములయందలిభూతముల నన్నింటిని నెఱుంగుదును. అనుగీతావచనమును బ్రమాణము. కావున వ్య క్తము, అవ్య క్తము ననుభగవంతునిరెండుస్వరూపములలోనను సర్వధర్మములు ను సమానముగానే యున్నవి గనుక నారెంటికిని ఏకరూపత్వమే నిశ్చ యింపఁదగి యున్నది.

అవ. "సరియే కాని శివుఁడు, శ క్తి మొదలగువారికిఁ గూడ నీశ్వరత్వ మంతటను వినఁబడుచున్నది గదా! ఒక్క విష్ణునకే యీశ్వ రత్వమును మీరు ప్రతిపాదించుచున్నా రేల?" అని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. తన్మయత్వా చ్ఛివాదే ర్న పృథ క్త్వమ్. ౧౨.

భా. శివుఁడు, శ క్తి మొదలగునీశ్వరవిగ్రహములకును విష్ణున కును భేదము లేదు. ఏమనఁగా, శివాదులు తన్మయులు, అనఁగా విష్ణు స్వరూపులే యయి కన్పట్టుచున్నారు. వ్య క్తిమాత్రమునకు భేద

మున్నను వారికిని విష్ణునకును భేదము చెప్పుటకు వలనుపడదు. ఈ విషయమై :—

"శ్రు. స బ్రహ్మా స శివ స్సేన్ద్ర స్సో ఒక్షరః పరమ స్స్వరాట్."

అనఁగా:—అయీశ్వరుఁడే బ్రహ్మా, శివుఁడు, ఇంద్రుఁడు. అతఁడే యక్షరుఁడును నందఱికన్న నెక్కువవాఁడును స్వతంత్రుఁడును. అని వేదవాక్యము.

"శ్లో. రుద్రో నారాయణ శ్చైవ స త్త్వ మేకం ద్విధా కృతమ్,
లోకే చరతి కౌన్తేయ! వ్యక్తిస్థం సర్వకర్మసు."

అనగా:—ఓధర్మరాజా! శివుఁడు, నారాయణుఁడును ఒక్కసత్త్వమే కాని రెండువిధములుగా విభజింపఁబడి జీవులకర్మములయొక్క వ్యవస్థకొఱకు లోకమునందు సంచరించుచున్నారు. అని భాగవతమోక్షధర్మపర్వము,

"శ్లో. య స్త్వాం వేత్తి స మాం వేత్తి య స్త్వా మను స మా మను,
నావయో రంతరం కించి న్మా తే భూ ద్బుద్ధి రన్యథా."

అనఁగా:—ఓశివా! ఎవఁడు నిన్నుఁ దెలిసికొనుచున్నాఁడో వాఁడు నన్నును దెలిసికొనుచున్నాఁడు. ఎవఁడు నిన్ను సేవించుచున్నాఁడో వాఁడు నన్నును సేవించుచున్నాఁడు. కనుక మనయిద్దఱకును లవలేశమైనను భేదములేదు. నీవు మఱొకవిధముగాఁ దలంపకుము. అని యచ్చటనే రుద్రునిగూర్చి నారాయణమూర్తి చెప్పినవాక్యమును ప్రమాణము.

సూ. ఏ తేన తదర్చనం వ్యాఖ్యాతమ్. ౧౩.

భా. పైనఁ జెప్పినరీతిగా విష్ణునకును శివుఁడు, శక్తి మొదలగు వారికిని భేదాభావమును బ్రతిపాదించి యుండుటవలన నాశివాదుల యర్చనగూడ నుపన్యసింపఁబడినట్లె యని తెలియఁదగును. అనఁగా నెట్లు విష్ణునియర్చనావిధి చూపఁబడినదో యట్లే వారివారియర్చనయు నని తెలిసికొనునది. ఏయేయుపాసకున కేయేదేవతావిగ్రహమునం దిష్టముండునో ఆయాయుపాసకుఁడు ముందు చెప్పఁబోవురీతిని విష్ణుని

వలెనే యాయాదేవతావిగ్రహము నారాధించుచుండవలయునని యభిప్రాయము.

అవ. "సరియే యిపుడు తాము చెప్పినసంగతి యంతయు బాగుగనే యున్నది కాని యంతటను వ్యాపకుఁడైన చూపట్టునాపరమేశ్వరుఁ డొక్కవిష్ణుశరీరమందే యేల యుండును" అని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాడు :—

సూ. వ్యాపకస్యాప్యేకదేశభాక్త్వం తేజోవత్. ౧౪.

భా. పరమేశ్వరుఁ డంతటను సమానముగా వ్యాపకుఁడై యయి యున్నాఁడు. అయినను, ఆయన కొక్కశరీరమం దునికి సంభవింపవచ్చును. ఈవిషయమై దృష్టాంతమును జెప్పుచున్నాను. వినుము. ఎట్లు తేజోధాతువు చరాచరప్రపంచమునందలి యన్నిపదార్థములయందును నిండి యున్నను విశేషముగా సూర్యమండలమునం దున్నదై కన్పట్టుచున్నదో అట్లే పరమాత్ముఁడును అంతటను సమానరూపముగా నిండి యున్నను విశేషముగా విష్ణువ్యక్తియందే యుండును. అని తెలిసికొనుము.

అవ. "ఈశ్వరుఁడు కోరిక లన్నియు నెఱవేఱినవాఁడఁట గదా! అట్టివాఁడు విష్ణుశరీరము నేల ధరింపవలయును" అని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు :—

సూ. భువనవ్యవస్థార్థమ్. ౧౫

భా. తనచే సృజింపఁబడినపదునాలుగులోకములను వ్యవస్థ చేయుటకై పరమేశ్వరుఁడు విష్ణునియాకారమున నావిర్భవించుచుండును. ఏలయన బ్రహ్మాండములో నిండియున్న సకలజీవులకును వారివారిశుభాశుభరూపమైనకర్మములకుఁ దగినట్లు ఫల మిచ్చుట మొదలైనవ్యవస్థ యేదియైన నాకారము ధరించిననే కాని లెస్సగా సంభవింపదు. మధుకైటభాదిరాక్షసులవధమూలముగాఁ జతురాననుఁడు మొదలగువారిని రక్షించుట యనుపని శరీరము లేకుండ నెట్లును గాఁజాలదు గదా! వస్తుతః; సంకల్పమాత్రముచేతనే పరమేశ్వరుఁ డన్నిపనులను నెఱవేర్పఁ గలఁడు. అయినను స్వతంత్రముగా లీలావిహారమునకుఁగా నాయాపను

లు విష్ణుశరీరమును ధరించి లీలలే చేయుచుండును. ఈసంగతి వేదవ్యాస భగవానులవారును:—

"సూ. లోకవత్తు లీలాకైవల్యమ్."

అనఁగా:— ఎట్లు రాజులు మొదలగు గొప్పవారు పూర్ణకాము లయ్యును కేవలమును లీలకై విహరించుచుందురో యట్లే పరమేశ్వరుఁడును విలాసార్థమై విష్ణ్వాదిశరీరములను ధరించి జగత్సృష్టిస్థితిసంహారములను జేయుచుండును. అని బ్రహ్మమీమాంసలో సూత్రించి యున్నారు.

అవ. పైనఁ జూపినదియే కాకుండ నింక నొక ప్రయోజనము కూడఁ గల దని యీక్రిందిసూత్రముచేఁ జెప్పుచున్నాఁడు:—

సూ. ఉపాసకానుగ్రహార్థం చ. ౧౬.

భా. తన్ను నుపాసించుచుండెడివారియందలియనుగ్రహమును జూపుటకై కూడ నవ్యక్తుఁడగుపరమాత్మునకు విష్ణ్వాకారమును ధరించుట సంభవించుచున్నది. తనయొక్కస్వరూపమును ధ్యానించునభిలాష గలభక్తులకొఱకు "ఎట్లు నీరు శంఖము చక్రము మొదలగునవి హస్తములయందుఁ గలదియు, రత్నకిరీటముచే నలంకరింపఁబడినదియు, వనమాలచే భూషింపఁబడినదియు, నాలుగుబాహువులు గలదియు, పసపుపచ్చబట్ట గట్టుకొనుచుండునదియు, శరత్కాలమందలియాకాశముతో సమానమై నల్లఁగా వెలుఁగుచుండునదియు, మురుగులు కుండలములు మొదలగు నగలచే సొగసు గుల్కుచుండునదియు, అప్పుడు వికసించిన తామరపూవురేకులతో సరిగా నొప్పుకన్నులుగలదియు, మందహాసముతో సుందరమైన వదనారవిందము గలదియు, మహామాయాస్వరూపిణి యగు లక్ష్మి వామభాగమున నుండునదియు, సర్వజ్ఞత్వము మొదలైన యనంతము లగుకల్యాణగుణముల కాశ్రయమైనదియు నగునాస్వరూపమును వేగముగా ధ్యానమార్గమును బొందించి సంసారరూప మయిన బంధమునుండి శీఘ్రముగా విడుదల కాఁగలరు?" అని యవ్యక్తుఁడే యైనను విష్ణుసంబంధమైనవ్యక్తి నంగీకరించి ప్రకాశించుచుండును. ఏదియేని యాకారమును ధరింపకుండ నవ్యక్తుఁడగుపరమాత్మునిస్వరూ

పము తత్ క్షణము ధ్యానమార్గమునకు రాఁజాలదు గదా! ఈసంగతి,

"శ్లో. ఆకారవాం స్త్వం నియమా దుపాస్యో,
న వస్త్వనాకార ముపైతి బుద్ధిః."

అనఁగా:—ఓపరమేశ్వరా! నీవు నియమముగా నేదేని యాకారము గలవాఁడ వయిననే యుపాసింపఁదగి యున్నావు. ఏమన, ఆకారము లేనివస్తువును బుద్ధి యెన్నటికిని గ్రహింపఁ జాలదుగా! అని సర్వదర్శన సంగ్రహమున శ్రీమాధవాచార్యులవారు వ్రాసియున్నారు.

అవ. "విష్ణునివ్యక్తులును అచ్చటచ్చట వేఱువేఱుగా నున్నట్టు వినఁబడుచున్నది. ఎట్లనఁగా:—వైకుంఠలోకములో నున్నది యొకటి. క్షీరసముద్రముమధ్య నున్న శ్వేతద్వీపములో వెలుఁగుచున్న దొకటి. పాతాళలోకమున నున్న శేషనాగునిశరీరమునందు శయనించియున్నది యొకటి. గోలోకములో విలాసముల ననుభవించుచున్న దింకొకటి. ఈరీతిగా నున్నవి గదా! అందుఁ బరమేశ్వరునిశరీర మేది?" అని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. స్థానభేదే ఽప్యేకత్వ మభిన్నత్వా ద్యోగివత్. ౧౭.

భా. వైకుంఠము, శ్వేతద్వీపము మొదలైనస్థానములకు భేద మున్నను భగవంతునివ్యక్తు లన్నియుఁ బరస్పరమును భేదములేమిం జేసి యొక్కటి యనియే నిశ్చయింపవలయును. కేవలమును నుపాసకుల యానుకూల్యమునకై వ్యక్తిభేదము తోఁచుచున్నది. అంతమాత్రమున నావ్యక్తులకు భిన్నత్వము సంభవింపదు. అందువిషయమై యీదృష్టాంతము వినుము. ఎట్లు యోగి యోగబలముతోఁ గూడినవాఁడై సంకల్పమాత్రముచేతనే యనేకము లగుశరీరములను నిర్మించుకొని వేఱువేఱు కార్యములను జేయుచుండునో? ఈవిషయమై:—

"శ్లో. ఆత్మనాం చ సహస్రాణి బహూని భరతర్షభ!
యోగీ కుర్యా ద్బలం ప్రాప్య తైశ్చ సర్వై ర్మహీం చరేత్.
ప్రాప్నుయా ద్విషయాన్ కైశ్చి త్కైశ్చి దుగ్రం తపశ్చరేత్.
సంహరే చ్చ పున స్తాత! సూర్య స్తేజోగుణా నివ."

అనఁగా:—భరతవంశపువారిలో శ్రేష్ఠుఁడ వగు నోధర్మరాజా!

యోగి యోగబలము నవలంబించి తనశరీరము లనేకములుగాఁ జేయును. ఆశరీరములన్నిటితోఁ దాను భూమియందు సంచరించుచుండును. వానిలోఁ గొన్నింటిచేతను విషయముల ననుభవించుచుండును. మఱికొన్నిశరీరములచేత నుగ్రమైన తపస్సు చేయుచుండును. తరువాత నెట్లు సూర్యభగవానుఁడు సాయంకాలమునఁ దనకిరణములను సంకోచించుకొనుచుండునో యట్లే యోగియుఁ దనశరీరముల నన్నింటిని సంకోచించుకొనుచుండును. అని మహాభారతములోని శాంతిపర్వపు మోక్షధర్మపర్వములో ధర్మరాజునుగూర్చి భీష్మాచార్యులు చెప్పినట్లుగా మనవ్యాసభగవానులవారు వ్రాసియున్నారు. అట్లే పరమేశ్వరుఁడును మాయచేతను వేఱువేఱువ్యక్తులు గలవాఁడై వేఱువేఱుచోటుల నున్నట్టు కన్పట్టుచుండును. కాని యావ్యక్తులకు లవలేశమును భేదము లేదు. అవి యన్నియు నతనిసంకల్పముచేతనే నిర్మింపఁబడినవి యని తెలిసికొనుము.

అవ. "సరియే విష్ణుసంబంధమైనవ్యక్తులకుఁ బరస్పరమును భేదము లేకపోయినఁ బోవుఁగాక. కాని యావ్యక్తులలో నేవ్యక్తి ముఖ్యమైనది." అని తెలియఁగోరినపుడు నిర్ణయమును జెప్పుచున్నాఁడు:—

సూ. వైకుంఠాకసః పూర్వత్వాత్. ౧౮

భా. ఇదివఱకుఁ జెప్పఁబడినభగవంతునివ్యక్తు లన్నింటికిని సర్వజ్ఞత్వము మొదలగు గుణము లన్నియు సమానమే యయినను వైకుంఠము నలంకరించుభగవానునివ్యక్తినే యావ్యక్తు లన్నింటిలో ముఖ్యముగా నారాధించవలయును. ఏమన:—వైకుంఠలోకమునం దున్నభగవంతునిస్వరూపము మిగిలినస్వరూపములకన్నఁ బూర్వమే యనఁగా ననాదికాలమునుండియు నావిర్భావమును బొంది యొప్పుచున్నది. ఈవిషయమై:—

"శ్లో. బ్రహ్మణ స్సదనా దూర్ధ్వం త ద్విష్ణోః పరమం పదమ్."

అనఁగా:—బ్రహ్మలోకముకంటెఁ బైఁగా నావిష్ణుభగవానుని దివ్యపద మున్నది. అని భారతము ప్రమాణము. సృష్టియొక్క క్రమమునందుఁ గూడ నూర్ధ్వలోకములు ముందుగాను దరువాత నధోలోకములును సృజింపఁబడినట్లు:—

"శ్రు. ఊర్ధ్వమూలో౽వాక్ శాఖ ఏషో౽శ్వత్థ స్సనాతనః."

అనఁగా:—ఈపరిదృశ్యమాన మైనజగద్రూప మగునశ్వత్థవృక్షము చాలకాలమునుండి యున్నది. దీనిమొదలు మీఁదికిని కొమ్మలు క్రింద కును నున్నవి. అని యజుర్వేదీయకఠోపనిషద్వాక్యము చెప్పుచున్నది. కావున భూమండలాంతర్గత మైన శ్వేతద్వీపము, పాతాళలోకమం దున్న నాగలోకము వైకుంఠలోకమును నిర్మించినవెనుక నే నిర్మింపఁబడిన వని యొప్పక తప్పదు. కాఁగా నారెండులోకములయం దున్న భగవంతుని స్వరూపములు కూడ వైకుంఠమం దున్న భగవంతునిస్వరూపముకన్న వెనుక నే యావిర్భావమును బొందిన వని చెప్పుటయే యొప్పును. గోలో కముగూడ స్వర్గముకంటె మీఁద నున్నదియే కనుక వైకుంఠలోకము తరువాతిదియే యనఁదగును. ఈవిషయమై:—

"శ్లో. త్రయాణా మపి లోకానా ముపరిష్టా న్నివత్స్యసి,
మత్ప్రసాదా చ్చ విఖ్యాతో గోలోకః స భవిష్యతి."

అనఁగా:—ఓసురభీ! నీవు మూఁడులోకములకును మీఁదను నివ సింపఁగలవు. నాయనుగ్రహమువలన నీవు నివసించి యుండుస్థానము నకు గోలోక మనుపేరు ప్రసిద్ధము కాఁగలదు. అని మహాభారతమం దలి యానుశాసనికపర్వమున సురభినిగూర్చి బ్రహ్మ చెప్పిన ట్టున్నవా క్యము ప్రమాణము. మఱియు నందే భగీరథప్రసంగసందర్భమున:—

"శ్లో. అతీత్య సురలోకం చ గవాం లోకం చ భారత!
ఋషిలోకం చ సో౽గచ్ఛ ద్భగీరథ ఇతి శ్రుతమ్."

అనఁగా:—ధర్మరాజా! ఆభగీరథుఁడు స్వర్గలోకమును, గోలో కమును, ఋషిలోకమును దాఁటి బ్రహ్మలోకమునకు వెళ్లె నని విన వచ్చుచున్నది. అను భీష్మాచార్యులవాక్యమునుబట్టి కూడ గోలోకము స్వర్గముకన్నఁ బైఁగా నున్న దనియు దానికన్నను బైఁగా మఱికొన్ని లోకము లున్న వనియుఁ దెలియఁదగును. కావున గోలోకమందలిభగ వత్స్వరూపముగూడ వైకుంఠమందలి భగవత్స్వరూపములకంటె వెను క నేయావిర్భావము నొందినది యని చెప్పుటయే యుక్తముగదా! గర్గసం హిత మొదలగుగ్రంథములయందు గోలోకము వైకుంఠముకంటెఁ

బై౯గా నున్నట్లు చెప్పఁబడి యున్నది కాని యది కేవలమును గృష్ణావ తారమాహాత్మ్యమును విశేషించి తెలుపుటకు చేయుటకే యట్లు వర్ణింపఁ బడియున్న దని తెలిసికోవలయును. ఏమనఁగా:—అంశావతార మెప్పు డును అంశిభూతస్వరూపముకంటెఁ బైది గాఁజాలదు గదా! కృష్ణుఁ డంశావతార మైనట్లు:—

"శ్లో. మూలస్థాయీ మహాదేవో భగవాన్ స్వేన తేజసా,
తత్స్థః సృజతి తాన్ భావాన్ నానారూపాన్ మహామనాః,
తురీయార్ధేన తస్యేమం విద్ధి కేశవ మచ్యుతమ్."

అనఁగా:—ఓధర్మరాజా! చరాచర ప్రపంచమున కంతకును మూలభూత మైన నైకుంఠలోకమునం దుండెడివాఁడును, దేవతలందఱు లోనను శ్రేష్ఠుఁడును నగువిష్ణుభగవానుఁడు, తన తేజస్సుచేతను వైకుం ఠమం దుండియే నానాప్రకారములగు నాయాపదార్థములను సృజించు చుండును. మహాత్ముఁ డగునతని నానిమిదవయంశమువలన నీకృష్ణుఁ డా విర్భవించె నని తెలిసికొనుము. అని భారతమోక్షధర్మపర్వములోని భీష్మాచార్యులవాక్యమువలన స్పష్ట మగుచున్నది.

అవ. "సరియే కాని చతుర్భుజాద్యాకారములోను నీలాదివర్ణ ములోను గూడి యుండుటవలన విష్ణుశరీరముకూడ మనశరీరమువలెనే పంచభూతములవికార మైన దేహములకుఁ గాకుండును?" అని శంకింపఁ గా నిక్రిందిసూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. న పాంచభౌతికం మాయామాత్రత్వాత్. ౧౯.

భా. చతుర్భుజాద్యాకారము నీలాదివర్ణము గలది యయినను విష్ణుభగవానునిశరీరము మనశరీరములవలెనే పంచమహాభూతములవ లనఁ గలిగిన దని చెప్పరాదు. ఏమన:—అది కేవలమును మాయవ లనఁ బరమేశ్వరునియిచ్ఛచేతనే యట్లు నిర్మింపఁబడినది. ఈశ్వరుఁడు సత్యసంకల్పుఁడు గనుక నేకాలమం దెట్టియిచ్ఛ గలుగునో ఆకాలమం దట్టిరూప మావిర్భవించుచుండును. దానికిఁ బృథివి మొదలైన భూత ములసాయ మక్కఱలేదు. ఈ విషయమై:—

"శ్లో. మాయా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద!
సర్వభూతగుణై ర్యుక్తం నైవం త్వం జ్ఞాతు మర్హసి."

అనఁగా:—ఓనారదా! ఇపుడు నీవు చూచుచున్న నానాప్రకార మగురూపమును నేనే కేవలమును మాయ నవలంబించి సృజించితిని. కావున నీ వీశరీరమును పంచభూతవికార మైనదానినిగాఁ దలంపకుము. అని కృష్ణభగవానుఁడు శ్వేతదీపములోఁ దనవిశ్వరూపమును జూపించినపిదప నారదునిగూర్చి చెప్పిన ట్లున్న భారతమోక్షధర్మపర్వములోని వాక్యమే ప్రమాణము. నరసింహాదిరూపములయం దీసంగతి (పంచభూతములసాయ మక్కఱ లేకుండఁగనే కేవలమును సంకల్పమాత్రముచేతనే నరసింహాదిరూపములు ప్రకట మగుచుండుట) ప్రసిద్ధమే యయి యున్నది. కావున విష్ణుభగవానునిశరీరము కేవలమును సత్త్వామాత్రమే యని తెలియవలయును.

అవ. ఇట్లు పైనఁ జెప్పఁబడినరీతిగాఁ బరమేశ్వరునివ్యక్తస్వరూపమును నిరూపించి యిటుపై దాని నర్చించుప్రకారమును వర్ణించుచున్నాఁడు:—

సూ. బహి రంత స్తదర్చనమ్. ౨౦.

భా. వ్యక్తస్వరూపుఁ డగునావిష్ణుభగవానునియర్చనము రెండువిధములు. అందు మొదటిది బాహ్యార్చనము. రెండవది యంతరర్చనము. ఆరెంటిలో నొకటిగాని రెండింటిని గాని తమతమయధికారము ననుసరించి చేయఁదగును.

అవ. ఇట్లు సామాన్యముగా నర్చన రెండువిధము లని చెప్పి యిప్పు డధికారభేదమునుబట్టి యారెంటిలో విశేషమును జూపుచున్నాఁడు:—

సూ. బాహ్యం గృహిణా మస్థిరచిత్తత్వాత్. ౨౧.

భా. దారాపుత్రాదులతోఁ గూడి గృహస్థాశ్రమసుఖముల ననుభవించు గృహస్థులచిత్త మెప్పుడును కుటుంబపోషణాదిభారముచేతను శ్రౌతస్మార్తకర్మములయందుఁ గల యధికారమువలని భారముచేతను దఱుచుగాఁ బీడింపఁబడుచు నుండక తీరదు గనుక గృహస్థాశ్రమమం దుండువారికిఁ జిత్తస్థైర్యము కలలోనివార్తయే యగుచుండును. కా

వున వారిచిత్తమేకాగ్రముగా నుండదు. వారంతర్ముఖమైనమనస్సుచేతను బాగుగా నీశ్వరుని నారాధింపఁజాలరు. కనుకఁ జిత్తస్థైర్యము లేనివారు బాహ్యార్చనయే చేయుచుండవలయును. సూత్రములో 'ఏవ' కారము లేదు గనుక ననుకూలపడినయెడల గృహస్థులుగూడ మానసపూజ చేయవచ్చు నని యనుజ్ఞ యిచ్చిన ట్లగపడుచున్నది.

అవ. పైనఁ జూపిన బాహ్యార్చన మేప్రకారముగాఁ జేయవలెనో చెప్పవలయు నని యడుగఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. ప్రతిమాయాం సౌకర్యాత్. ౨౨.

భా. ఒకానొకయాధారమందుఁ బూజ సుకరము గనుకఁ బ్రతిమయందే బాహ్యార్చన మాచరించుచుండవలయును. ఆధారము లేకుండ నాధేయ మగు దేవత కావాహనము మొదలైనవి చేయుటకు వీలు కాదు గదా! కావునఁ దమతమయిష్టదైవముయొక్క స్వరూపమును బాహ్యమూర్తియం దుంచి పూజించుటయే ముఖ్యకర్తవ్యము.

అవ. బాహ్యార్చనమున కిదియే కారణముగాక యింకొకకారణమునుగూడఁ జెప్పుచున్నాఁడు:—

సూ. శిష్టపరిగ్రహాచ్చ. ౨౩.

భా. శిష్టు లవలంబించి యుండుటంబట్టి కూడఁ బ్రతిమయందే పూజించుట యుక్తము. శిష్టు లగుపూర్వాచార్యులు మహర్షులునుగూడఁ దఱుచుగా నంతటను బ్రతిమలయందే యీశ్వరుని బూజించువిధానమును రచించియున్నారు. మఱియు శిష్టులగు శ్రీరాముఁడు, మార్కండేయుఁడు, ధర్మరాజు, మొదలుగాఁగల నేయేమాహాత్ములు భగవంతుని బూజించిరో వారందఱును దఱుచుగాఁ బ్రతిమలయందే పూజించుచు వచ్చి రని భారతము మొదలైనయితిహాసములయందు స్పష్టముగా నుండుటయేకాక రామేశ్వరము, శ్రీరంగము, కేదారము, బదరికాశ్రమము మొదలగుపుణ్యస్థలములుగూడ నిశ్చయపఱుచుచున్నవి. కావున శిష్టులసంప్రదాయమువలన నిప్పటికిని బ్రతిమలయందే యీశ్వరుని బూజించుచుండవలయును.

అవ. "ఈశ్వరుని ప్రతిమ యెటువంటిది చేయవలయును." అని తెలిసికోఁగోరఁగా నీక్రిందిసూత్రములచేఁ జెప్పుచున్నాఁడు:—

సూ. తన్నిష్పత్తి రాగమాత్. ౫౪.

భా. ఆప్రతిమానిర్మాణము శాస్త్రమువలనఁ దెలిసికోఁదగును. శ్రుతులు, స్మృతులు, ఇతిహాసములు, పురాణములు మొదలగుగ్రంథములందు విష్ణుభగవానునిస్వరూప మేరీతిగా వర్ణింపఁబడి యున్నదో అటువంటియాకారముగల మూర్తినే యర్చకుఁడు సంపాదించుకోవలయును. శిలామయముగాని లోహమయముగాని చిత్రమయముగాని వీనిలో నేదియైన నొకప్రతిమయందుఁ గాని సాలగ్రామవిగ్రహమునందుఁ గాని సర్వవ్యాపకుఁడైనవిష్ణుభగవాను నావహింపఁజేసి శాస్త్రోక్తవిధిగాఁ బుష్పచందనాద్యుపచారవిశేషములచే నత్యాదరముగా నర్చన చేయవలయు నని యర్థము. మఱియు,

సూ. సాత్త్వికై స్తత్ప్రియత్వాత్. ౫౫.

భా. పెరుగు, పాలు, నేయి, క్షీరాన్నము మొదలగు సత్త్వగుణప్రధానము లైనద్రవ్యములచేతనే భగవంతుని బూజింపవలయును గాని యెకప్పుడును మాంసము మొదలగు రజోగుణప్రధానము లగు ద్రవ్యములచేతనుగాని, మద్యము మొదలగు తమోగుణప్రధానము లగుద్రవ్యములచేతను గాని పూజింపరాదు. సత్త్వగుణమును వృద్ధిసేయు పదార్థములే యాభగవంతున కిష్టమైన వని బాగుగా నెఱుఁగఁదగును. కావున నాయనపూజ సాత్త్వికపదార్థములచేతనే చేయుట యుక్తము గదా! ఇదియునుం గాక,

సూ. మంత్రపూర్వకం విశేషత్వాత్. ౫౬.

భా. ప్రతిమయం దావాహనము మొదలగున వన్నియు మంత్రపూర్వకముగానే చేయవలయును. మంత్రయుక్తముగాఁ జేసినపూజయే కదా విశేషముగా ఫలము నిచ్చునది యగుచున్నది. ఈవిషయమై:—

"శ్రు. యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా
తదేవ వీర్యవత్తరం భవతి."

అనఁగా:—పురుషుఁడేకర్మమును విద్య, శ్రద్ధ, శాస్త్రము ననువాని ననుసరించి చేయునో ఆకర్మమే అధికమైన ఫలమును గలిగించునది యగుచుండును. అని సామవేదములోని ఛాందోగ్యోపనిషద్వాక్యము ప్రమాణ మున్నది. వేదమంత్రములను గాని స్మార్తమంత్రములనుగాని పూజ కుపయోగింపవచ్చును. సూత్రములో 'ఏవ' కారము లేదు గనుక మంత్రము లేకుండఁ గేవలమును భావనామాత్రముననే పూజించినను యథోక్తమైనఫలము నిచ్చు నని సూచింపఁబడినది. కావున సమంత్రకముగాఁ గాని యమంత్రకముగాఁ గాని శ్రద్ధాభక్తులతోఁ జేసినభగవదారాధనము తప్పక ఫలము నిచ్చు నని తెలియవలయును. మఱియు,

సూ. మూర్తిమత్యో ఽనుసంధానం న తన్మాత్రమ్. ౨౭

భా. మూర్తిని బూజించుకాలమునం దామూర్తి యేయీశ్వరునివిగ్రహమో ఆమూర్తి గలచేతనుఁ డగుభగవంతునిస్వరూపము నావిగ్రహమం దనుసంధానము చేయవలయును. ఏల యనఁగా:—శిలాలోహాదిమాత్ర మగుజడపదార్థము పరమేశ్వరునిస్వరూపము గాఁజాలదు. ఈశ్వరస్వరూపము సచ్చిదానందమాత్ర మని కదా శాస్త్రములలోఁ బ్రసిద్ధమై యున్నది. మూర్తియో కేవలమును తమయిష్టదేవతయొక్క స్వరూపాకారములను దెలుపుటకు మాత్రమే యుపయోగించుచున్నది. ముఖ్యముమాత్ర మామూర్తియందు మూర్తిమంతుఁ డగుభగవంతునిచింతనమే విశేషముగా ఫల మిచ్చునది యగుచున్నది యని తెలియవలయును. కావునఁ గేవలమును మూర్తిని సిద్ధము చేయువిషయముననే పట్టుదల యుండరాదు.

అవ. "మూర్తిమంతుఁ డగుచేతనుని పూజించుటయే ముఖ్యమైనయెడల నిఁక వ్యర్థముగా మూర్తిని సంపాదించువిషయమై యేల ప్రయాసపడవలయును?" అనుశంకకు సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. ద్వారభూతత్వాత్తు నానర్థక్యమ్. ౨౮

భా. సూత్రములోని 'తు' శబ్దముచే శంకను వారించుచున్నాఁడు. ఆలోచింపఁగా మూర్తిమంతుఁ డగుచేతనుని పూజించుటయే

ప్రధానము. అయినను మూర్తిస్థాపనము వ్యర్థము గాదు. ఏల యన, మూర్తిమంతునిపూజవిషయమై మూర్తియేకదా ద్వారము. ఆధారము లేకుండ నాధేయ మగుభగవంతునియావాహనము మొదలగునది సుకర మెప్పుడును గాదు గా! తాము పూజింపఁదగిన దేవతయొక్క స్వరూపాకారములజ్ఞానము మూర్తి లేకుండ నందఱకును గలుగదు. కావునఁ దమతమయిష్టదైవమునకు మూర్తిద్వారముననే పూజ చేయవలయును.

అవ. ఇట్లు బాహ్యార్చనాధికారమును, బాహ్యార్చనాప్రకారమును నిరూపించి యిపు డాంతరార్చనను వర్ణింపఁబోవుచు ముందుగాఁ దదధికారమును జూపుచున్నాఁడు:—

సూ. యోగినాం మానసం ముఖ్యత్వాత్. ౨౯

భా. యోగు లనఁగాఁ జిత్తవృత్తినిరోధము గలిగి విరక్తిని బొంది సర్వసంగపరిత్యాగము చేసికొన్నమహానుభావులు. అట్టివారు మానసపూజయే చేయవలె నని విధింపఁబడుచున్నది. విశేషమైనఫలమునకుఁ గారణ మగుటవలన వారి కదియే ముఖ్యమైనది. ఈవిషయమై,

"యే చైతే మైత్ర్యాదయో ధ్యాయినాం విహారా స్తే బాహ్యసాధననిరనుగ్రహాత్మానః ప్రకృష్టం ధర్మ మభినిర్వర్తయన్తి."

అనఁగా:—యోగులకు మైత్రి, కరుణ, శమము, దమము, మొదలగునేయేవిహారములు గలవో, అవి బాహ్యసాధనముల నపేక్షింపకుండఁగనే యుత్తమధర్మమును గలిగించుచుండును. అని వ్యాసభగవానులవారి యోగభాష్యము ప్రమాణ మున్నది. సర్వసంగపరిత్యాగము చేసికొన్నవారికి బాహ్యోపకరణసంపాదన పరిశ్రమహేతువు గనుకను, మానసపూజ విశేషమైన ఫలమును గలిగించునది గనుకను యోగులచేతను ఆభ్యంతరమైన యీశ్వరపూజయే చేయఁదగినది యని యభిప్రాయము. సూత్రములో 'ఏవ' కారము లేదుగనుక నొకప్పుడు నిమిత్తవశమునుబట్టి యోగులు బాహ్యార్చనమునుగూడఁ జేయవచ్చు నని యనుజ్ఞ యీయఁబడుచున్నది.

అవ. అట్లైన నిటువంటిమానసికపూజ యేప్రకారముగాఁ జేయఁదగియున్నది? అని తెలిసికొనఁ గోరఁగాఁ జెప్పుచున్నాఁడు:—

సూ. కాయే పీఠచింతనం తద్విధానాత్. ౩౦

భా. పరమేశ్వరునకు మానసపూజ చేయుసభిలాష గలవాఁడు ముందుగాఁ దనశరీరమునందు దేవత నివసించుటకై పీఠమును జింతన చేయవలయును. ఏమనఁగా, ఇష్టదేవతను బూజించుసమయమునఁ బీఠమును జింతనచేయవలయు నని తంత్రశాస్త్రములలో విధానము కనఁబడుచున్నది. ఈవిషయమై మంత్రమహోదధి యనుగ్రంథములో నిట్లు చెప్పఁబడి యున్నది:—

"శ్లో. మండూక శ్చాథ కాలాగ్నిరుద్ర ఆధారశక్తియుక్,
కూర్మో ధరా సుధాసింధుః శ్వేతద్వీపం సురాంఘ్రిపాః.
మణిహర్మ్యం హేమపీఠం ధర్మో జ్ఞానం విరాగతా,
ఐశ్వర్యం ధర్మపూర్వాస్తు చత్వార స్తే నజాదికాః,
ధర్మాదయః స్మృతాః పాదాః పీఠగాత్రాణి చాపరే.

అనఁగా:—ముందుగా మూలాధారచక్రమందు మండూకచింతన చేయవలయును. దానిమీఁదను గాలాగ్నిరుద్రుని జింతనసేయవలెను. దానితోఁగూడ నాధారశక్తిని, దానిపయిని గూర్మమును, దానిమీఁదను భూమిని, దానిపై నమృతమహాసముద్రమును జింతనచేసి తన్మధ్యమందు శ్వేతద్వీపమును జింతనసేయునది. ఆశ్వేతద్వీపములోఁ గల్పవృక్షములవనముయొక్క మధ్యప్రదేశమునందు మణివికారమయిన మందిరమును జింతనసేయఁదగును. మఱియు నామణిమందిరమధ్యమున నవరత్నఖచితమై స్వర్ణమయమైన సింహాసనమును జింతింపవలయును. తరువాతను ధర్మము, జ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యము ననునీనాలుగింటిని పైని జెప్పినసింహాసనమునకు నజాదికములనుగాఁ జింతనచేయవలెను. ధర్మము మొదలగు నాలుగును సింహాసనముయొక్క పాదములు. మిగిలినవి పీఠమున కవయవములు. ఈప్రకారముగా మూలాధార(గుదస్థాన)ము మొదలుకొని హృత్పద్మమువఱకును దనశరీరమందు సింహాసనమును భావనసేయవలయును. ఇత్యాదిశ్లోకములచేఁ బీఠరచనాప్రకారము వర్ణింపఁబడియున్నది. కాని యిచ్చట నింతమాత్రమే యుపయోగించునది యగుటంబట్టి యాప్రకరణ మంతయు నుపన్యసింపఁబడలేదు.

అవ. పైని జెప్పినప్రకారముగాఁ బీఠమును జింతనచేసి తరువాత నేమి చేయవలయునో దానిని జెప్పుచున్నాఁడు:—

సూ. తస్మిన్నావర్తనక్రమేణ దేవస్య. ౩౧

భా. అటువంటిబంగారువికారమైనసింహాసనముపైని దమతమ యిష్టదేవతయొక్క విగ్రహమును ఆవర్తనక్రమముగాఁ జింతనసేయవల యును. అనఁగా:—పాదతలము మొదలుకొని శిరస్సువఱకుమీఁదకును క్రమముగా వేఱుగా దేవునియవయవములు చింతనసేయవలయును. మరల శిరస్సు మొదలుకొని పాదతలమువఱకును గ్రిందకును గ్రమ ముగా వేఱుగా దేవునియవయవములను జింతనసేయవలయును. ఈ ప్రకారముగా మాటిమాటికిని ఆవర్తన సేయవలయు నని యర్థము. తరువాతను:—

సూ. మానసోపచారైరైకాగ్ర్యాత్. ౩౨

భా. ఈప్రకారముగా స్వశరీరమందు పీఠముపై నున్నట్టుగా భగ వంతునిస్వరూపమును భావన చేసి మనస్సుచేతను గల్పింపఁబడినటువంటి గంధపుష్పధూపదీపనైవేద్యాద్యుపచారములచేతను ఆభగవంతునకు యథాక్రమముగాఁ బూజసేయవలయును, ఎందుకనఁగా:—ఆప్రకార ముగా అంతరార్చనమందు మానసోపచారములచేఁ బూజ చేసినపురు షునకుఁ జిత్తైకాగ్ర్యము గలుగుచున్నది. బాహ్యోపకరణములను సంపాదించునాసక్తి గలవానిచిత్త మెన్నటికి నేని యేకాగ్రత గలది గాఁజాలదు. కావున యోగులు మానసోపచారములచేతనే యీశ్వరుని బూజించుచుండఁ దగుదురు.

అవ. కల్పనామాత్రము లైనగంధపుష్పాద్యుపచారములచే నీశ్వ రున కేమాత్రపుసంతోషము గలిగెడిని; అని శంక రాఁగా సమాధా నము చెప్పుచున్నాఁడు:—

సూ. భావగ్రాహిత్వాన్న ద్రవ్యాపేక్షా. ౩౩

భా. మానసపూజకు బాహ్యద్రవ్యములగు గంధపుష్పాదులయ పేక్ష లేదు. ఎందుచేత నసఁగా:—పరమేశ్వరుఁడు పూజచేయుపురు

షునియొక్క భావమునే గ్రహించును గాని పదార్థములను గ్రహించువాఁడు గాఁడు. సమస్తబ్రహ్మాండములలో నున్నపదార్థముల నన్నింటిని సృజించుటకుఁ గారణభూతుఁడైన యీశ్వరునకు లోకు లర్పించిన తుచ్ఛపదార్థము లేమాత్రపుసంతుష్టిని గలిగింపఁగలవో తామే యోజించుకొందురు గాక. మఱియు బాహ్యార్చనయందైనను శ్రద్ధతోఁ గూడినభావముచేత నర్పింపఁ బడిన నైవేద్యాదికమునే యీశ్వరుఁ డంగీకరించును గాని "అశ్రద్ధపితాన్ని కేతాంతర్పయామి" అనుసామెతగా నేదోరీతిని జేసినపూజ నంగీకరింపఁ డని మున్మాటికిని దెలిసికొందురు గాక. యీసంగతి నేను జెప్పుటయే కాదు. శ్రీకృష్ణభగవానుఁడే :—

" శ్లో. పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః."

తా. అనఁగా నోయర్జునా! యేపురుషుఁడు భక్తిపూర్వకముగా పత్రమును గాని, పుష్పమును గాని, ఫలమును గాని, జలమును గాని నాకు సమర్పించుచున్నాఁడో ప్రీతిపూర్వకముగా నిచ్చినదానినే నేను స్థిరమైన భావముచే గ్రహించుచున్నాను. అని గీతలలోఁ జెప్పుకొని యున్నాఁడు. కావున నంతరార్చనమందు మానసోపచారములచేతనే భగవంతునకు శ్రద్ధగా నర్చన చేయవలయు నని యర్థము.

అవ. ఇవుడు బాహ్య మనియు నాభ్యంతర మనియు రెండువిధములుగా విభజించి వర్ణింపఁబడిన పూజావిధి యొక్క భగవంతుని స్వరూపమాత్రమునకా లేక పరివారమునకుఁగూడనా యని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు :—

సూ. తత్సోపకరణ మాగమాత్. ౩౮

భా. ఆపూజ సోపకరణముగానే అనఁగా సమస్తమైన పరివారముతోఁ గూడినభగవంతునిస్వరూపమునకే చేయవలయును. ఎందుచేత ననఁగా నీసంగతి యాగమ మనఁగా శాస్త్రముయొక్క ప్రామాణ్యమువలనఁ దెలియుచున్నది. ఎట్లనఁగా :—

" ఏతాన్ రామస్యాంగాన్ పూజయేత్, అంగా న్వినా
రామో విఘ్నకరో భవతి "

అనఁగా :— శ్రీహనుమత్సీతాలక్షణాది పరివారసహితముగానే రాముని పూజింపవలయును. అంగములను బూజింపకుండ రాముని బూజించినను విఘ్నము చేయకమానఁడు. అని యథర్వవేదములోని రామోపనిషత్తునందును,

"శ్లో. యస్య దేవస్య యద్రూపం యథాభూషణవాహనమ్,
తద్రూపం తు తథా ధ్యాయే ద్యోగీ సుస్థిరమానసః."

అనఁగా నేదేవత కేరీతిగా రూప ముండునో యెటువంటి నగలుండునో యెట్టివాహన ముండునో యట్లే స్థిరమైన మనస్సుచే యోగి ధ్యానము సేయవలయును. అని ఘేరండసంహితయందును జెప్పఁబడియున్నది. కావునఁ దంత్రగ్రంథములయందుఁ జెప్పఁబడిన ప్రకారముగా సర్వాంగములతోఁగూడిన భగవంతుని స్వరూపమునకే పూజసేయవలయును గాని యొక్క స్వరూపమునకు మాత్రమే కాదని తెలిసికొనఁదగును. మఱియు :—

సూ. తద్గుణానుస్మరణం చ. ౩౫

భా. అర్చనసమయమందు సర్వజ్ఞత్వము, సర్వశక్తిత్వము మొదలగునవి గాని, లీలావిహారాదినిమిత్తజములైన రాక్షససంహారము, భూభారహరణము, మొదలగునవిగాని శ్రుతిస్మృతీతిహాసపురాణములయందుఁ బ్రసిద్ధములైన యాపరమేశ్వరుని గుణము లేవేవి గలవో వానిని ప్రతిక్షణమును స్మరించుచుండవలయును. పూజాసమయమందు భగవత్స్వరూపమందును తద్గుణములయందుననే మనస్సును బాగుగా నుంచవలయును గాని యితరమైనచోటునకుఁ జలింప నీయరాదు.

అవ. ఈప్రకారముగాఁ బరమేశ్వరుని గుణములను స్మరించు పురుషునకు భక్తి యుద్రేకించినపు డేమి కలుగునో చెప్పుచున్నాఁడు :—

సూ. ఆలింగనాదయః ప్రేమవికారాః. ౩౬

భా. చిరకాలము మానసపూజ చేయుటచేతను బరిశుద్ధమైన యంతఃకరణము గల పురుషునకు భగవంతుని స్వరూపము విషయమై ప్రేమాధిక్యము గలుగఁగానే ఆలింగనము మొదలగు వికారములు

గలుగుచుండును. సూత్రములోని యాదిశబ్దముచేత నుపగూహనాదులను గ్రహింపవలయును. ఎట్లనఁగా :—ఒకానొకప్పుడు మనస్సుచేతను భగవంతుని పాదములను బట్టుకొని శిరస్సుచేతనుగాని, ఉరముచేతనుగాని యాలింగనము జేయుచుండును. మఱియొకప్పుడు గాఢముగా నుపగూహన మాచరించుచుండును. ఇంకొకప్పుడు తత్ప్రాప్తివిలంబము నాశంకించుకొని కాని హర్షాతిశయముచేతను గాని రోదన మారంభించుచుండును. ఇటువంటి వికారములు అనఁగా మనస్సుయొక్క అవస్థావిశేషములు ప్రేమ యతిశయించినపుడు గలుగుచుండును. ఎంతవఱకిట్టివికారములు గలుగవో యంతవఱకును "నాకుఁ బ్రేమాతిశయము గలుగ లేదు" అని తెలిసికోవలయును.

అవ. అటుతరువాతి దగు దానిని జూపించుచున్నాఁడు :—

సూ. ద్రవీభూతస్య రోమోద్గమాది లింగమ్. ౩౭

భా. భగవంతునిచరణారవిందముల యాలింగనము మొదలగు వానియందు దాసక్తమైన మన స్సెప్పుడు నిప్పుచేరికను వెన్నముద్ద, సూర్యకిరణములసంపర్కమువలన మంచుగడ్డయు ద్రవించునట్లు ద్రవించుచుండునో అప్పు డుపాసకుని శరీరమందు గగుర్పాటు మొదలగుచిహ్నములు గనుపడుచుండును. సూత్రములోనియాదిశబ్దముచేతను గంపము, శైథిల్యము మొదలగుగుణములు తెలిసికోఁదగును. కావున నెంతవఱకు గగుర్పాటు మొదలగుచిహ్నములు శరీరమందుఁ గన్పట్టవో అంతవఱకును మనస్సు ద్రవీభావమును బొందలేదని నిశ్చయించు కోవలయును.

మఱియు:—

సూ. తల్లీనస్యాత్మవిస్మరణమ్. ౩౮

భా. చిత్త మెప్పుడు ద్రవీభూత మగుచు భగవంతునిస్వరూపమందు ధ్యానముయొక్కయభ్యాసము బలమై లీనమగునో అనఁగాఁ దన్మయత్వమును బొందునో అప్పుడు తనను గాని పరులనుగాని స్మరింపక కేవలమును ధ్యేయస్వరూపముగానే యుండును. అదియే ప్రేమపూర్వకమైన భక్తికిఁ బరమోత్కర్ష. అట్టిప్రేమపూర్వకమైనభక్తి

యొక్క యభ్యాసపాటవముచేతను బురుషుఁడు తనహృత్పద్మమందు జ్యోతిర్మయమైన భగవంతునిస్వరూపమును గనుఁగొనుచుండును.

అవ. పైని జెప్పినచొప్పున ధ్యానాభ్యాసక్రమమున భగవంతుని స్వరూపమందు లీనమయినను జిత్తము భేదబుద్ధిసంస్కారము గలదిగావున నాపరమాత్మునినుండి మరలివచ్చుచుండును, కాని బాగుగాఁ దన్మయత్వమును బొందకుండును గావునఁ జిత్తము లయమగుటకు ముందు చేయఁదగుసంగతిని రెండుసూత్రములచేఁ జూపించుచున్నాఁడు:—

సూ. ఆత్మని తద్గుణారోపణమ్. ౩౯

భా. పరమేశ్వరునకు సర్వజ్ఞత్వము, సర్వశక్తిత్వము మొదలగు నేయేగుణములు గలవో ఆగుణములను ధ్యానించుసమయమునందుఁ దనయం దారోపించుకొనుచుండవలయును. ఎట్లనఁగా:—"నేనే సర్వజ్ఞుఁడను, సర్వశక్తిని, సమస్తబ్రహ్మాండములకును యజమానుఁడను, సత్యకాముఁడను, సత్యసంకల్పుఁ డను" అని యీరీతిగాఁ బరమేశ్వరుని గుణములను దనయందు భావించుకొనుచుండవలయును. అందువలనఁ గ్రమముగా నిట్టిదీర్ఘకాలపరిభావితమైన ధ్యానాభ్యాసముచేత నీయుపాసకుఁడును సత్యసంకల్పము మొదలుగాఁగలయీశ్వరునిగుణములను దప్పక పొందుచుండును.

సూ. తదాత్మతాభిమాన శ్చ. ౪౦

భా. ధ్యానసమయమున భగవత్స్వరూపమం దేప్రకారముగాఁ జిత్తము లెస్సగా లీన మగునో యాప్రకారముగాఁ దద్గుణారోపనమువలెనే తాదాత్మ్యాభిమానముఁగూడఁ జేయఁదగియున్నది. అనఁగాఁ దన యాకారము, వర్ణము, జాతి మొదలగువానియందలియభిమానమును వదలి స్వయముగాఁ దన్నును విష్ణుస్వరూపముగా భావించుచుండవలెనని యభిప్రాయము. "నేనే చతుర్భుజుఁడను. చక్రము, గద మొదలగువానిని ధరించువాఁడను. పచ్చనిపట్టుబట్టలఁ గట్టుకొనువాఁడను. దైత్యులను సంహరించువాఁడను. అయియున్నాఁడను" అని యీరీతిగా సర్వాంగమును సర్వోపకరణములతోఁ గూడినట్లుగా స్వకీయమైన రూపమును జింతనచేయవలయును. ఈవిషయమై:—

"శ్లో. నావిష్ణుః కీర్తయే ద్విష్ణుం నావిష్ణు ర్విష్ణు మర్చయేత్,
నావిష్ణు స్సంస్మరే ద్విష్ణుం నావిష్ణు ర్విష్ణు మాప్నుయాత్."

అనఁగా నుపాసకుఁడెంతవఱకు ముందుగాఁ దాను దన్నును విష్ణుస్వరూపముగాఁ జింతన సేయఁడో అంతవఱకును విష్ణుని గీర్తింప రాదు. పూజింపరాదు. స్మరింపఁ గూడదు. ఎంతవఱకు విష్ణుస్వరూప మునుగాఁ దన్నును భావించుకొనఁడో అంతవఱకును వానికి విష్ణు ప్రాప్తియును లేదు. అనియోగనాసిక్యమునందుఁ జెప్పఁబడి యున్నది. మఱియు:—"దేవో భూత్వాయజేద్దేవమ్." అనఁగా ముందుగాఁ దాను దేవతయొక్క స్వరూప మై తరువాతను దేవతను బూజింపవలయును. అని తంత్రగ్రంథములయభిప్రాయముగూడ నిందులకుఁ బ్రమాణము గలదు. కావునఁ దన్నును ధ్యేయస్వరూపమునుగా భావింపవలయును. చిరకాలము భావనచేయఁబడినయిట్టివంటితాదాత్మ్యధ్యానముచేతనే దేహపాతానంతరమున వైకుంఠలోకమందు భగవంతునితో సారూప్య మును బొందుచున్నాఁడు.

అవ. బాహ్య మనియు నాభ్యంతర మనియు రెండువిధములు గాఁ జెప్పిన నారాయణార్చన యొక్క విష్ణువివ్యక్తికే చేయువలయునా? లేక తదవతారములకుఁగూడఁ జేయవచ్చునా? యని తెలిసికొనఁ గోరఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. అవతారా శ్చ తదంశత్వాత్. ౪౧

భా. శ్రుతి స్మృతీతిహాస పురాణములయందుఁ బ్రసిద్ధములైన నృసింహ, వామన, రామ, కృష్ణాది విష్ణునియవతారము లేవి గలవో యవియు విధిగాఁ బూజింపఁదగినవై యున్నవి. ఎందుచేత ననఁగా, అన్ని యవతారముల యొక్క యావిర్భావమును విష్ణునియంశమువలననే కలుగు చున్నది. కావున, బాహ్యాభ్యంతరభేదముచేత రెండువిధములుగాఁ జెప్పఁబడిన విష్ణ్వారాధన తదంశావతారములకుఁ గూడఁ జేయఁ దగిన దియే యని యభిప్రాయము.

అవ. "సరియే"

"శ్లో. అహ మాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః,
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ,
బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ మమృతస్యావ్యయస్య చ."

అనఁగా నోయర్జునా! బ్రహ్మాది స్తంబపర్యంతము లగు ప్రాణుల బుద్ధియనెడి గుహాయందు స్వరూపత్వ, సర్వప్రకాశకత్వసాక్షిత్వములచే నున్నయాత్మను నేనే. సూత్రమందు మణులవలెనే యీ బ్రహ్మాండ మంతయు నాయందు గ్రుచ్చఁబడియున్నది. అనియు, జన్మరహితము వికార రహితము నగుబ్రహ్మమునకు నేనే ప్రతిష్ఠ యనఁగా జ్ఞాతృస్వరూపము చేతను నామరూపవ్యాకరణముకొఱకుఁ బ్రవర్తించువాఁడను. అని యుఁ జెప్పఁబడినగీతాదివాక్యములయం దవతారములు సర్వవ్యాపక మును, అవ్యక్తమును నగు బ్రహ్మముయొక్క రూపములే యని వినఁ బడుచుండఁగా నవతారము లన్నియు విష్ణునియంశలే యని యెట్లు చెప్ప వచ్చును?" అని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. విష్ణో రేవాధికారాత్. ౪౨

భా. భూమిపై నావిర్భావమును బొందుచున్న యీనృసింహ, వామన, రామ, కృష్ణాద్యవతారము లన్నియు విష్ణువనఁగా, వైకుంఠ లోకము నలంకరించుచున్న నారాయణునివే కాని యవ్యక్తుఁడును, నిర్గుణుఁడును నగుపరమేశ్వరునివి గావు. ఎందుచేత ననఁగా నీబ్రహ్మాండ మును సృజించుటకును; పరిపాలించుటకును, సంహరించుటకును, విష్ణు నికే యధికారము గలదు. సర్వాధికారయుక్తుఁ డైనను నిర్గుణుఁ డగు నీశ్వరునిచేతను జేయఁబడుచుండుజగత్సృష్టి మొదలుగాఁ గలకార్య ము లన్నియు విష్ణువ్యక్తిమూలకముగానే చేయఁబడుచుండును. కొన్ని చోటుల బ్రహ్మకు సృష్టి సేయునధికారము, శివునకు సంహరించు నధి కారము నున్నట్లు వినఁబడుచున్న దందు వేమో అవియు నారాయణు నియనుమతిచేతనే యగుచున్న వని తెలియఁదగును. ఈవిషయమై:—

"శ్లో. ఏత న్మయోక్తం నరదేవ! తత్త్వం నారాయణో
విశ్వ మిదంపురాణమ్,స సర్గకాలే చ కరోతి సర్గం
సంహారకాలే చ తదత్తి భూయః."

అనఁగా నోరాజా! ఇపుడు నేను నీకుఁ జెప్పినది నిజమైన సంగతి. అనాది యగునీబ్రహ్మాండ మంతయు నారాయణునిస్వరూపమే కాని వేఱు గాదు. ఆయనయే సృజింపవలసివచ్చినపుడు సృజించుచుండును. సంహారింపవలసివచ్చినప్పుడు తానే మరల నా బ్రహ్మాండము నంతయు నశింపఁజేయుచుండును. అని మహాభారతములోని శాంతిపర్వములోఁ జెప్పఁబడియే యున్నది. కావున నెప్పుడెప్పుడు తనచేత సృజింపఁబడిన భూమండలమందు రాక్షసులు మొదలగు దుర్మార్గులచేఁ జేయఁబడిన ప్రజాపీడనము మొదలగువిక్షేపములు విశేషముగాఁ గలుగుచుండునో యప్పుడప్పుడు నృసింహ, వామన, రామ, కృష్ణాద్యవతారముల నెత్తి యనేకవిధము లగునుపాయములచే నాయావిక్షేపములను దొలఁగించి శాంతిని స్థాపించి నారాయణుఁడు మరలఁ దనమొదటిస్థల మగువైకుంఠమునకుఁ బోవుచుండును. "శ్లో. అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః" ఇత్యాదివాక్యములయం దవతారములకు నిర్గుణపరబ్రహ్మత్వము చెప్పఁబడియున్నది. అట్లు చెప్పుట విష్ణునకును నిర్గుణపరబ్రహ్మమునకును అభేద మనునభిప్రాయముచేత నని తెలియవలయును.

సూ. తత్ప్రసంగాచ్చ. ౪౩

భా. తత్ప్రసంగమువలనఁగూడ నవతారము లన్నియు విష్ణునివే యని తెలియఁదగును. ఎందుచేత ననఁగా నెచ్చటనెచ్చటను బురాణాదులయం దవతారధారణమునకు నిమిత్తము చెప్పఁబడియున్నదో యచ్చటచ్చట వరశాపప్రదానాదిప్రసంగము విష్ణునకుఁ గల దనియే వినఁబడుచున్నది. రాక్షసులు మొదలగు దుర్మార్గులు చేయు నుపద్రవములచేఁ బీడింపఁబడినయింద్రాదిదేవతలును మహర్షులును విష్ణుమూర్తినే శరణు చొచ్చుచుండురు. తరువాత వారిప్రార్థన మంగీకరించి దుర్మార్గులను నశింపఁజేయుకొఱకు భూమియం దావిష్ణుమూర్తియే యంశచే నవతరించుచుండు నని యవతారములతో సంబంధించిన కథ లన్నింటిలోనను బ్రసిద్ధమే యయి యున్నది. కనుక నవతారము లన్నియు విష్ణుమూర్తివే కాని యవ్యక్తుఁడగుపరమేశ్వరునివి గావు.

అవ. "అవతారము లన్నియు సగుణుం డగువిష్ణుభగవానునివే యని తెలిసినది. కాని భగవంతుఁ డగునారాయణుండు దుఃఖబహుళం బగు నీభూమియం దెందుల కవతరింపవలయును?" అని ప్రశ్నింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. ధర్మస్థిత్యర్థమ్. ౨౨.

భా. ఏయేసమయమందు శ్రుతి స్మృతులచే విధింపఁబడినధర్మమునకుఁ దఱుచుగా వినాశము, విశేషముగా నధర్మమునకుఁ బ్రచారమును గలుగుచుండునో ఆయాసమయములందు నధార్మికుల సంహరించి జగత్ప్రవాహనిర్వాహమునకుఁ గారణ మగుధర్మము నెప్పటియట్ల స్థాపించునిమిత్తమై సర్వేశ్వరుఁ డగువిష్ణుభగవానుఁడు స్వాంశచే భూమియం దవతరించుచుండును. ఈసంగతిని:—

"శ్లో. యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహమ్.
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే."

అనఁగా:—ఓయర్జునా! యెప్పుడెప్పుడు ధర్మమునకు నాశనము, అధర్మమునకు వృద్ధియుఁ గలుగుచుండునో అప్పుడు నేను నాయాత్మను నామాయచేతను సృజించుచుందును. సాధువులను సంరక్షించుచుండుటకును దుర్మార్గులను సంహరించుచుండుటకును ధర్మమును స్థాపించుచుండుటకును బ్రతియుగమందును బుట్టుచుందును. అని భగవంతుఁడే గీతలలోఁ జెప్పియున్నాఁడు.

అవ. "భగవంతుడు సత్యసంకల్పుఁడు గనుక నాతనిసంకల్పమాత్రముచేతనే దుష్టసంహారము, శిష్టసంరక్షణము, ధర్మసంస్థాపనమును గావచ్చును గదా ! యిఁక నూరక ప్రయాసపడి యనేకము లగునవతారముల నెందుల కెత్తవలయును?" అని ప్రశ్నింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. స్వయశోవిజృంభణార్థం చ. ౨౩.

భా. ఆలోచింపఁగాఁ బరమేశ్వరుఁడు దూరమందే యుండి తన సంకల్పమాత్రముచేతనే సర్వకార్యములను నెరవేర్పఁ గలఁడు. ఇందు సందియ మింతమాత్రమును లేదు. అయినను; తనకీర్తిని విశేషముగా భూలోకమందు విస్తరింపఁ జేయుతలంపుతోనే! భగవంతుఁ డవతరించు చుండును. శ్రుతి స్మృతులయందుఁ బ్రసిద్ధ మగునకీర్తిగలవాఁ డయ్యును బరమేశ్వరుఁడు నృసింహ, వామన, రామ, కృష్ణాద్యవతారపూర్వకముగా ననేకవిధము లగునయుపాయములచే దుష్టు లగురాక్షసులు మొదలగువారిని శిక్షించుమూలముగా భూభారహరణముచేతను, ధార్మికజనసంరక్షణపూర్వకముగా ధర్మస్థాపనచేతను విశేషముగా భూలోకమందుఁ గీర్తిప్రచారము గలవాఁ డగుచున్నాఁ డని తెలియఁదగును.

అవ. "సమస్తకీర్తులకును నిధియును, నిత్యతృప్తుఁడును నగుపరమేశ్వరునకు లోకకృత మైనకీర్తిచే నేమిప్రయోజన మున్నది?" అని ప్రశ్నింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. తేన లోకోపకరణమ్. ౮౩.

భా. ఆలోచించి చూడఁగాఁ బరమేశ్వరుఁడు పూర్ణకాముఁడే కనుకఁ దనకీర్తిని బ్రచారింపఁ జేసికొన్నంతమాత్రమునఁ దన కేవిధమయినలాభమును లేదనుట సత్యమే కాని రామకృష్ణాద్యవతారగ్రహణముచే నుద్దీపిత మైన యాకీర్తిచేఁ దప్పక లోకముల కుపకార మగుచున్నది. భగవంతునికీర్తిని వినుటచేతను గీర్తించుటచేతను భక్తలోకము సకలపాపములును బోయినది యై యుత్తమగతిని బొందుచుండును. ఈవిషయము "శ్లో. కీర్తిం పాపహరాం విధాయ జగతాం తం జానకీశం భజే." అనఁగా సకలలోకములపాపములను నశింపఁ జేయఁ జాలినతనకీర్తిని లోకములో వ్యాపించునట్లు చేసి తనయెప్పటిస్థానమునకుఁ బోయినరామచంద్రభగవానుని సేవించుచున్నాను. అని యధ్యాత్మరామాయణములోనను,

"శ్లో. అచ్ఛిద్య కీర్తిం సుశ్లోకాం వితత్య హ్యంజసాను కౌ,
తమో ఽనయా తరిష్యంతి త్యగా త్స్వం పద మీశ్వరః."

అనఁగా, కృష్ణావతారమునఁ దనమనోహరమైన మూర్తిచే లోకులచిత్తమును నేత్రములను ఆకర్షించి తనపవిత్రమైనకీర్తిని భూమియందు వ్యాపింపఁజేసి యాకీర్తిచేతనే సమస్తమైనజనమును పాపములనుండియు నజ్ఞానమునుండియుఁ దరింపఁగలదని యాయీశ్వరుఁడు తన మొదలిచోటునకుఁ బోయెను. అని భాగవతమందును జెప్పఁబడియున్నది.

అవ. ,,అసంగుఁ డగుపరమేశ్వరునకు లోకోపకారముచేయుటచే నేమిలాభ మున్నది" అని ప్రశ్నింప సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. దయాళుత్వాత్తు నౌదాసీన్యమ్. ౪౭

భా. సూత్రములోని 'తు' శబ్దము శంకను దొలఁగించుట కని తెలియవలయును. ఈశ్వరుఁ డసంగుఁడే యయినను దయాళుస్వభావము గలవాఁడుగనుక జీవులవిషయమై యుదాసీనుఁడు గాఁడు. సంసారసముద్రములో మునుఁగుచుఁ దేలుచు నుండుటకుఁ గారణభూతమైన యవిద్యచేత నాచ్ఛాదింపఁబడినయంతఃకరణము గలజీవుల సంసారచక్రముపైని దిరుగుటవలనఁ గలుగుచున్నదుఃఖపరంపరను జూచి ,, అయ్యో! వీరు సంసారమనువలనుండి యెట్లు విడుదల కాఁగలరు?" అని యాలోచించి పరమేశ్వరుఁడు నానావిధము లయినయుపనిషత్తులయొక్కయు గీతలుమొదలగునధ్యాత్మసంబంధము లైనవాక్యములయొక్కయు నుపదేశముచేతను బ్రతికల్పమందును వేలకొలఁదిజీవుల నీసంసారసముద్రమునుండి యుద్ధరించుచున్నాఁడు. ఈవిషయమైద్వైపాయనాచార్యులవారు:—

,, తస్యాత్మానుగ్రహాభావేఽపి భూతానుగ్రహః
ప్రయోజనంజ్ఞానధర్మోపదేశేన కల్పప్రళయమహాప్ర
ళయేషుసంసారిణఃపురుషా నుద్ధరిష్యామి. "

అనఁగా, ఆలోచించిచూడఁగాఁ బరమేశ్వరునకుఁ దన్నుఁ దా ననుగ్రహించుకొనవలసినయవసరము లేదు. అయినను జీవులననుగ్రహించుటయే యతనికిఁ బ్రయోజనము. ,,జ్ఞానమును ధర్మమును ఉపదేశించి కల్పప్రళయ మహాప్రళయములయందు సంసారు లగుజీవుల నుద్ధరింపవలయును" అని యతనిసంకల్పము. అని యోగభాష్యములో వ్రాసియున్నా

రు. కావునఁ దనకీర్తిని విస్తరింపఁ జేయుటచేతను, అధ్యాత్మోపదేశము చేతను బరమేశ్వరునకు లోకోపకారకరణము యుక్తముగానే యున్నది.

అన. "సరియే కాని మనుష్యపశ్వాదియోనులయం దవతరించు చుండు పరమేశ్వరుఁ డాయాశరీరములసంబంధమునుబట్టి యస్మదాదు లవలెనే తుచ్ఛుఁడేల కాఁడు?" అని శంకింపఁగా నీసూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు :—

సూ. లీలామాత్రత్వాన్న దూషకం నటవత్. ౩౮

భా. మనుష్యాదిశరీరములతోడ సంబంధము గలుగుటవలనఁ బరమేశ్వరునకుఁ దుచ్ఛత్వము సంభవింపదు. ఎందుచేత ననఁగా:— అవి యతనికి లీలామాత్రములు. కేవలమును లీలచేతను మత్స్యాది రూపములను దాల్చి విహరించుచుండుపరమేశ్వరునకు దత్తచ్ఛరీరములను ధరించుట దూషణము గాదు. ఆవిషయమై 'నటవత్' అనునది దృష్టాంతము. అనఁగా నేరీతిగా నటుఁడు లీలచేతను బరస్పరమును విలక్షణము లగు పెక్కురూపములను ధరించుచు నాయారూపములతో నించుకయు లేపమును బొందఁడో మఱియుఁ దన్నును దద్భావమును బొందినవానినిగాఁ దలంపఁడో యారీతిగానే యీశ్వరుఁడును నాయా శరీరముల ధరించుటచేఁ దత్తద్గుణములతోడను గాని దోషములతోడను గాని సంబంధముగలవాఁడు గాఁడు. ఈవిషయమై "శ్రు. అసంగో హ్యయం పురుషః" అనఁగా నీయంతర్యామి యగుపురుషుఁడు సంగము లేనివాఁడు. అను శ్రుతియు, "శ్లో. నమాం కర్మాణి లింపతి న మే కర్మ ఫలే స్పృహా" అనఁగా నోయర్జునా! నన్ను శుభాశుభకర్మము లంటవు. ఎందుచేత ననఁగా నాకుఁ గర్మములవలనఁ గలుగుఫలమువిషయమై యభిలాష లేదు. "జన్మ కర్మ చ మే దివ్యమ్." అనఁగా నాకర్మము నాజన్మము దివ్యమయినది. అనఁగా జీవులకంటె విలక్షణమైనది. అనుగీతావాక్యములును బ్రమాణము. కావున నస్మదాదులకువలెనే పరమేశ్వరునకు శరీరసంబంధమునుబట్టి తుచ్ఛత్వము సంభవింప దని తెలిసికొమ్ము.

అవ. ఈరీతిగాఁ బరమేశ్వరునివ్యక్తస్వరూపమును, తదర్చనవిధిని, అవతరించుటకుఁ దగినప్రయోజనమును, ఆయవతారములకుఁ గలపూజ్యతను నిరూపణ చేసి యిటుపయి నవ్యక్తపరమేశ్వరునియర్చనాప్రకారమును వర్ణింపఁబోవుచు నందు ముందుగా నే స్థలమం దతనినిబూజింపఁ దగును?" అని ప్రశ్నింప సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. హృదయే శ్రవణాత్. ౪౯

భా. తనహృదయపద్మమందే యవ్యక్తుఁ డగుపరమేశ్వరుని బూజింపవలయును. ఎందుచేత ననఁగా శ్రుతి స్మృతీతిహాసాదులయందుఁ బురుషునిహృదయమే పరమేశ్వరునిస్థానముగా వినఁబడుచున్నది. ఈవిషయము:—

"శ్రు. ఏష ప్రజాపతి ర్యద్ధృదయ మేత ద్బ్రహ్మైత త్సర్వం, తస్మిన్నంత ర్హృదయే యథా వ్రీహి ర్వా యవో వా స ఏషసర్వస్యేశానః, సర్వస్యాధిపతిః, సర్వ మిదం ప్రశాస్తి, యదిదం కించ."

అనఁగా హృదయమం దున్న యతఁడే ప్రజాపతియు సర్వవ్యాపకుఁడును నగుపరబ్రహ్మము. ఆహృదయమధ్యమందు వ్రీహివలెను, యవప్రమాణముగను సూక్ష్మరూపముగా వెలుఁగుచున్నజ్యోతియే సర్వజగత్తులకు నీశ్వరుఁడు. అతఁడే సర్వాధిపతి. ఆయనయే యీచరాచరప్రపంచము నంతయు శాసించువాఁడు. అని వాజసనేయబ్రాహ్మణోపనిషత్తునందును, "శ్రు. ఏష దేవో విశ్వకర్మా మహాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః" అనఁగా జ్ఞానస్వరూపుఁడును, సర్వప్రపంచమునకును గర్తయు నగుపరమాత్మయే సర్వజీవులహృదయమందును బ్రవేశించియున్నాఁడు. అని కృష్ణయజుర్వేదమునందలి శ్వేతాశ్వతరోపనిషత్తునందును "శ్లో. ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున! తిష్ఠతి" అనఁగా నోయర్జునా! ఈశ్వరుఁడు సమస్తభూతములహృదయప్రదేశమందును వెలుంగుచున్నాఁడు. అనియు "శ్లో. సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనం చ" అనఁగా నోయర్జునా! నేను సకలభూతములహృదయమందును బ్రవేశించి యున్నాను. నావలననే జీవులకుఁ బదార్థములస్మృతి, జ్ఞానము, తర్కము మొదలగునవి

గలుగుచున్నవి. అనియు శ్రీమద్భగవద్గీతలయందును, ,, సూ. అంతస్థధర్మోపదేశాత్." అనఁగా హృదయముయొక్క లోపలను బరమేశ్వరుఁడే యున్నాఁ డని నిశ్చయింపవలయును. ఎందుచేత ననఁగా జగదాధిపత్యము మొదలగునవి యీశ్వరధర్మము లనియే వేదములయందుఁ జెప్పఁబడి యున్నది. అని బ్రహ్మమీమాంసలో శ్రీవ్యాసభగవానుల వారిచేతను జెప్పఁబడి యున్నది. కాఁబట్టి తమతమహృదయకమలముల యందుఁ బరమేశ్వరుని జింతన చేసి నిశ్చలమైన మనస్సుచేత నర్చన చేయవలయు నని యభిప్రాయము.

అవ. "సర్వవ్యాపకుఁ డగుపరమేశ్వరున కంగుష్ఠమాత్రప్రమాణము గలహృదయప్రదేశము దానికి యెట్లు సంభవించును?" అని శంకరాఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. స్వచ్ఛత్వా దర్కవ త్సాన్నిధ్యమ్. ౧౦

భా. ఆలోచించి చూడఁగాఁ బరమేశ్వరున కంతటను సమానముగానే వ్యాపకత్వము గల దనుట సత్యమే. అయినను హృదయప్రదేశమందు విశేషించి యతనికి సాన్నిధ్యము గలిగి యున్నది. ఎందుచేత ననఁగాఁ బ్రకృతి సత్త్వాంశవికార మగుటవలన నంతఃకరణ మన్నిపదార్థములకంటెను స్వచ్ఛ మయి యుండును. కావున దానియందే యీశ్వరుఁడు విశేషించి సన్నిధానము గలవాఁడై యున్నాఁడు. అందులకు "అర్కవత్" అనిదృష్టాంతము. ఎట్లు సూర్యునివెలుఁగు ఘటము, పటము, ఉపలము, కుడ్యము మొదలగు నన్నిచోటులను సమానముగానే ప్రసరించుచున్నను అద్దము మొదలగు నిర్మలమైన వస్తువులయందే విశేషించి సన్నిహిత మగుచున్నదో అట్లే యీశ్వరునకును హృదయమందు విశేషించి యునికి సంభవించుచున్న దని తెలిసికోఁదగును.

అవ. ,,సరియే హృదయకమలమునందుఁ బరమేశ్వరుని జింతనసేయవలయు నని చెప్పితిరి. అవ్యక్తుఁ డగుపరమేశ్వరున కాకృతియే లేదందురు గదా! ఇఁక నెట్లతనిని జింతింపవచ్చును?" అని శంకింపఁగా నీసూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. జ్యోతిర్మయం తథావలోకనాత్. ౯౧

భా. తనుహృదయకమలమందుఁ బరమేశ్వరుని జ్యోతిర్మయస్వరూపునిగానే చింతనసేయవలయును. ఎందుచేత ననఁగా ధ్యానకాలమందు యోగులు పరమేశ్వరుని జ్యోతిస్స్వరూపునిగానే చూచుచున్నారు. ధ్యానసమయమునందు యోగులు పరమేశ్వరునిజ్యోతిర్మయస్వరూపమును గనుఁగొనుచుందు రనుసంగతి « సూ. సమాధా వవలోకనాత్ ప్రత్యక్షత్వమ్.” అను మొదటిపాదమునందలియిరువదిరెండవ సూత్రపుభాష్యములోనే చెప్పఁబడియున్నది. మఱియు,

సూ. సూర్యాద్యవభాసకత్వాచ్చ. ౯౨

భా. సూర్యాదులను బ్రకాశింపఁజేయువాఁ డగుటంబట్టికూడఁ బరమేశ్వరుని జ్యోతిర్మయస్వరూపునిగానే ధ్యానము చేయఁదగును. సూర్యుఁడు చంద్రుఁడు మొదలగుజ్యోతు లన్నియు నీశ్వరజ్యోతిచేత నాప్యాయితములై యెల్లప్పుడును బ్రకాశించుచున్నవి. ఈసంగతి:—

« శ్రు. న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో
భాంతికుతో యమగ్నిః, తమేవ భాంత మనుభాతి సర్వం
తస్య భాసా సర్వ మిదం విభాతి.”

అనఁగా నాపరమేశ్వరునిస్వరూపమందు సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, మెఱుపులు, ప్రకాశింపఁజాలవు. ఇఁక నగ్ని యెట్లు ప్రకాశింపఁగలదు ? ఎందుచేత ననఁగా నాయీశ్వరుని ప్రకాశముచేతనే యీజగమంతయుఁ బ్రకాశము గలది యగుచున్నది. అని యజుర్వేదములోనికఠోపనిషత్తులోఁ జెప్పఁబడియున్నది. మఱియు,

“శ్లో. య దాదిత్యగతం తేజో జగ ద్భాసయతే ఽఖిలమ్,
య చ్చంద్రమసి య చ్చాగ్నౌ త త్తేజో విద్ధి మామకమ్.”

అనఁగా, ఓయర్జునా! యేతేజస్సు సూర్యునియందును, చంద్రునియందును, అగ్నియందును నున్నదియై సమస్తజగత్తును బ్రకాశింపఁజేయుచున్నదో ఆతేజస్సంతయును నాదే యని తెలిసికొనుము. అని శ్రీకృష్ణభగవానులవారు గీతలలోఁగూడఁ జెప్పియున్నారు.

అవ. అటులేని యీజ్యోతిస్స్వరూపమునే ప్రకారముగా నర్చన చేయవలయు నని తెలిసికొనవలెనంటేంగా సమాధానము చెప్పుచున్నాఁడు:-

సూ. ధ్యానమేవ ప్రశంసనాత్. ౧౩.

భా. ఏకాగ్రచిత్తముతో ధ్యానము సేయుటయే యీశ్వరున కర్చన యని తెలియవలెను. ఎందుచేత ననఁగా శ్రుతిస్మృతీతిహాసాదిశాస్త్రములయం దితరకర్మములకంటె ధ్యానమే విశేషించి కొనియాడఁబడినట్టు కన్పట్టుచున్నది. ఈసంగతి:—

"శ్రు. ధ్యాయతీవ పృథివీ, ధ్యాయతీవాంతరిక్షం, ధ్యాయతీవ ద్యౌః, ధ్యాయన్తీవాపో, ధ్యాయన్తీవ పర్వతాః, ధ్యాయన్తీవ దేవమనుష్యా, స్తస్మా ద్య ఇహ మనుష్యాణాం మహత్తాం ప్రాప్నువన్తి ధ్యానాపాదాంశా ఇహైవ తే భవన్తి ధ్యాన ముపాస్వ."

అనఁగా, భూమి ధ్యానము సేయుచున్నటు లున్నది. అంతరిక్షము ధ్యానము సేయుచున్నటు లున్నది. స్వర్గము ధ్యానించుచున్నయటు లున్నది. జలము ధ్యానము చేయుచున్నటు లున్నది. పర్వతములు ధ్యానము సేయుచున్నటు లున్నవి. దేవతలు మనుష్యులునుగూడ ధ్యానము సేయుచున్నటు లున్నారు. కావున నెవరు మనుష్యులలో మహత్త్వమును బొందుచున్నారో వారు ధ్యానముయొక్కయంశవలననే పొందుచున్నారు. కనుక ధ్యానమునే యుపాసింపవలయును. అని సామవేదములోనిఛాందోగ్యోపనిషత్తు చెప్పుచున్నది. మఱియు "శ్లో. ధ్యానమేవ హి జన్తూనాం కారణం బంధమోక్షయోః." అనఁగా ధ్యానమే జంతువులబంధమోక్షములకుఁ గారణము. అనఁగా ధ్యానము సేయకుండుటచే బంధము, ధ్యానించుటవలన మోక్షమును గలుగు నని తాత్పర్యము. అని యాజ్ఞవల్క్యమహామునియుఁ జెప్పియున్నాఁడు. కావున నేకాగ్రచిత్తముచేతను దమతమహృదయపద్మమునందు జ్యోతిర్మయుం డగునీశ్వరునికి ధ్యానరూపార్చనయే చేయఁదగినది. మఱియు,

సూ. అస్యైవా మనుపదయోగా చ్చ. ౧౪

భా. జ్యోతిస్స్వరూపుఁడును, అవ్యక్తుఁడును నగుపరమేశ్వరుని యర్చనవిషయమై, అస్యైవా యనఁగా గంధపుష్పాదిపూజాద్రవ్యముల

యొక్క యుపయోగము లేకుండుటవలనంగూడ నతనికి ధ్యానరూపమయినయర్చనయే చేయఁదగి యున్నది. ఎందుచేత ననఁగా నాకారము లేనివానికి గంధము, పుష్పములు, ధూపము, దీపము, నైవేద్యము మొదలగువాని నర్పించుట తగయుక్తము గాదు. కావున నిరంతరమును సావధానచిత్తుఁడై శ్రద్ధాయుక్తముగ జ్యోతిస్స్వరూపుఁ డగునాపరమేశ్వరునిగూర్చి ధ్యానమే చేయఁదగినది యని యర్థము.

అవ. ఇపుడు చెప్పినపరమేశ్వరునిజ్యోతిర్మయమగు స్వరూపమగ్ని మొదలగువానిజ్యోతివలె జ్యోతియా? లేక విలక్షణమైనదియా? యని తెలియఁగోరఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. చిన్మయం ప్రకృతిప్రేరకత్వాత్. ౫౫

భా. పరమేశ్వరునకుఁ జిన్మయ మనఁగాఁ జైతన్యాత్మక మయిన స్వరూపమే కలదు గాని, యగ్ని మొదలగువానిజ్యోతివలె భౌతిక మగు జ్యోతిస్స్వరూపము గా దని తెలియఁదగును. మఱియు నాజ్యోతి జ్ఞానాత్మకమే యని యెఱుంగ నగును. ఎందుచేత ననఁగా:— త్రిగుణాత్మికయు, జడస్వభావయు నగుప్రకృతి చేతనుఁ డగుపరమేశ్వరునిచేతనే ప్రేరితురాలయి చరాచరప్రపంచరూపముగాఁ బరిణమించుచుండును. ఈవిషయము, „ శ్లో. మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్" అనఁగా నోయర్జునా! నాయాశ్రయముచేతనే ప్రకృతి యీ చరాచరప్రపంచమును బుట్టించుచున్నది. యని గీతలలో శ్రీకృష్ణభగవానుఁడే చెప్పి యున్నాఁడు. ఇది గాక, ప్రకృతియొక్క వికారజాతమంతయుఁ జేతనునిచేతను బ్రేరేపింపఁబడుచున్నట్టు కనుపట్టుచున్నది. అస్మదాదులశరీరములుగూడఁ దదంశభూతుఁడును, జేతనుఁడును నగుజీవాత్మచేఁ బ్రేరేపింపఁబడిన వగుచు ననుభవింపఁబడుచున్నవి. వేదమందుఁగూడ „ సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మ " అనఁగాఁ బరమాత్మ సత్యస్వరూపుఁడు, జ్ఞానస్వరూపుఁడు, అనంతస్వరూపుఁడు. అనియు „ నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్, సాక్షీ చేతా కేవలో నిర్గుణ శ్చ." అనఁగా నతఁడు నిత్యమైనవస్తువులలో నిత్యుఁడు. చేతనపదార్థములలోఁ జేతనుఁడు, అన్నిటికిని సాక్షి, చైతన్యమును గలిగించువాఁడు, కేవ

లుఁడు, సత్త్వము, రజస్సు, తమస్సు ననుమూఁడుగుణములును లేని వాఁడు. అనియుఁ జెప్పఁబడి యున్నది. ఇత్యాదివచనములచేతను బరమాత్మునిస్వరూపము చైతన్యాత్మకమే యని ప్రతిపాదింపఁబడియున్నది. అయస్కాంతము (సూదంటుఱాయి) మొదలగునది జడపదార్థమయ్యును ప్రేరకముగాఁ గన్పట్టుచున్నది గాదా యందువేని వినుము. ఆప్రేరణ బుద్ధిపూర్వకము గాదు గావున నది విచిత్రరచనవిషయమై యుపయోగించునది గాదు. ఈసంగతి యనుమానప్రకరణమునందుఁ బూర్వము నిర్ణయింపఁబడియే యున్నది. కావునఁ జేతనమునకే ప్రేరకత్వము యుక్తముగా నున్నది. మఱియు,

సూ. న నిత్య మపరిణామిత్వాత్. ౫౭.

భా. ఆపరమేశ్వరునిస్వరూపభూత మగునచైతన్యము నిత్యము. అనఁగా మూఁడుకాలములయందును సమానమైన సత్త గలది. వినాశము లేనిదియు నని తెలియఁ దగును. ఎందుచేత ననఁగా, లోకములో నేది పరిణామమును బొందుస్వభావము గలదిగాఁ గన్పడుచున్నదో నావస్తువే కాలాంతరమందు నశించి పోవుచున్నది. అనిత్య మని కూడఁ జెప్పఁబడుచున్నది. చిచ్ఛక్తి పరిణామమును బొందుస్వభావము గలది గాదు గనుక నిత్య మని చెప్పఁబడుచున్నది. ఎందుచేత నన, జ్ఞానశక్తియొక్క యఖండప్రకాశిత్వ మపరిణామిత్వమును సూచన సేయుచున్నది. "ఘటజ్ఞానము గలిగినది. పటజ్ఞానము నశించినది." ఇటువంటిచోటులను గనుపడుచున్న జ్ఞానముయొక్క పరిణామము అంతఃకరణవృత్తిధర్మమే కాని జ్ఞానముయొక్క ధర్మము గాదని తెలియుము. వృత్తులయొక్క యుత్పత్తివినాశములు రెండును అఖండావభాసకములు గావున జ్ఞాన మెప్పుడును బరిణామమును బొందునది కాదని నిశ్చయింపవలయును. ఈవిషయమై "శ్రు. న ద్రష్టుర్దృష్టే ర్విపరిలోపో విద్యతే౽వినాశిత్వాత్." అనఁగా, ద్రష్ట యనఁగాఁ జేతనుఁ డగుపురుషునిజ్ఞానశక్తి వినాశము లేనిది గనుక దాని కెన్నటికిని వినాశము లేదు. అని బృహదారణ్యకోపనిషత్తు చెప్పుచున్నది. మఱియు "శ్లో. అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్." అనఁగా నోయర్జునా! దేనిచే నీసర్వప్రపంచమును నిండింపఁబడి

యున్నదో అది వినాశములేనిది యని బాగుగాఁ దెలిసికొనుము. అని గీతకూడ నీయర్థమునే చెప్పుచున్నది. మఱియు,

సూ. ఆనందమయో౽భ్యాసాత్. ౧౭౭

భా. ఇదివఱకుఁ జెప్పఁబడినచైతన్యాత్మక మగుపరమేశ్వరునిస్వరూప మేది గలదో యది యానందమయ మని కూడఁ దెలియఁదగును. ఏమనఁగా, పరమేశ్వరునియానందముయొక్క యంశమే ప్రపంచమునందు శబ్దస్పర్శాదివిషయసంయోగకాలమందును, నిద్రాసమయమందును, సమాధియందును, అనుభవింపఁబడుచున్నది. ఈవిషయమై "శ్రు. ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి "అనఁగా నీపరమేశ్వరునియానందముయొక్క లేశమువలననే యితరము లగుభూతములన్నియు నానందమును బొందుచున్నవి. అని శ్రుతి ప్రమాణ మున్నది. శబ్దము, స్పర్శము మొదలగు విషయములసంయోగము గలిగినప్పుడు గలుగుచుండునానందము బాహ్యవిషయములయందే కలుగుచున్న దని తలంపరాదు. ఎందుచేత ననఁగా, నిద్రాసమయమందును,సమాధిసమయమందును, విషయములు లేకున్నను ఆనంద మనుభవింపఁబడుచున్నది. విషయసంయోగముమాత్రము చిత్తము నిశ్చలముగా నుండుటకుఁ గారణ మగుటవలనఁ గేవలమును ఆనందమున కభివ్యంజక మగుచున్నది. కాఁబట్టి యది పరమాత్మునియానందమే యని దృఢముగాఁ దెలియవలయును. ఆవిషయమై "శ్రు. విజ్ఞాన మానందం బ్రహ్మ, కం బ్రహ్మ ఖం బ్రహ్మ, ఆనందం బ్రహ్మణో విద్వాన్." ఇత్యాదివాక్యములచేఁ బరమేశ్వరునిస్వరూప మానందాత్మక మనియే ప్రతిపాదింపఁబడినట్లు లయినది. కాఁగాఁ బరమేశ్వరునిస్వరూపము సచ్చిదానందాత్మకముగాఁ దెలియఁదగినది యని మూఁడుసూత్రములసముచ్చయార్థము.

అవ. ఈప్రకారముగా నవ్యక్తుఁడును నిర్గుణుఁడును నగుపరమేశ్వరునిస్వరూపమును నిరూపణచేసి యిపు డుపాసన కుపయోగించుటకై ప్రకృతిసంయోగమువలనఁ గలిగినతత్స్వరూపమును సంక్షేపముగా వర్ణించుచున్నాఁడు:—

సూ. సర్వాంతర్యామిత్వం తచ్ఛ్రుతేః. ౫౮

భా. పరమాత్ముఁడు చరాచర ప్రపంచమునందలి భూతజాతమున కంతర్యామి యని తెలియఁదగును. ఏదుచేత ననఁగా, ఆపరమేశ్వరున కంతర్యామిత్వమును బ్రతిపాదించెడి శ్రుతులు ప్రమాణముగా నున్నవి. ఎట్లనఁగా,

"శ్రు. య స్సర్వేషు భూతేషు తిష్ఠన్ సర్వేభ్యో భూతేభ్యో ఽంతరో యం సర్వాణి భూతాని నవిదు ర్యస్య సర్వాణి భూతాని శరీరం య స్సర్వాణిభూతాన్యంతరో యమయ త్యేష త ఆత్మాంతర్యా మ్యమృతః."

అనఁగా:—ఏపరమేశ్వరుఁడు సర్వభూతములయందును నుండు వాఁడో, సర్వభూతములకంటె నంతరుఁడో, ఎవనిని సర్వభూతములును తెలిసికోఁజాలవో, సమస్తభూతములును నెవ్వానిశరీరమో, ఎవ్వాఁడు సమస్తభూతములహృదయములయందును నుండి ప్రేరేపించుచున్నాఁడో, ఆయంతర్యామియే యమృతుఁ డగునీయాత్మ. అని వాజసనేయి బ్రాహ్మణమందుఁ జెప్పఁబడియున్నది. మఱియు,

"శ్లో. ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున! తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అనఁగా, ఓయర్జునా! సర్వభూతములహృదయమందును బరమేశ్వరుఁడు గలఁడు. ఆతఁడు మాయచేతను సంసారరూపమగుయంత్రముపై నెక్కియున్న సమస్తభూతములను ద్రిప్పుచున్నాఁడు. అని శ్రీమద్భగవద్గీతలయందును జెప్పఁబడియే యున్నది. ఇట్లంతర్యామిత్వమును బ్రతిపాదించుటచే సర్వభూతాంతఃకరణప్రేరకుఁ డగుటవలనఁ బరమేశ్వరునకు సకలభూతవశిత్వముగూడఁ జూపిన ట్లగుచున్నది.

అవ. ఇట్లు పరమేశ్వరున కంతర్యామిత్వమును నిరూపించి యిప్పుడు సర్వజ్ఞత్వమును వర్ణించుచున్నాఁడు:—

సూ. కర్మఫలదాతృత్వా త్సార్వజ్ఞ్యమ్. ౫౯

భా. పరమేశ్వరుఁడు కర్మఫలము నిచ్చువాఁడు గనుక సర్వజ్ఞుఁ డనిగూడఁ దెలియవలెను. అవిషయమై "శ్రు. యాథాతథ్యతో ఽ

ర్థాః వ్యదధా చ్ఛాశ్వతీభ్య స్సమాభ్యః." అనఁగా నీశ్వరుఁ డనేక సంవత్సరములనుండి యనఁగా నెప్పుడును యథాయోగ్యముగాఁ గర్మ ఫలమును దాల్చుచున్నాఁడు. అనఁగా జీవుల కిచ్చుచున్నాఁడు. అని యజుస్సంహిత ప్రమాణ మున్నది. మఱియు ౫ సూ. ఫల మత ఉప పత్తేః." అనఁగాఁ గర్మఫలమును బరమేశ్వరుఁడే యిచ్చుచున్నాఁడు. ఎందుచేత ననఁగా, ఈశ్వరుఁడే సర్వజ్ఞుఁ డగుటవలనఁ గర్మఫల మిచ్చుట సంభవించును. కాని జడకర్మములలో ఫలమిచ్చుట స్వతస్సంభవము గాదు. కాఁబట్టి పదునాలుగులోకములలో నుండెడిజీవులు చేసినశుభా శుభకర్మముల ననుసరించి యథాయోగ్యముగా ఫలమిచ్చుచుండుటవ లనఁ బరమేశ్వరునకు సర్వజ్ఞత్వము నిశ్చయింపఁబడుచున్నది. ప్రతిదిన మును బరస్పరవిలక్షణముగను, లెక్క లేకుండఁగను జేయఁబడుచుండెడి జీవులకర్మముల నొక్కసర్వజ్ఞుఁడే తక్కఁ దక్కినవా రెవ్వరును దెలిసి కొనుటకు సమర్థులు గారు. తద్విషయకజ్ఞానమే లేనపుడు ఫల మిచ్చు టెట్లు సమకూడెడిని? కావున సమస్తజీవులకర్మములకును ఫలము నిచ్చుచుండుటవలనఁ బరమేశ్వరునకు సర్వజ్ఞత్వము సిద్ధించుచున్నది. మఱియు,

సూ. నిగమాగమాభ్యాం చ. ౬౦

భా. నిగమ మనఁగా వేదము. ఆగమ మనఁగా శాస్త్రము. అనఁగా శ్రుతిస్మృతులచేఁగూడఁ బరమేశ్వరునకు సర్వజ్ఞత్వము నిశ్చ యింపఁబడుచున్నది. ఈవిషయమై, ,, శ్రు. య స్సర్వజ్ఞ స్సర్వవి ద్యస్య జ్ఞానమయం తపః." అనఁగా, నెవఁడు సర్వజ్ఞుఁడో? యెవఁడు సర్వమును దెలిసికొనుచున్నాఁడో? యెవనికిజ్ఞానమయ మగుతపస్సు గలదో. అనియథర్వవేదములోని ముండకోపనిషత్తునందును, " శ్రు. జ్ఞః కాల కాలో గుణీ సర్వవి ద్యః." అనఁగా నేపరమేశ్వరుఁడు సర్వజ్ఞుఁడును, కాలునకుఁగూడఁ గాలుఁడును, సర్వగుణములను బ్రేరేపించువాఁడును, సర్వమును దెలిసినవాఁడునో, అనికృష్ణయజుర్వేదమునందును,

"శ్లో. వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున!
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన."

అనఁగా, ఓ యర్జునా! నే నిదివఱకుఁ గడచినటువంటివియు నిపుడు జరగుచున్నటువంటివియు, నిఁక ముందు కాఁబోవునటువంటివియు నగుభూతములఁ నన్నింటిని బాగుగా నెఱుఁగుదును. కాని నన్ను మాత్ర మెవ్వరును దెలిసికోఁజాలరు. అని గీతలయందును, "సూ. తత్ర నిరతిశయం సర్వజ్ఞబీజమ్." అనఁగా, ఆ పరమేశ్వరునియందు సర్వజ్ఞత్వబీజము నిరతిశయముగా నున్నది. అనఁగాఁ బరమేశ్వరునితో సమానముగా సర్వజ్ఞుఁ డొక్కఁడును లేఁడు. అని పతంజలిమహాముని కృతయోగసూత్రములలోనను జెప్పఁబడియున్నది.

అవ. "ఏమండీ! గురువుగారూ! ఇంద్రాదిదేవతలును, వసిష్ఠుఁడు మొదలగు మహర్షులును నెందఱెందఱో సర్వజ్ఞులైనట్టు వినవచ్చుచున్నది గదా! ఒక్క పరమేశ్వరుఁడే సర్వజ్ఞుఁ డని సెలవిచ్చుచున్నా రేల?" అని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు :—

సూ. ఆలోచనపూర్వకత్వాత్తు నాన్యేషాం తత్సామ్యమ్. ౨౧

భా. సూత్రములోని 'తు, శబ్దముచే శంకను వారించుచున్నాఁడు. దేవతలకును మహర్షులకును గల సర్వజ్ఞత్వ మాలోచన మనఁగా ధ్యానముతోఁ గూడుకొని యున్నది. వా రెప్పుడు జరిగినదానిని గాని జరుగఁబోవుదానిని గాని తెలిసికొన నిచ్ఛయింతురో అప్పుడు క్షణకాల మంతర్ముఖులై యాయర్థమును స్మరించుచుందురు అనఁగాఁ దెలిసికొనుచుందురు. పరమేశ్వరునకో? సర్వకాలసర్వావస్థలయందును ఆలోచనయే యక్కఱ లేకుండ సకలపదార్థముల విషయక మగు జ్ఞానము క్రమముగూడ నక్కఱ లేకుండఁగనే చేతిలోని యుసిరికకాయ వలె నుండును. కనుక నితరులగు దేవతలయుఁగాని మహర్షులయుఁగాని సర్వజ్ఞత్వము పరమేశ్వరునిసర్వజ్ఞత్వముతోఁ బోల్చుటకు వలనుపడదు. కావునఁ బరమేశ్వరునకే ముఖ్యమయిన సర్వజ్ఞత్వము గలదు గాని యితరుల కెంతమాత్రమును లేదని తెలిసికొమ్ము.

అవ. ఈప్రకారముగాఁ బరమాత్మునికి సర్వజ్ఞత్వమును వర్ణించి యిపుడు సర్వశక్తిత్వమును నిరూపించుచున్నాఁడు :—

సూ. సర్వశక్తిత్వం జగన్నిర్మాణకర్తృత్వాత్. ౨౨

భా. సర్వశక్తిత్వముగూడఁ బరమేశ్వరునకే యున్నట్లు భావన సేయఁదగును. ఎందుచేత ననఁగా, సంకల్పమాత్రముననే గ్రహములు, నక్షత్రములు, పర్వతములు, సముద్రములు, మొదలగు విచిత్రములతోఁ గూడియున్న జగత్తును రచించుచుండుటచేఁ బరమేశ్వరునకే సర్వశక్తిత్వము నిశ్చయింపఁబడుచున్నది. అల్పశక్తిగల పురుషుఁ డెన్నటికిని నిటువంటి మహాకార్యమును జేయఁజాలఁడుగా! బ్రహ్మాదిదేవతలకును యోగులకును, సిద్ధులకును గొన్ని చోటులను గొంచెముగనో గొప్పగానో నిర్మాణసామర్థ్య మున్నట్లు వినఁబడుచున్న దందు వేమో? అదియును ఆ పరమేశ్వరుని యనుగ్రహముచేతనే వానిలో నొకానొక యంశచేఁ బ్రాదుర్భవించుచున్న దని తెలిసికొనుము. కావున ముఖ్యమైన సర్వశక్తిత్వము పరమేశ్వరునకే కలదు. ఈవిషయమై.

"శ్రు. పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞానబలక్రియా చ."

అనఁగా, ఈ పరమేశ్వరునకు జ్ఞానరూపము, బలరూపము, క్రియారూపము, అగుశక్తి వినవచ్చుచున్నది. అది స్వాభావికమైనది. అన్నింటికంటె నెక్కువది. అది యనేకవిధములు. అని కృష్ణయజుర్వేదములోని శ్వేతాశ్వతరోపనిషత్తు ఘోషించుచున్నది.

అవ. "జగత్తులను నిర్మించుటకు కర్తయగు పరమేశ్వరునకుఁ గూడ నెవఁడేని యొకఁడు నిర్మాత యుండియే తీరును" అనెడి యాక్షేపమును బరిహరించుచున్నాఁడు :—

సూ. నతత్పరో ఽనవస్థాప్రసంగాత్. ౬౩

భా. అనవస్థాప్రసంగమువలన ఆపరమాత్మునికంటె నెవ్వరును నుత్కృష్టులు లేరనియే చెప్పవలయును. నీవు చెప్పినరీతిగా పరమేశ్వరునకుఁగూడ నెవ్వఁడేని జనకుఁ డున్న ట్లొప్పితిమేని యతనికిఁగూడ నింకొకజనకు నొప్పకతీరదు. వాని కింకొకనిని, వాని కింకొకనిని, వానికి నింకొకనిని నొప్పుచుండవలెను. కావున వ్యవస్థ లేకపోవును. అదియుక్తము గాదు. కాఁబట్టి పరమేశ్వరుఁడే, అందఱకును బరుఁ డగుజనకుఁడు గాని యితరులు గాఁజాల రని తెలియవలయును. ఈవిషయమై:—

"శ్రు. న కారణం కరణాధిపాధిపో
నచాస్య కశ్చి జ్జనితా నచాధిపః."

అనఁగా, ఆ పరమేశ్వరుఁడు సర్వమునకును కారణము. అతఁడే జీవాత్మను నియమించుచుండువాఁడు. అతనికిఁ దండ్రిగాని, అధిపతి గాని లేరు. అని శ్వేతాశ్వతరోపనిషత్తునందును,

"శ్లో. మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ!
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ,
పితాహ మస్య జగతో మాతా ధాతా పితామహః"

అనఁగా, ఓయర్జునా! నాకంటెఁ బైఁగా నుండునది గొంచెమే నియు లేదు. సూత్రమునందు మణులవలె నీబ్రహ్మాండమంతయు నా యందుఁ గ్రుచ్చఁబడి యున్నది. ఈ ప్రపంచమునకు నేనే తండ్రిని, తల్లిని, విధాతను, పితామహుఁడను నై యున్నాను. అని భగవద్గీతలయందు ను, "సూ. సపూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్" అనఁగా, ఆపరమేశ్వరుఁడు పూర్వు లనఁగా బ్రహ్మ మొదలగువారికిని గురువు. ఎందుచేత ననఁగా, అతనికిఁ గాలముచేతను వినాశము లేదు. అనిపతంజలిభగవానునిచే యోగసూత్రములలోనను జెప్పఁబడియున్నది. మఱియు,

సూ. నిరీశ్వరత్వశ్రుతే శ్చ. ౫౨

భా. పరమేశ్వరునకు నిరీశ్వరత్వము వినఁబడుచుండుటవలనను గూడ నతనికంటెఁ బైఁగా నింకొకఁడు లేఁడని తెలియవలెను. ఇందులకు,

"శ్రు. నతస్య కశ్చి త్పతి రస్తి లోకే నచేశితా నైవచ
తస్య లింగమ్, న తత్సము శ్చాభ్యధికశ్చ దృశ్యతే."

అనఁగా, ఆపరమేశ్వరునకు లోకములోఁ బతి గానియీశ్వరుఁడు గాని వేఱొకఁడు లేఁడు. మఱియు నతనికొకానొకచిహ్నము గూడ లేదు. అతనితో సమానుఁడు గాని, అతనికంటె నెక్కువవాఁడు గాని లేరు. అని శ్వేతాశ్వతరోపనిషత్తునందును, "శ్లో. నత్వత్సమోఽ స్త్యభ్యధికః కు తో ఽన్యో లోకత్రయే ఽప్యప్రతిమప్రభావ!" అనఁగా నిరుపమాన మయినప్రభావము గలశ్రీకృష్ణా! ముల్లోకములయందును నీతో సమా

నుండే లేదు గదా! నీకంటె నెక్కువవాం డెక్కడనుండి వచ్చును? అని భగవద్గీతాదులయందును గలవాక్యములే ప్రమాణము. మఱియు,

సూ. అత ఏవ స్వాతంత్ర్యమ్. ౭౫

భా. కనుకనే అనఁగాఁ బరమేశ్వరుఁడు నిరీశ్వరుఁడు గనుకనే స్వతంత్రుఁ డనికూడఁ దెలిసికోఁదగి యున్నది. తనకంటెఁ బైఁగా నింకొకఁ డున్నచోఁ బరతంత్రతయే యగును. తదభావమువలనఁ బరమేశ్వరుఁడు నిరంకుశుఁడు గనుక నతనికి స్వాతంత్ర్యము స్వతస్సిద్ధముగానే యున్నది. ఈవిషయమై "శ్రు. సోఽక్షరః పరమ స్స్వరాట్" అనఁగా నా పరమేశ్వరుఁడు వినాశము లేనివాఁడును, పరముఁడును, స్వతంత్రుఁడును నై యున్నాఁడు. అను వేదమే ప్రమాణము.

అవ. ఈరీతిగాఁ బరమేశ్వరునకు స్వాతంత్ర్యమును నిరూపించి యిపుడు సర్వవ్యాపకత్వమును వర్ణించుచున్నాఁడు:—

సూ. సర్వవ్యాపిత్వం కారణత్వాత్. ౭౬

భా. పరమేశ్వరునకీప్రపంచమునం దంతటను వ్యాపకత్వము గూడఁ గల దని తెలియవలయును. ఎందుచేత ననఁగా, పరమేశ్వరుఁడే యీసమస్తప్రపంచమునకును కారణము. కారణము చేతను కార్యము వ్యాప్తమై యుండు నని నియమమున్నది. పరమేశ్వరుఁ డీప్రపంచమునకు లోపలను బైటను గూడ నిండి యున్నవాఁడు గనుక సర్వవ్యాపకుఁ డని నిశ్చయింపవలయును. ఈవిషయమై "శ్రు. ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా" అనఁగా, పరమేశ్వరుఁ డొక్కఁడే సర్వభూతములయందును గూఢముగా నున్నవాఁడును, సర్వవ్యాపియు సర్వభూతములయంతరాత్మయుఁ గూడ నయి యున్నాఁడు, అని శ్వేతాశ్వతరోపనిషత్తును "శ్లో. నిత్య స్సర్వగత స్స్థాణు రచలోఽయం సనాతనః" అనఁగా, ఓయర్జునా! .. యంతర్యామి యగు నాత్మ సర్వవ్యాపకుఁడును, స్థిరుఁడును, చలనము లేనివాఁడును సనాతనుఁడును నయి వెలుఁగుచున్నాఁడు. అని గీతయుఁ బ్రమాణము. ఈ ప్రకారముగాఁ జతుర్భుజములుగల విష్ణునిస్వరూపమును ధ్యానించిన పిమ్మటను సచ్చిదానందాత్మకమును, సర్వగతమును, సర్వసాక్షిభూతము,

జ్యోతిర్మయము, అవ్యక్తము నగుపరమేశ్వరునిస్వరూపమును నిశ్చలమైన మనస్సుచే నెల్లవేళలయందును ధ్యానము చేయుచుండవలయును.

ఇట్లు శ్రీబ్రహ్మానందస్వాములవారిచే సంస్కృతమున రచింపఁబడినభాష్యము ననుసరించి పురాణం-సూర్యనారాయణతీర్థులచే నాంధ్రీకరింపఁబడిన యీశ్వరదర్శనభాష్యమునందు ద్వితీయపాదము సమాప్తమయినది.





శ్రీరస్తు.

ఓం నమ శ్శ్రీకామేశ్వర్యై.

# ఈశ్వరదర్శనము.

తృతీయపాదము.

అవ. పైని జెప్పఁబడినప్రకారముగాఁ బరమేశ్వరునకు వ్యక్తమనియు, నవ్యక్తమనియు రెండువిధము లయినస్వరూపమును నిరూపించి తదర్చనవిధానమును వేఱుగాఁ జెప్పి యనంతర ముపాసన కుపయోగించుటకై యీశ్వరస్వభావమును సంక్షేపముగా వర్ణించి యిప్పుడుపాసన కంగభూత మయినకృత్యవిశేషమును, తత్త్వజ్ఞానముయొక్క ప్రాప్తిప్రకారమును జూపుటకై మూఁడవపాదము ప్రారంభింపఁబడుచున్నది. అందు ముందుగాఁ బూర్వమునఁ జెప్పఁబడినజ్యోతిర్మయుఁ డగు పరమేశ్వరుని ధ్యానించినతరువాత వ్యుత్థానసమయమం దేమిచేయవలయునో దానిని జూపుచున్నాఁడు:—

సూ. ప్రణవాదిజప స్తదంగత్వాత్. ౧

భా. పరమేశ్వరు నారాధించువిషయమై యాసక్తి గలపురుషుఁడు పైని జెప్పఁబడినధ్యానము చేసినవెనుకను పరమేశ్వరుని బ్రతిపాదించుప్రణవ (ఓంకార)ము మొదలయినపవిత్రము లగుమంత్రములను జపించుచుండవలయును. పరమేశ్వరారాధనవిషయమై ప్రణవాదిమంత్రములజపమే యంగమై యున్నది. లోకములో మంత్రులు మొదలగువారిదయ సంపాదించుకొనకుండ రాజులదయ యెట్లు దుర్లభమో అట్లే అంగము లగుప్రణవాదిమంత్రములసిద్ధి కాకుండ నంగి యగుపరమేశ్వరునిసిద్ధి యెప్పుడును గాఁజాలదు. ఎందుచేత ననఁగా,

ప్రణవాదిమంత్రములజపముచేతను సమస్తపాపములును నశించినపురుషుఁడే శుద్ధమైనయంతఃకరణముగలవాఁడగును గావున వానికే భగవంతుని స్వరూపమును ధ్యానించువిషయమై యోగ్యత కలుగుచుండును. ఈవిషయమున "యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి" అనఁగా సర్వయజ్ఞములలో జపయజ్ఞము నేనే యగుచున్నాను. అనుగీతావాక్యము "జపతో నాస్తి పాతకమ్" అనఁగా జపము సేయువానికిఁ బాపము లుండవు. అనుమనువాక్యమును బ్రమాణములు గావచ్చును. అందుఁ బ్రణవ మనఁగా, ఓంకారము. అది పరమేశ్వరునిమొదటినామ మని తెలియఁదగును. ఈవిషయమై:—

"శ్లో. అదృష్టవిగ్రహో దేవో భావగ్రాహ్యో మనోమయః,
తస్యోంకార స్స్మృతో నామ తేనాహూతః ప్రసీదతి."

అనఁగా, మనచర్మచక్షుస్సులకుఁ గనఁబడనివాఁడును, భావనామాత్రముచే గ్రహింపఁదగినవాఁడును, మనోమయుఁడును అగునేపరమేశ్వరుఁడు గలఁడో అతనికిఁ బ్రణవ (ఓంకార) మని పేరు. అతఁ డాప్రణవమును జపించినవారికే ప్రసన్నుఁ డగును. అని యాజ్ఞవల్క్యమహాముని వాక్యము ప్రమాణ మున్నది. ఈయర్థమునే పతంజలిభగవానుఁడు తనయోగసూత్రములలో "తస్య వాచకః ప్రణవః." అనఁగా నాయీశ్వరునకుఁ బ్రణవమే వాచకము. అని సూత్రించియున్నాఁడు. సూత్రములోని ఆదిశబ్దముచేతను, అష్టాక్షరి, ద్వాదశాక్షరి, మొదలగు మంత్రములు, భగవద్గీత, విష్ణుసహస్రనామస్తోత్రము మొదలగువానిని సంగ్రహింపఁదగును.

అవ. ప్రణవాదిమంత్రముల జపించునతనికిఁ దదుపయోగ మగు ఋష్యాదిజ్ఞానముగూడ సంపాదింపఁదగినది యని చెప్పుచున్నాఁడు:—

సూ. ఋషిచ్ఛందోఽధిదైవతజ్ఞానపూర్వకం వై శేషాత్.

భా. ఈమంత్రమును ప్రవర్తింపఁజేసినఋషి యెవరు? ఈమంత్రమునకు ఛంద స్సేది? దేవత యేది? అనుసంగతి జపారంభమునందుఁ దప్పక స్మరింపవలయును. ఎందుచేత ననఁగా, ఋష్యాదిజ్ఞానపూ

ర్పకముగా మంత్రమును జపించినచో విశేషముగా ఫలము సిద్ధించును.
ఈవిషయమున:—

"శ్లో. ఋషిం ఛందోఽధిదైవంచ ధ్యాయన్ మంత్రస్య సత్తమే !
యస్తు గార్గి! జపే న్మంత్రం తదేవహి ఫలప్రదమ్."

అనఁగా, మిగులఁ బండితురాల వగు గార్గీ ! ఎవఁడు మంత్రము యొక్క ఋషిని, ఛందస్సును, దేవతను, ధ్యానముచేయుచు మంత్రమును జపించునో వానికే ఆమంత్రము ఫలము నిచ్చుచుండును. అని యోగియాజ్ఞవల్క్యుఁడు సెప్పియున్నాఁడు. ఋషి మొదలగునవి తంత్రశాస్త్రములవలనఁ దెలిసికోఁదగును. సూత్రములోని "వైశేష్య" పదగ్రహణమువలన ఋషి మొదలగువానిని దెలిసికోఁజాలనివాఁడైనను శ్రద్ధగా జపించినచో యథోక్తఫలము గలుగు నని చూపఁబడినది.

అవ. ఇట్లు జపారంభమునందుఁ జేయఁదగినదానిని జెప్పి యిప్పుడు జపము చేయుచున్నప్పుడు చేయవలసినదానిని జెప్పుచున్నాఁడు:—

సూ. తదర్థభావన మన్యనిషేధార్థమ్. 3

భా. ఆమంత్రమునకు శాస్త్రసమ్మతమును దేవతాస్వరూపాదులను బ్రతిపాదించునదియు నగునేయర్థము గలదో ఆయర్థమును, మంత్రము నావర్తించుసమయమున భావింపవలయును. అనఁగా మాటిమాటికిని మనస్సులోఁ జింతన సేయుచుండవలయును. ఈవిషయమై "సూ. తజ్జప స్తదర్థభావనమ్" ఆమంత్రముయొక్క జప మనఁగా, అర్థమును మనస్సులోఁ జింతన సేయుచుండుట. ప్రణవాదిమంత్రములను జపించునపుడు వానియర్థమునుగూడ మనస్సులోఁ జింతించుచుండవలయు ననుట పరమార్థము. మంత్రార్థమును జింతన సేయుటవలని ప్రయోజనమును జెప్పుచున్నాఁడు:— "అన్యనిషేధార్థమ్" అని. అనఁగా జపము సేయునప్పుడు మనస్సును ధ్యేయస్వరూపమును వదలి మఱొకచోటునకుఁ బోనీయఁగూడదు. అని యర్థము. మనస్సు క్షణక్షణమందును బరిణామము (మార్పు) ను బొందుస్వభావముగలది గనుకఁ జంచల మని చెప్పవచ్చును. అటువంటిమనస్సును నెందులకును బోనీయక భగవంతునిస్వరూపమందే నిలుకడగా నుంచవలయును.

అవ. ఇదివఱకు సామాన్యముగాఁ జిత్తనిరోధప్రకారము చూపి యిప్పుడు మఱొకయుపాయమును జూపుచున్నాఁడు :—

సూ. అధిష్ఠాతృవీర్యానుచింతనం చ. ౪

భా. జపింపఁబడుచున్న మంత్రమునకు భగవత్స్వరూప మగునధిష్ఠాత యనఁగా దైవ మేది గలదో, ఆదైవముయొక్క వీర్య మనఁగాఁ బరాక్రమవిమిత్తమువలనఁ బ్రకటమైనవియు, శాస్త్రములయందుఁ బ్రసిద్ధములైనవియు నగునేదివ్యకర్మములు గలవో, (అవి పండితులవలనఁ విన్నవిగాని స్వయముగా శాస్త్రములలోఁ జూచినవిగాని) వానినిగూడ జపముసేయునపుడు మనస్సులోఁ జింతనసేయవలయును. అనఁగా, మనస్సు కోఁతివంటిదగుటచే నలువైపులకును బరువులెత్తుస్వభావముగలది గనుక ధ్యేయస్వరూపమాత్రమును జింతనసేయువిషయమై యొక్కమాఱుగా నిలుకడగలది గాఁజాలదు. కనుక మనస్సున కనుకూలమగునట్లు పదునాలుగులోకములను సృజించుట, పాలించుట, సంహరించుట మధుకైటభులను జంపుట, హిరణ్యకశిపునివక్షస్తలము చీల్చుట, పాలసంద్రమును మథింపించుట, రావణవంశమును ధ్వంసముసేయుట, కంసుని జుట్టుపట్టుకొని లాగి చంపుట, మొదలైన భగవంతునిలీలావిహారములయందే మనస్సును బ్రసరింపఁ జేయవలయును గాని యితరవస్తువులవిషయమై పరుగులెత్తనీయఁగూడ దని ముఖ్యతాత్పర్యము.

సూ. సర్వత్ర తన్మయత్వావలోకనం వా. ౫

భా. అట్లు కాక మనస్సు విశేషముగాఁ జాంచల్యము గలదియయి యుండు నప్పుడు సర్వత్ర తన్మయత్వము ననఁగా నంతటను ధ్యేయాత్మకత్వమునే చూచుచుండవలయును. అనఁగా—మన స్సెచ్చటికెచ్చటికిఁ బోవుచునుండునో, అచ్చటచ్చటనే భగవత్స్వరూపత్వమును భావన సేయుచుండవలయు నని యర్థము. భగవంతుఁ డంతటను గలఁడనువిషయమై :— "శ్రు. ఆకాశవ త్సర్వగత శ్చ నిత్యః" అనఁగా భగవంతుఁ డాకాశమువలె సర్వమును బొందియున్నవాఁడును, నిత్యుఁడును, అనుశ్రుతియు "శ్లో. మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా" అనఁగా నవ్యక్తమూర్తినగు నాచేత నీప్రపంచ మంతయు నిండియున్నది,

అనుగీతావాక్యమును బ్రమాణము. పరమేశ్వరుఁడు సమస్తమైనపదార్థములయందును ననుగతుఁడగుటవలన జపకాలమున "సర్వం విష్ణుమయం జగత్" అనఁగాఁ బ్రపంచమంతయు విష్ణుమయమనుబుద్ధిచేతను జూచుచుండవలయు నని తాత్పర్యము.

అవ. ఈప్రకారముగా జపము సేయువిధమును నిరూపించి యిప్పుడు మంత్రమును గ్రహించువిధిని జెప్పుచున్నాఁడు :—

సూ. ఆచార్యముఖాదేవ సాఫల్యాత్. ౬

భా. ఆచార్యుఁ డనఁగా మంత్రశాస్త్రములరహస్యముల నెఱిఁగినవాఁడును, సదాచారమందు నిష్ఠగలవాఁడును, పరమేశ్వరునిస్వరూపముయొక్కజ్ఞానముతోఁగూడినవాఁడునునగుగురువు. అటువంటిగురువుయొక్కముఖమునుండియే విధియుక్తముగా మంత్రమును గ్రహింపవలయును. కాని తనంతటఁ దానే శాస్త్రములోఁ జూచి కాని యొకరివలన విని కాని మంత్రమును జపము చేయరాదు. ఎందుచేతననఁగా; గురువుయొక్కముఖమునుండి గ్రహింపఁబడినమంత్రముయొక్కజపమే సఫల మగుచుండును. ఈవిషయమై :—

"శ్రు. ఆచార్యాద్ధైన విద్యా విదితా సాధిష్ఠం ప్రాపయతి"

అనఁగా గురుముఖమునుండి తెలిసికొనఁబడినవిద్యయే యిష్టమైనఫలమును బొందుటకు హేతు వగుచున్నది. అను సామవేదములోనిఛాందోగ్యోపనిషత్తును,

"శ్లో. భవే ద్వీర్యవతీ విద్యా గురువక్త్రసముద్భవా,
అన్యథా ఫలహీనా స్యా న్నిర్వీర్యా ప్యతిదుఃఖదా."

అనఁగా; గురుముఖమునుండి గ్రహింపఁబడినవిద్య శక్తిగలదియగుచుండును. అట్లు గ్రహింపఁబడనివిద్య ఫలహీనము; బలహీనముకూడ నయి దుఃఖమును గలిగించును. అనుశివసంహితావచనమును బ్రమాణములు.

అవ. పైని జెప్పినచొప్పున నుపాసన కంగభూతమైన జపవిధానమును నిరూపించి యిప్పుడు పరమేశ్వరోపాసనయం దాసక్తిగల పురుషులు

శ్రుతిస్మృతులయందు విధింపఁబడినయితరములైనకర్మములు చేయవల యునా? అక్కఱలేదా? అని జిజ్ఞాస కలుగఁగా నిర్ణయమును జెప్పు చున్నాఁడు:—

సూ. తదుపయోగికర్మాపి. ౭

భా. ఆపరమేశ్వరునియుపాసన కుపయోగించునవియు, శ్రుతిస్మృ తులయందు విధింపఁబడినవియు, నిత్యములు, నైమిత్తికములునగుకర్మ ములు గూడఁ దనుచితమయవకాశమును బట్టియు శక్తినిబట్టియు భగ వదుపాసకులచేఁ జేయఁదగినవియే కాని బొత్తిగా నవి విడువఁ దగినవి కావు. ఎప్పుడు బాగుగాఁ బరమేశ్వరునిధ్యానమునందుఁ జిత్తవృత్తి యారూఢ మగునో యప్పుడు కర్మములను విడిచినను దోషములేదు. ఈవిషయమై:—

"శ్లో. ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే,
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే."

అనఁగా; పరమేశ్వరునిధ్యానరూపయోగమం దారూఢుఁ డగుటకై యిచ్ఛగల మునికి ముందుగాఁ గర్మములు చేయుటయు యో గారూఢుఁ డయినపిమ్మట నతనికే కర్మములను విడిచి శమము నవలం బించుటయు నవశ్యకర్తవ్యములు. అని భగవద్గీత చెప్పుచున్నది.

అవ. ఈరీతిగాఁ గర్మములఁ జేయువిషయమై యనుజ్ఞ నిచ్చి యిపుడు విశేషప్రవృత్తిని వారించుచున్నాఁడు:—

సూ. విక్షేపహేతుత్వా న్న బహుళమ్. ౮

భా. బాహ్యకర్మములు పరమేశ్వరునిచింతనవిషయమై విఘ్న భూతములు గనుక వానిని బహుళముగా విస్తరించి చేయరాదు. "శ్రుతి స్మృతి విహితము లగుటచేఁ దప్పకుండ నాచే నీకర్మము లన్నియుఁ జేయఁదగినవి" అని యీరీతిగాఁ గర్మములయం దాదర ముంచవలయు నే కాని తత్పరత్వమునుమాత్రము పొందఁగూడదు. బాహ్యకర్మము లయం దాసక్తిగలపురుషుఁడు లెస్సగా భగవంతుని జింతించుటకై శక్తుఁడు కాఁజాలఁడుగదా! కావునఁ గర్మములను జేయుటకంటెఁ బరమేశ్వ రునియుపాసన విశేషఫలహేతు వని నిశ్చయించి యెల్లప్పుడును నాయు

ప్రమాణముగాఁ దీసికొనునో లోకము దానినే యనుసరించుచుండును.
అను భగవద్గీతలోఁ జెప్పఁబడిన న్యాయముచొప్పున లోకుల కుపదేశించు
టకై వారికి వానియందుఁ బ్రవృత్తి గలుగుచుండును. అనఁగా మన
లను జూచి యితరులగులోకులు ప్రాయశ్చిత్తాది కర్మములయందుఁ
బ్రవర్తింపఁగలరు. అని సాధారణు లగులోకుల కుపదేశించుకొఱకుఁ దమ
కుఁ బ్రయోజనము లేకున్నప్పటికిని వారు ప్రాయశ్చిత్తాదులను జేసి
కొనుచుందు రని తెలియఁదగును. ఆయీసంగతి యంతయు శ్రీకృష్ణభగ
వానులవారు గీతోపనిషత్తులో నర్జునునిగూర్చి:—

"శ్లో. సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత!
కుర్యా ద్విద్వాం స్తథాసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్"

అనఁగా, నోయర్జునా! ఎట్లజ్ఞానులు కర్మములయం దాసక్తులై
కర్మములను జేయుచుందురో యట్లే జ్ఞానియగుపురుషుఁడు కర్మఫలాసక్తి
లేనివాఁడై లోకులకుఁ బ్రవృత్తి గలిగించుతలంపునఁ గర్మముల నాచరిం
చుచుండవలయును. అని యుపదేశించియే యున్నారు. కావున నొకప్పుడు
సామగ్రి సంభవించినచో భగవద్భక్తులకుఁగూడ యుధిష్ఠిరాదులకువలెనే
ప్రాయశ్చిత్తాచరణము విరుద్ధము గాదు. అని నిశ్చయముగా నెఱుంగఁ
దగును.

అవ. ఇట్లు ప్రసంగవశమున వచ్చినయాక్షేపమునకు సమా
ధానము చెప్పి యిపుడు మరలఁ బూర్వమందుఁ జెప్పఁబడినకర్మవిస్తార
మునే నిషేధించుచున్నాఁడు:—

సూ. సముచ్చయానభిధానాత్. ౧౧

భా. వేదములలోఁ బరమేశ్వరోపాసనతోపాటు కర్మములుగూడఁ
జేయవలయు నని విధింపఁబడి యుండలేదు. కావునను బరమేశ్వరాను
చింతనపరాయణుఁడు బాహ్యకర్మములను విస్తరించి చేయఁగూడదు.

"శ్రు. అంధం తమః ప్రవిశన్తి యేఽవిద్యా ముపాసతే,
తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాగ్ం రతాః"

అనఁగా—ఎవరు కేవలమును గర్మములనే చేయుచుందురో
వా రంధతమస్సులోఁ బ్రవేశింతురు. ఎవరు కేవలమును దేవతలనే యు

పాసించుచుందురో వారు వారికంటెను మిగుల నంధతమస్సులోఁ బ్రవే
శింతురు. (అనఁగాఁ గర్మములను, ఉపాసనను రెండింటిని మిళితము చేసి
చేయవలయు ననుట.) అనువాజసనేయసంహితయందు విద్యాకర్మము
లకు శ్రూయమాణ మగుచున్నసముచ్చయము కేవలమును గర్మనిం
దాపరము గాని యుపాసనానిందాపరము గాదు. కాఁబట్టి యజ్ఞాదికర్మ
ముల కంగభూత మయిన దేవతోపాసన కర్మతులచే నవశ్యమును జేయఁ
దగినదియనియే కాని పరమేశ్వరోపాసకులచేఁ గర్మములుగూడఁ దప్పక
చేయఁదగినవి యని నియమించుట గాదు " శ్రు: కర్మణా పితృలోకో
విద్యయా దేవలోకః" అనఁగాఁ గర్మములచేతను బితృలోకము, ఉపాసన
చేతను దేవలోకమును గలుగుచున్నది. అనువేదవాక్యమునందుఁ గర్మ
ములకు నుపాసనకును ఫలము భిన్నముగా నుండుటనుబట్టికూడ నుపాసన
తోఁ గర్మములకు సముచ్చయము సంభవింపదు. మఱియు :—

"శ్రు. విద్యయా త దారోహన్తి యత్ర కామాః పరా గతాః,
న తత్ర కర్మిణో యాన్తి నావిద్వాంస స్తపస్వినః"

అనఁగా—ఎచ్చటను సమస్తమైన కోరికలును బూర్తియ
గునో, అచ్చట కుపాసనచేయువారు పోవుదురు. అచ్చోటికిఁ గర్మములను
జేయువారును, విద్వాంసులుగానితపస్వులును బోఁజాలరు. అనువచన
మువలనఁగూడ నీశ్వరారాధనవిషయమై యజ్ఞాదికర్మములయపేక్ష లేదు.
కావున భగవద్ధ్యానపరాయణులకు బాహ్యకర్మములవిస్తారమువిషయమై
యాదర ముండఁగూడ దని తేలినది.

మఱియు :—

సూ. ప్రయోజనాభావా చ్చ. ౧౨

భా. ప్రయోజనము లేకుండుటను బట్టికూడఁ బరమేశ్వరారాధ
నమువిషయమై కర్మవిస్తార మక్కఱలేదు. ఒక్కచిత్తైకాగ్రతా మాత్రము
చేతనే సాధ్యమగు పరమేశ్వరారాధనమువిషయమై బాహ్యకర్మములయవ
సర మొక్కింతయు నుండదుగదా! యజ్ఞాదికర్మములకుఁ బ్రయోజనము
ద్వివిధము. అందొకటి సకాములకు స్వర్గముమొదలగు భోగప్రాప్తి. రెండ

వధి నిష్కామముల కంతఃకరణశుద్ధి. అం దీశ్వరారాధనచేతనే సర్వభోగము లకును నవధి యగుబ్రహ్మలోకముగూడ సులభ మగుచుండఁగా నీక్ష స్వర్గాదులసంగతి వేఱుగాఁ జెప్పవలయునా ? ఈవిషయమై :—

" శ్లో. వాసుదేవే మనో యస్య జపహోమార్చనాదిషు,
తస్యాంతరాయో మైత్రేయ ! దేవేంద్రత్వాదికం ఫలమ్ "

అనఁగా—ఓమైత్రేయా! ఎవ్వనిమనస్సు జపహోమార్చనాదులయందు వాసుదేవునియందే లగ్నమై యుండునో వానికి దేవేంద్రత్వముమొదలగు ఫలము దొరకుటయు విఘ్నమే యని యెఱుంగుము. అని పరాశరమైత్రేయసంవాదరూపముగా విష్ణుపురాణములోఁ జెప్పఁబడి నవాక్యము ప్రమాణ మున్నది. కాఁబట్టి సమస్తపాపక్షయమును జేయునది యగుటవలన నీశ్వరారాధనము చిత్తశుద్ధికిఁ గారణ మనికూడ శ్రుతిస్మృతీతిహాసములయందుఁ బ్రసిద్ధ మయియే యున్నది. కావున రెండు తెఱఁగులచేతను బరమేశ్వరారాధనమువిషయమై బాహ్యకర్మము లకుఁ బ్రయోజనము లేదు.

అవ. "సరియే పైని జూపిన రెండు తెఱఁగులచేతను గర్మములకుఁ బ్రయోజనము లేకున్నచో నపుడు సర్వవిధములచేతను గర్మసముచ్ఛేదమే యగును. అట్లైనఁ గర్మములను బ్రతిపాదించు శాస్త్రములకుఁ గూడ నానర్థక్యము ప్రసక్తించునే" యని శంకరాఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. అధికారిభేదా న్నోచ్ఛేదప్రసంగః. ౧౩

భా. కర్మముల కధికారి వేఱుగాను, ఉపాసన కధికారి వేఱుగాను వ్యవస్థ చేయఁబడి యున్నాఁడు గనుకఁ గర్మముల కానర్థక్యము ప్రసక్తించు నని శంకింపఁగూడదు. శాస్త్రములలో విధింపఁబడినది గొంచెమేనియు ననుపయోగి కాఁదగదుగదా ! జననమరణములుగల సంసారచక్రమువలన భయపడువాఁడును, సమస్తదురితములు పోయినవాఁడును, సమాహితచిత్తుఁడును; విరక్తుఁడును; అగునోకానొకఁడు పరమేశ్వరోపాసన కధికారి గలఁడు. ఉపార్జితసర్వోపకరణుఁడును, చంచలచిత్తుఁడును, మలినాంతఃకరణుఁడును, స్వర్గాదిఫలములయం దాసక్తిగల

వాఁడును; సగుణపురుషుఁడు కర్మములాచరించుట కధికారియగుచుండును:
అతనికిఁ గర్మములచేతనే కృత్యము నెఱవేఱుచుండును. మొదటివానికిఁ
గేవలమును నీశ్వరానుచింతన చేతనే కృత్యము నెఱవేఱుచుండును. కా
వున వారిద్దఱకును భేద మున్నది. కాఁబట్టి యజ్ఞాదికర్మములకు సర్వవిధ
ములచేతను, ఉచ్ఛేదము ప్రసక్తింపదు. ఆలోచించి చూడఁగా నేకర్మ
ములచేతను వానికృత్యము నెఱవేఱునో యది యీశ్వరారాధనముచేతను
దప్పక సిద్ధించును. కాని యతఁడు స్థూలబుద్ధి యగుటంజేసి కర్మముల
యందే ప్రవర్తించును గాని యీశ్వరారాధనమునందుఁ బ్రవర్తింపఁ
బోఁడు. కావున వానినిగూర్చి కర్మములకుఁ బ్రయోజనము గలదు.

అవ. "సరియేకాని "శ్రు. అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామ
రూపేవ్యాకరవాణి, తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్" అనఁగా "నేనీ
జీవరూపముగాఁ బ్రవేశించి, నామరూపాత్మకమగు ప్రపంచమును గల్పిం
తును" అని పరమేశ్వరుఁడు సంకల్పించెను. ఆపరమేశ్వరుఁ డీదేహాదిక
మగుప్రపంచమును నిర్మించి తానే యిందుఁ బ్రవేశించుచున్నాఁడు. ఇ
త్యాదివేదవాక్యములయందును, "శ్లో. మమైవాంశో జీవలోకే జీవభూతః
సనాతనః" అనఁగా నోయర్జునా! సనాతనమైన నాయంశమే
యీజగత్తునందు జీవరూప మగుచున్నది. "శ్లో. ఈశ్వరో జీవకలయా
ప్రవిష్టో భగవా నిహ" అనఁగా నీశ్వరుఁడే జీవరూపముగా నీశరీరమునం
దుఁ బ్రవేశించుచున్నాఁడు. ఇత్యాదిస్మృతివాక్యములయందును జీవే
శ్వరుల కేకరూపత్వము వినవచ్చుచుండఁగా నీకనెట్లు పూర్వోక్తక్ర
మమున నీశ్వరారాధనము, నందుల కుపయోగించుజపాదికమును జీవుని
గుఱించి నిర్దేశింపఁబడుచున్నది?" అని శంకింపఁగా సమాధానము
చెప్పుచున్నాఁడు:—

సూ. తదధీనత్వ మభేదేఽపి జీవస్యావిమోక్షాత్. ౧౪

భా. ఆలోచించిచూడఁగాఁ బరమేశ్వరున కంశభూతుఁ డగుటవ
లన స్వరూపమునుబట్టి జీవున కీశ్వరునితోఁగూడ భేదము లేకున్నప్పటి
కిని కైవల్యమోక్షము గలుగునందాఁక నాజీవుఁ డీశ్వరున కధీనుఁడుగనే
యుండును. ఈజీవుఁ డెందాఁక నంతఃకరణాద్యుపాధులతోఁ గూడి యుం

ముడాఁడగునో యందాఁక నీజీవున కీశ్వరాధీనత్వము పోదు. కైవల్యమోక్షము గలిగినపిమ్మట నుపాధి లేకుండుటవలనఁ బారతంత్ర్యమునుండి విముక్తుఁ డగును. ఈవిషయమై "శ్రు. స స్వరాడ్ భవతి" అనఁగాఁ గైవల్యదశయం దాజీవుఁడు స్వతంత్రుఁ డగుచున్నాఁడు. అనుసామవేదీయచ్ఛాందోగ్యోపనిషద్వాక్యము ప్రమాణ మున్నది.

అవ. "సరియే జీవేశ్వరులకు స్వరూపమునుబట్టి సామ్య ముండఁగా నొక్కజీవునికిమాత్రమే పారతంత్ర్య మెట్లు ప్రాప్తించినది ?" అని శంకరాఁగా సమాధానము చెప్పుచున్నాఁడు :—

సూ. గుణరాగా త్తద్యోగో న స్వభావాత్. ౧౫

భా. ఈజీవునకుఁ దటస్థించినపారతంత్ర్యము స్వాభావిక మైనది గాదు. ఇఁక నేమన ? సత్త్వరజస్తమోగుణములపరిణామభూతము లగు దేహేంద్రియాంతఃకరణములయందును, బాహ్యవిషయములయందును జీవాత్మకు సుఖసాధన మగుటంబట్టి యభిరుచ్యాత్మకమగునేరాగము గలుగుచున్నదో దానిచేతనే యాజీవునకుఁ బారతంత్ర్యసంబంధము గలుగుచున్నది. ఈవిషయమై :—"శ్లో. కారణం గుణసంగోఽస్య సదసద్యోని జన్మసు" అనఁగా నోయర్జునా ! ఈజీవునకు సత్త్వరజస్తమోగుణములయందలిసంగ మనఁగా రాగమే యుచ్చనీచజన్మములకుఁ గారణ మగుచున్నది యనుభగవద్గీతావాక్యమును, "సూ. గుణయోగా ద్బద్ధః శుకవత్" అనఁగా నీజీవుఁడు చిలుకవలెనే గుణసంబంధమును బట్టి బద్ధుఁ డగుచున్నాఁడు. అనుసాంఖ్యసూత్రమును బ్రమాణము.

అవ. పారతంత్ర్యమును గలిగించునదియుఁ, గైవల్యమునకుఁ బ్రతిబంధకమును నగునీరాగ మేయుపాయముచేతను నివర్తించు నని యడుగఁగాఁ జెప్పుచున్నాఁడు :—

సూ. పరావబోధా త్తన్నివృత్తౌ కైవల్యమ్. ౧౬

భా. పరమాత్మునియొక్క యథార్థమైనస్వరూపము తెలియుటవలనను; ప్రపంచమిథ్యాత్వబోధచేతను నెప్పు డారాగము నివర్తించునో, యప్పు డీజీవునకుఁ గైవల్యము తటస్థించును. ఈవిషయమై "సూ. వీతరాగజన్మాదర్శనాత్" అనఁగా నేజీవునకు రాగము నివర్తించునో

య్యతనికి మరల జన్మము గనుపడదు. అనున్యాయసూత్రమును,

"శ్లో. ఇంద్రియాణీంద్రియార్థా శ్చ నోపసర్పన్త్యతర్షులమ్,
హీన శ్చ కరణై ర్దేహీ న దేహం పున రర్హతి"

అనఁగా—జ్ఞానముయొక్క ప్రభావమువలన నేకాలమం దీజీవునకు విషయాభిలాష నివర్తించునో యపుడు మరల శ్రోత్రాదులగు నింద్రియములు, శబ్దాదికములగు వానివిషయములును, జీవునియొద్దకు రాఁజాలవు. కాఁగా జీవుఁ డింద్రియములతోఁ రహితుఁడయి మరల జన్మమును బొందక యుండును. అను భారతమోక్షధర్మపర్వములోని వాక్యమును బ్రమాణము.

అవ. "ఆయీశ్వరావబోధ మేయుపాయమునఁ గలుగును?" అని తెలియఁగోరఁగాఁ దదుపలబ్ధిప్రకారమును గ్రమముగా వర్ణించుచు న్నాఁడు:—

సూ. విరహీవానువర్త్యాణామ్. ౧౭

భా. పరమేశ్వరస్వరూపావబోధనమునకుఁ బ్రథమావస్థయందుఁ బురుషునిమనస్సునఁ బూర్వజన్మసంస్కారమువలనఁ గలిగిన ప్రేమాతిశయముయొక్క ప్రాబల్యమువలన ముందుఁ జెప్పఁబోవు వితర్కములు ప్రతిక్షణమును గలుగుచుండును. ఎట్లనఁగా, "నాకు భగవంతునిదర్శనమెప్పుడగును?, జగదీశ్వరుఁడు నావిషయమై యెట్లు ప్రసన్నుఁ డగును?, జననమరణములుగల యీసంసారమువలనిభయమునుండి నే నెట్లు తప్పించుకొందును?" అని యీరీతిగా నడుచుచున్నప్పుడుఁ, గూర్చుండినప్పుడును క్షణక్షణమును జిత్తములోఁ జింతించుచుండును. "విరహీవ" అనుదృష్టాంత మెందుల కనఁగా—ఏరీతిగా వియోగాతురుఁడు తనప్రియురాలిని నిరంతరమును మనస్సులోఁ భావించుచుండునో యట్లే వీనికిని బరమేశ్వరభావన గలుగుచుండు నని తెలుపుటకు.

అవ. "తరువాత నేమి యగు" ననఁ జెప్పుచున్నాఁడు:—

సూ. తద్వశః శ్రవణకీర్తనోత్సుక్యమ్. ౧౮

భా. పరమప్రేమాస్పద మగునాశ్రీమన్నారాయణునకు సకల పాపములను బోఁగొట్టునదియు, శ్రుతిస్మృతిఇతిహాసాదులయందుఁ బ్రసిద్ధ

కెక్కినదియు నగునేకీర్తిగలదో దానిని, వినుటయం దభిరుచి వీనికిఁ గలు
గును. సాధుజనులముఖములనుండి విని తానును నతనికీర్తిని సదా
కీర్తించుచుండును. ఎచ్చటనెచ్చటను బరమేశ్వరసంబంధమయిన చర్చ
జరుగుచుండునో యచ్చటచ్చటకు వినుటకై ప్రయత్నపూర్వకముగాఁ
బోవుచుండును. తా నాచర్చాదికమును శ్రద్ధగా విని భగవంతునియం
దనురాగముగల యితరులకు వినిపించుచుండు నని యర్థము.

అవ. పైని జెప్పినచొప్పున భగవంతుని ప్రభావాదికమును విన్న
తరువాతను గలుగుదానిని జెప్పుచున్నాఁడు :—

సూ. తద్గత్యుపాయాన్వేషణమ్. ౧౯

భా. ఆపరమేశ్వరునియొక్క యేగతి యనఁగాఁ బ్రాప్తి గలదో,
అనఁగాఁ బరమేశ్వరునిస్వరూపముయొక్క యథార్థజ్ఞానము గలదో తదు
పాయముల వెదక మొదలిడును. అనఁగా "నాభగవంతునిస్వరూపము
చతుర్భుజాద్యాకారమే యగునా? లేక దానికంటె విలక్షణముగా నుండె
డినా? నేను దాని నెట్లు తెలిసికోఁజాలుదును? దానిని దెలిసికొనుటకై
నే నేమేమి యాచరింపవలయును?" అని యిట్లు ప్రతిక్షణమును నిటునిటు
నన్వేషణ మొనరించుచుండు నని తాత్పర్యము.

అవ. "ఈరీతిగాఁ బరమేశ్వరునిస్వరూపమును దెలిసికొనుట కభి
రుచిగలిగినయతఁ డేమి చేయవలయును?" అనఁగా నాచార్యుఁడు స్వయ
ముగానే యుపాయమును జూపుచున్నాఁడు :—

సూ. తజ్జనానుగమనాభ్యర్చనానుకరణాని. ౨౦

భా. ఆపరమేశ్వరునిజనులనఁగాఁ బరమేశ్వరునిస్వరూపమును దెలిసి
కొన్నవారును, సకలశ్రుతిస్మృతిరహస్యముల నెఱిఁగినవారును, పక్షపాత
మును వదలుకొన్నవారును, యథార్థమును జెప్పువారును, మహాత్ము
లును నగుభాగవతులు. వా రెచ్చట నుందురో యచ్చటికిఁ బ్రతిదినమును
బోవుచుండవలయును. అనఁగా "మీమహాత్ములయుపదేశమువలన నాకుఁ
బరమాత్మునిస్వరూపమును దెలియఁజాలినజ్ఞానము తప్పక కలుగును."
అను శ్రద్ధ గలిగి వారిసమాగమము చేయఁదగినది యనుట. సమాగమా
నంతరము తనయంతఃకరణశుద్ధికొఱకును, వారిదయను సంపాదించుకొను

టకును దనజాత్యాద్యభిమానమును విడుచుకొని తత్త్వవిదులగువారియ ర్చన చేయవలయును. అనఁగా గంధపుష్పాదులగునుపచారములచేతను, వస్త్రాన్నపానాదులగుపదార్థములచేతను దనశక్త్యనుసారముగాఁ బ్రతిదిన మును వారిని సేవించుచుండవలయు నని యర్థము. ఇట్లు సేవచేయుచుం డుటచేతను సంప్రీతచిత్తులై ప్రసాదాభిముఖులై యామహాత్ము లేయేరీ తిగా నాచరణము నుపదేశింతురో, యేయేమార్గమును జూపింతురో యాయారీతిగా దాని ననుకరించుటయం దాసక్తి గలవాఁడై యుండవ లయును. తద్వాక్యానుసారముగాఁ బ్రవర్తించుచుండవలయునని యర్థ ము. కొంచెమేనియు స్వకల్పనచేతను వారు చెప్పినదానికి విరుద్ధముగా నాచరింపఁ గూడదు. మఱియు :—

సూ. ప్రశ్నావధారణపరత్వం చ. ౨౧

భా. సూత్రములోనిచకారము పూర్వసూత్రాన్వయముకొఱకు, పైని జెప్పినచొప్పున నభ్యర్చనాదులచే నామహాత్ములకు సంతుష్టిని గలిగించి తరువాత నవకాశము గలిగినప్పుడు వారిసన్నిధియం దధ్యాత్మ విషయికమగు ప్రశ్నలడుగవలయును. అనఁగా నెచ్చట నెచ్చట మనసులో శంకగలుగునో దాని నంతను బాగుగా నడుగవలయుననుట. వారు చెప్పినదానిని విని యవధారణ చేసికోవలయును. అనఁగా లెస్సగా మనస్సున నిశ్చయము చేసికోవలయు నని యర్థము. పైని జెప్పినచొప్పు ననే ప్రయత్నించినవాఁడును, శ్రద్ధావంతుఁడును, సమాహితచిత్తుఁడును, శమదమాదిగుణసంపన్నుఁడును, నగువానికిఁ బరమేశ్వరస్వరూపజ్ఞానము యథార్థముగాఁ గలిగియేతీరును. ఆయీసంగతి యంతయు శ్రీకృష్ణభగ వానులవారు భగవద్గీతలో నుపదేశించియేయున్నారు. అదెట్లనఁగా :—

"శ్లో. తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః,
శ్రద్ధావా౯ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధిగచ్ఛతి."

అనఁగా—ఓయర్జునా! నీ వాజ్ఞానమును మహాత్ముల వలన నమ్రతచేతను, ప్రశ్నచేతను, సేవచేతను దెలిసికొనుము. సేవచేఁ

ప్రసన్నులయి యాతత్త్వదర్శులగు జ్ఞానులు నీకు జ్ఞానోపదేశము చేయుదురు. ఎందుచేత ననఁగా శ్రద్ధావంతుఁడును, ఆసక్తిగలవాఁడును, ఇంద్రియనిగ్రహముగలవాఁడును నగుపురుషుఁడే జ్ఞానమును బొందుట కధికారియగుచున్నాఁడు. జ్ఞానప్రాప్తి గలిగినతోడనే యుత్తమమయిన శాంతి గలుచున్నది.

అవ. ఈరీతిగాఁ బరమేశ్వరస్వరూపజ్ఞానప్రాప్తి కుపాయమైన సత్సంగమును నిరూపించి యిపు డందును విశేషవిమర్శమును జూపించుచున్నాఁడు :—

సూ. నలింగమాత్రధారిషు తద్బుద్ధి రపార్థత్వాత్. ౨౨

భా. శంఖము, చక్రము, మాలలు, తిలకము, దండము, భస్మము, మొదలగు పైచిన్నెలచేతనే సాధువు లని తలంపరాదు. ఆయాయాచిహ్నములను ధరించినంతమాత్రముననే శ్రేయోవాప్తిసంభవింపదుగదా ! ఈవిషయమై "నలింగం ధర్మకారణమ్" అనఁగాఁ బైచిహ్నములను ధరించుటయే ధర్మమునకుఁ గారణము గాదని మనువు చెప్పియున్నాఁడు. "వైష్ణవాదిసంప్రదాయములయందే లేక బ్రాహ్మణాద్యుత్తమజాతులయందే విష్ణుభక్తులు జన్మించియుందురు." అను నియమముకూడ లేదు. పూర్వజన్మార్జితమైన పుణ్యకర్మములవాసనావశమునుబట్టి వా రంతటను బుట్టుచుందు రని ప్రసిద్ధి గలదు. ఈసంగతి శ్రుతిస్మృతీతిహాసపురాణాదులయందు స్పష్టముగాఁ జెప్పఁబడియే యున్నది. శుకుఁడు, జనకుఁడు, తులాధారుఁడు, వ్యాధుఁడు, సులభ, విభీషణుఁడు, హనుమంతుఁడు, భుశుండుఁడు మొదలగుభగవద్భక్తులకు జాతితారతమ్యము గలదు. కాఁబట్టి యేకులమునందుఁ బుట్టినను, ఏసంప్రదాయము నవలంబించినను బరమేశ్వరునిస్వరూపమును దెలిసికొన్నవారును, విద్వాంసులును, సదాచారపరాయణులును నగువారికే పూర్వోక్తప్రకారముగా ననుగమనము, అభ్యర్చనము మొదలగునవి చేయవలయును గాని భగవంతునియందు భక్తిలేనివారికిని, పరమేశ్వరునిస్వరూపమును దెలియనివారికిని, కేవలము లోకులను మోసపుచ్చుటకే పైచిహ్నములను ధరించువారికిని బూజాదులు చేయరాదు. ఏమనఁగా, వారిసాంగత్యమువలనఁ గొంచె

మేనియుఁ బ్రయోజనము కనుపడదు. అనఁగా వారిసావాసమువలన నేవి ధమయిన పరమార్థలాభమును గలుగ దని తాత్పర్యము.

అవ. సత్పురుషులసావాస మెట్లు ప్రయత్నపూర్వకముగాఁ జేయఁదగినదియో యట్లే తద్విపరీతులసహవాసముగూడఁ బ్రయత్నపూర్వకముగా విడువఁదగినది యని తెలుపుచున్నాఁడు :—

సూ. తద్భంగిభీతి శ్చ. ౨౩

భా. మఱియు నెవ రాపరమేశ్వరునిస్వరూపమును దెలిసికొను విషయమున భంగమును (అనఁగా విక్షేపమును) జేయుచుందురో, ఎవరు భగవద్భక్తివిముఖులో, ఎవరు నాస్తికులును, స్వార్థపరాయణులును నగుచుందురో వారికి భయపడుచునే యుండవలయును. అనఁగా "వీరి సావాసమువలన నాకు బుద్ధివిభ్రమ మగును. ఈలోకము పరలోకము గూడ నాకు భ్రష్టమగును." అని నిశ్చయించుకొని క్షణమాత్రమయినను వారిసావాసము చేయఁగూడ దని యర్థము. ఈవిషయమై :—

"శ్లో. సంగం న కుర్యా దసతాం శిశ్నోదరతృపాం క్వచిత్,
తస్యానుగ స్తమస్యంధే పతత్యంధానుగాంధవత్."

అనఁగా—మోక్షేచ్ఛగలవారు తమతమ పొట్టపోషించుకొనుచుఁ దృప్తినొందు దుర్మార్గులసావాస మెప్పుడును జేయఁగూడదు. ఎందుచేత ననఁగా ; వారి ననుసరించువారును గ్రుడ్డివారివెంబడిని బోవు గ్రుడ్డివారివలె నజ్ఞానరూప మయినయంధకూపములోఁబడిపోవుచుందురు. అని. భాగవతములోఁ జెప్పఁబడినభగవంతునివాక్యము ప్రమాణము. "నేను దృఢచిత్తుఁడను.వీరు నన్నేమి సేయఁగలరు ?" అని వారియందు నమ్మిక యుంచుకోఁదగదు. ఎందుచేత ననఁగా ; కుసంగమాహాత్మ్యము మిక్కిలిచెడ్డదిగదా ! ఈవిషయమున :—

"శ్లో. నిస్సంగతా ముక్తిపదం యతీనాం
సంగా దశేషాః ప్రభవన్తి దోషాః,
ఆరూఢయోగోఽపి నిపాత్యతేఽధ
స్సంగేన యోగీ కిముతాల్పసిద్ధిః"

అనఁగా—యతులకు సంగము లేకుండుటయే మోక్షపద

ప్రాప్తికిఁ గారణము. సంగమువలన సమస్తమైనదోషములును గలుగు చుండును. ఎందుచేత ననఁగా; కుసంగమువలన యోగారూఢుఁ డయ్యి నయోగికూడ నధఃపాతమును బొందుచుండును. ఇఁక నల్పసిద్ధిగలయు తనివిషయమై వేఱుగాఁ జెప్పవలయునా? అనుపూర్వాచార్యులవచనము ప్రమాణ మున్నది.

అవ. ఈరీతిగాఁ బ్రసంగవశమునఁ గుసంగనిషేధమును జెప్పి యి ప్పుడు పరమేశ్వరస్వరూపావబోధనానంతరము చేయవలసిన కృత్యవిశేష మును జూపించుచున్నాఁడు :—

సూ. పరస్పరం పరికలనమ్. ౨౮.

భా. పూర్వమందుఁ జెప్పఁబడినసత్పురుషానుగమనాదులచేతను తత్త్వవిజ్ఞానమును దెలిసికొన్నయతఁడు దానిని పుష్టినొందించుకొను టకై తత్త్వవిదులతోఁ గూడి పరస్పరమును బరికలనముకొఱకా మ్మాటిమాటికిని వివేచన చేయవలయును. అనఁగా; గురుముఖము నుండి యేదేది వినఁబడినది యగునో దాని నితరులగు తత్త్వవేత్త లతోఁ గూడి మాటిమాటికిని బ్రశ్నోత్తరములమూలమున విచారించు కొని యథార్థముగా మననము చేయుచుండవలయు నని యర్థము.

అవ. ఇట్లు పరస్పరమును విచారమును జెప్పి యిప్పుడు దృఢ నిశ్చయముకొఱకుఁ గృత్యాంతరమును దెలుపుచున్నాఁడు :—

సూ. మహాన్నివేదనం చ. ౨౯.

భా. సూత్రములోనిచకారము పూర్వసూత్రాన్వయార్థము. తా నుగా విచారించినపిమ్మటను దనహృదయమును బొందినజ్ఞానము సరి యైనదియా కాదా? పూర్ణమైనదా కాదా? అని పరీక్షించుటకై మహాన్నివేదన సేయవలయును. అనఁగా; నా కంతయుఁ దెలియనే తెలిసినది. ఇఁక నిపుడు వ్యర్థముగా జిజ్ఞాసయేల చేయవలయును? అను నభిమానమును విడిచి తనకంటె నెవరు జ్ఞానవృద్ధులు, సదాచారనిష్ఠులు, శ్రుతిస్మృతిరహస్యముల నెఱిఁగినవారు, పక్షపాతము లేనివారు, అగు మహాత్ములు గలరో వారియెదుటను దనబుద్ధికి గోచరమయిన పరమేశ్వ రస్వరూపవిజ్ఞాన మంతయు నివేదన చేయవలయు నని యర్థము. కేవల

మఱియు తనబుద్ధియొక్కతర్కముచేతనే జ్ఞానము లెస్సగాఁ గలిగిన దని తలఁపరాదు. ఏమన ; ఈవిషయమై ; "శ్రు. నైషా తర్కేణ మతి రాపనేయా ప్రోక్తాన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠా" అనఁగా ; ఓనాచికేతా ! యీబ్రహ్మవిద్యారూప మయినమతి కేవలమును దనబుద్ధియొక్కతర్కమువలనఁ బ్రాప్తింపఁజాలదు. మఱియేమనఁగా ; ఇతరులగు తత్త్వవేత్తలయుపదేశమువలననే యది జ్ఞానప్రాప్తికి హేతువగును. అనుయజుర్వేదీయకఠోపనిషద్వాక్యము ప్రమాణమున్నది.

అవ. మహాపురుషులయెదుటఁ దనజ్ఞానము నెందులకు నివేదింపవలయునో దానికిఁ గారణమును జెప్పుచున్నాఁడు :—

సూ. నాపూర్ణే తుష్టి రభీష్టాలాభాత్. ౨౬

భా. ఎంతవఱకు జ్ఞానము పూర్ణము గాదో, అంతవఱకును సంతుష్టిని బొందఁగూడదు. ఎందుచేత ననఁగా ; తనయభీష్టము లభింపదు (అనఁగా మోక్షపదము ప్రాప్తించదు) గనుక నని యర్థము. జ్ఞానము పూర్తిగాకుండ నెన్నటికిని మోక్షము గలుగదు గదా ! కావున శాస్త్రమువలనను, ఆచార్యునివలనను, తనయనుభవమువలనను లెస్సగా సంపూర్ణమును, సంశయవిపర్యయరహితమును, అగు తత్త్వజ్ఞానమును సంపాదించుకోవలయును. అట్టిజ్ఞానమువలన సంసారబంధనమునుండి విముక్తిగలుగును. ఆ యీపూర్ణ మయిన తత్త్వజ్ఞానము పరమేశ్వరారాధనవలననే కలుగును గాని కేవలమును శాస్త్రశ్రవణము మొదలుగాఁగల బాహ్యోపాయములచే నెన్నటికిని గలుగదు. ఈవిషయమై :—

"శ్లో. భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్."

అనఁగా—ఓయర్జునా ! నే నెవరో, యెంతటివాఁడనో అనుసంగతి యథార్థముగా నాయందుఁగల భక్తిచేతనే నన్నుఁ జెలిసికొనుచున్నాఁడు. నాయథార్థ్యమును దెలిసికొనినపిమ్మట నతఁడు నాలోఁ బ్రవేశించుచున్నాఁడు. అను గీతావాక్యము ప్రమాణము.

అవ. "పైని జెప్పిన చొప్పున జ్ఞానము పూర్ణ మయినప్పటికిని పూర్ణ మయినదా లేదా యని సంశయము కలుగుటవలన ననవస్థయే

కలుగునే" యని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు :—

సూ. కాష్ఠాశ్రవణా న్నానవస్థాప్రసంగః. ౨౭

భా. "శ్రు. ఆత్మానం చే ద్విజానీయా దయమస్మీతి పూరుషః,
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్.
యస్మిన్ సర్వాణి భూతా న్యాత్మైవాభూ ద్విజానతః,
తత్ర కో మోహః క శ్శోక ఏకత్వ మనుపశ్యతః."

అనఁగా ; ఏకాలమం దీపురుషుఁడు "ఈవస్తువు నాస్వరూపము" అని యపరోక్షజ్ఞానము గలవాఁ డగునో అటుపయిని దేనిని గోరుచు నేకామముకొఱకుఁగాఁ దనశరీరమును బరిశ్రమపాలుచేయును? (అనఁగాఁ జేయఁడనుట.) మఱియు, నేకాలమందు జ్ఞాని యగుపురుషునకు సర్వభూతములును ఆత్మస్వరూపముగానే తోఁచుచుండునో అటుపయి నట్టియేకత్వమును జూచువానికి మోహ మనఁగా నేమి? శోక మనఁగా నేమి? ఇత్యాది వేదవాక్యములయందును,

"శ్లో. య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ,
సర్వథా వర్తమానోఽపి న స భూయో ఽభిజాయతే."

అనఁగా—జ్ఞానియగు నేపురుషుఁ డీరీతిగా నాత్మ నసంగమయినదానినిగాను, ప్రకృతిని గుణములతోఁ గూడియున్నదానినిగాను దెలిసికొనుచున్నాఁడో, అతఁడు సర్వప్రకారములచేతను బ్రవర్తించుచున్నవాఁ డైనప్పటికిని మరల జన్మమును బొందఁడు. (అనఁగా ముక్తుఁ డగుననుట.) ఇత్యాదిస్మృతివాక్యములయందును దత్త్వజ్ఞానమునకుఁ బరమావధి వినవచ్చుచున్నది. మఱియు,

"శ్రు. వేదాహ మేతం పురుషం మహాన్త మాదిత్య వర్ణం తమసః పరస్తాత్,
విదామ దేవం భువనేశ మీడ్యమ్"

అనఁగా—ఆదిత్యునివలెనే ప్రకాశమానుఁడును, అజ్ఞానరూపముకంటెఁ బయిగా నుండువాఁడును నగు నేమహాపురుషుఁడు గలఁడో అతనిని నేను దెలిసికొనుచున్నాను. మఱియు సర్వభువనములకును నీశ్వరుఁడును, బూజనీయుఁడును స్వయంప్రకాశమానుఁడును నగు పరమాత్మని మేము దెలిసికొంటిమి. ఇత్యాదిశ్రుతివచనములు జ్ఞానుల కప

రోక్షానుభవమును జూపించుచున్నవి. కాఁబట్టి పరమేశ్వరునిస్వరూప ముయొక్క జ్ఞానము పూర్ణమయినపిమ్మట సంశయముగాని యనవస్థా దోషప్రసంగముగాని యుండదు.

అవ. ఈప్రకారముగాఁ బూర్ణజ్ఞానము కలిగినపిమ్మట నేదేని యుఁ జేయఁదగినది యున్నదా లేదా ? యని జిజ్ఞాస గలుగఁగా సమా ధానము చెప్పుచున్నాఁడు :—

సూ. శశ్వదావర్తనం వాసనాప్రాబల్యాత్. ౧౮

భా. పూర్వోక్తప్రకారముగా సత్సంగమువలనను, సచ్ఛాస్త్రశ్ర వణమువలనను గలిగినతత్త్వజ్ఞానము నేకాంతముగాఁ గూర్చుండి మా టిమాటికిని మననము చేయుచుండవలయును. ఎందుచేత ననఁగా ; జన్మ జన్మాంతరములనుండి యభ్యసింపఁబడిన వాసన ప్రబలమయినదిగదా! అనఁగా దేహగేహాదులయందలియహంమమతాదిరూపమైన సంసారవా సన మిగుల బలవంతమయి యుండు నని తాత్పర్యము. అట్టివాసన కేవలమును జ్ఞానశ్రవణమాత్రముచే క్షయమును బొందునది గాదు. కనుక దానిని శాంతిని బొందించుకొనుటకు విధిగాఁ జిత్తవృత్తినిరోధాత్మ కమయిన యభ్యాసము తత్త్వవిదులచే నాదరింపఁదగినది. ఈసంగతి ;

"సూ. న శ్రవణమాత్రాత్ తత్సిద్ధి రనాదివాసనాయా బలవత్త్వాత్."

అనఁగా—కేవలమును శాస్త్రములను విన్నంతమాత్రమున మోక్షము సిద్ధింపదు. సంసారసంబంధమయిన యనాదివాసన మిక్కిలి ప్రబలమయినది. అని సాంఖ్యదర్శనమునఁ గపిలాచార్యులవారును,

. "సూ. ఆవృత్తి రసకృదుపదేశాత్."

అనఁగా—జ్ఞానముయొక్క యుపదేశమును విని తరువాతను దానిని మాటిమాటికిని ఆవృత్తిచేయుచుండవలయును. (ఎందుచేతన నఁగా సామవేదములోని ఛాందోగ్యోపనిషత్తులో శ్వేతకేతునిగూర్చి యుద్దాలకుఁ డనుముని యాత్మతత్త్వమును మాటిమాటికిని ఉపదేశిం చియున్నాఁడు.) అని బ్రహ్మమీమాంసలో వ్యాసభగవానులవారును జెప్పియున్నారు. మఱియు,

సూ. దృఢత్వాపేక్షణా చ్చ. ౨౯

భా. దృఢత్వము నపేక్షించి యుండుటనుబట్టికూడఁ దత్త్వజ్ఞానమును మాటిమాటికి నావర్తించుచుండవలయును. కైవల్యమోక్షమంతముగాఁగల జ్ఞానమునకు దృఢత్వ మపేక్షింపఁబడుచున్నది. శిథిలమగు నాత్మజ్ఞానముచే మోక్ష మెప్పటికిని గాఁజాలదు. ఈసంగతి ;

"సూ. వివేకఖ్యాతి రవిప్లవాహానోపాయః."

అనఁగా—జన్మమరణరూపమయిన సంసారబంధనముయొక్క నివృత్తికి దృఢమయిన జ్ఞానమే తప్ప వేఱేదియు నుపాయము లేదు. అని పతంజలిభగవానులవారు తమయోగశాస్త్రములో సూత్రించియున్నారు. వేదాంతశ్రవణాదులచేఁ దత్త్వజ్ఞానము గలిగినప్పటికిని సంసారవాసనచేఁ బ్రతిబంధింపఁబడినదై కర్మబంధనము నున్మూలించు విషయమై సమర్థమయినది గాఁజాలదు. ఈవిషయమై :—

"శ్లో. మణిమంత్రౌషధై ర్వహ్నిః ప్రదీప్తోఽపి యథేంధనమ్,
ప్రదగ్ధుం నైవ శక్త స్స్యా త్ప్రతిబద్ధ స్తథైవహి.
జ్ఞానాగ్ని రపి సంజాత స్సుదీప్త స్సుదృఢోఽపిచ,
ప్రదగ్ధుం నైవ శక్త స్స్యా త్ప్రతిబద్ధ స్తు కల్మషమ్."

అనఁగా — ఎట్లు ప్రజ్వలింపఁబడియు నగ్ని మణిమంత్రౌషధములచేఁ బ్రతిబద్ధమై యింధనములఁ గాల్చుటకు సమర్థము గాదో యట్లే జ్ఞానరూపమయిన యగ్ని ప్రకటమయియు సాంసారికవాసనచేఁ బ్రతిబంధింపఁబడి పాపకర్మములను దహించువిషయమున సమర్థమైనది కాదు. అనుపరాశరమునివాక్యము ప్రమాణము.

అవ. "అటులేని యాయాదృఢమైనజ్ఞాన మందఱకును నేందులకుఁ గలుగదు ? సత్సమాగమాదులను జేయుచున్న వారయియు ననేకులు జ్ఞాననిష్ఠావర్జితులై కనుపడుచున్నారే" అని శంకింపగా సమాధానము చెప్పుచున్నాఁడు :—

సూ. సుకృతవైశేష్యా దత్రైవ. ౩౦

భా. తత్త్వజ్ఞానశ్రవణకాలముకంటెఁ బూర్వము వర్తమానశరీరమునందుఁగాని పూర్వజన్మములయందుఁగాని యెవనికి విశేషముగాఁ బు

ణ్యసంచయము గలదో వారియంతఃకరణము శుద్ధమయిన దగుటవలన నీజన్మమునందే సత్సమాగమము, సచ్ఛాస్త్రశ్రవణము మొదలగునుపాయములచే జ్ఞానలాభముగలుగుచున్నది. ఈవిషయమై :—

“శ్లో. యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్,
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః.”

అనఁగా—ఓయర్జునా! పుణ్యకర్మములు చేసిన యేజనుల పాపము నంతమును బొందియుండునో అట్టిదృఢవ్రతులు రాగద్వేషాది ద్వంద్వరూపమయిన మోహమువలన విడుదలను బొంది నన్నును సేవించుచుందురు. అని యర్జునునిగూర్చి గీతోపనిషత్తులో శ్రీకృష్ణభగవానులవారును,

“శ్లో. జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయా త్పాపస్య కర్మణః.”

అనఁగా—ఏకాలమందుఁ బురుషునకు సర్వపాపములక్షయమును నగునో అటుపిమ్మట జ్ఞానోత్పత్తి యగును. అని భారతమోక్షధర్మపర్వములో వ్యాసభగవానులవారును జెప్పియున్నారు. కావునఁ బరమేశ్వరునిస్వరూపమును దెలిసికొన నిచ్ఛగలవారు ముందుగా సర్వవిధములచేతను బాపకర్మములయందుఁ బ్రవృత్తి విడిచి సంతతమును సుకృతమునే సంపాదించుకొనుటయం దాసక్తులయి యుండవలయును.

అన. “అట్లులేని యెవరికి విశేషముగాఁ బుణ్యసంచయము లేదో వారికి సచ్ఛాస్త్రశ్రవణాదులవిషయమై చేసినపరిశ్రమము నిరర్థకమే యగునే?” అని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు :—

సూ. పునర్భవే ష్వితరేషామ్. ౩౧

భా. విశేషముగాఁ బుణ్యసంచయములేని యితరులకు జన్మాంతరములయందుఁ బూర్ణజ్ఞానము గలుగును. ఈవిషయమై :—

“శ్లో. అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్.”

అనఁగా—అర్జునా! అనేకజన్మములయందుఁ బూర్ణజ్ఞానరూపమైన సిద్ధిని బొందినపురుషుఁడు మోక్షపదమును బొందుచున్నాఁడు. అని భగవంతునిగీతోపనిషద్వాక్యము ప్రమాణము. ఈజన్మమునందుఁ జేసినశాస్త్రశ్రవణాదికము జన్మాంతరమునందు శీఘ్రముగా

జ్ఞానమును గలిగించుట కుపయోగించును గనుక నది నిరర్థక మెన్నటి కిని గాదు. కొంతకాలము మార్గమధ్యమున శయనించుటచేఁ బాంథున కుఁ బూర్వము నడిచిననడక నిరర్థక మెప్పుడైన నగునా? (అనఁగాఁ గాదనుట) ఈవిషయమై:—

"శ్లో. తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్,
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునన్దన!"

అనఁగా—అర్జునా! యోగమునుండి భ్రష్టుఁడగు పురుషుఁ డెపుడు రెండవజన్మము నెత్తునో అప్పు డాజన్మమునందుఁ బూర్వదేహసంబంధమయిన బుద్ధిసంయోగమును బొందును. మరల యోగాభ్యాసవశమునఁ దత్త్వజ్ఞానసిద్ధికై ప్రయత్నించుచుండును. అను భగవద్గీతావాక్యము ప్రమాణముగా నున్నది.

అవ. "మృత్యుకాలమునందలి మూర్ఛయనంతరము పూర్వస్మృతి లోపించునే! తరువాత నేరీతిగా మును చేసిన శ్రవణాదికము జన్మాంతరమునఁ గార్యకారి యగును?" అని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. సంస్కారావస్థితే ర్న లోపః. ౩౧

భా. ఈజన్మమునందుఁ జేయఁబడిన శ్రవణాదికములకు జన్మాంతరమందు లోపము సంభవింపదు. పూర్వసంస్కారములు జాగరూకములై యుండును. ఈజీవుఁ డే శుభకర్మములను గాని యశుభకర్మములను గాని బుద్ధిపూర్వకముగాఁ జేయునో ఆయాకర్మములచేతను వాని కనురూపమయిన సంస్కారము గోడపైని చిత్తరువువలె మనస్సునందు లిఖించినట్లుండును. కావున వర్తమానశరీరమునకు నాశము గలిగినపుడు చిత్తమును బొందియున్న సంస్కారములు కార్యకరములగును.

అవ. "సరియే యిపుడు తాము సెలవిచ్చినదుచ్చానఁ బూర్వజన్మసంస్కారము నిలిచి యుండు నేని యందఱకును బూర్వజన్మమునందుఁ జేయఁబడిన కర్మముల స్మరణ యుండవలయును. మఱియుఁ బూర్వజన్మమునం దధ్యయనముచేసిన శాస్త్రముకూడ స్వభావమువలన నే స్ఫురింపవలయును. అట్లు కనుపించుట లేదే! తమరు సెలవిచ్చిన ట్లు

యుక్తియుక్తముగా నుండును? ” అని శంకింపఁగా సమాధానము చెప్పు
చున్నారు :—

సూ. అభివ్యంజకాధీనత్వాన్న స్వభావాత్. 33

భా. మనస్సునందు నణఁగియున్న సంస్కారములు స్వతఃసిద్ధముగా
బయటికి రావు. అవి యభివ్యంజకాధీనములు. ఎప్పు డేసంస్కారముల
కభివ్యంజకమగు ద్రవ్యము సన్నిధానమును బొందునో అపుడే యా
సంస్కారములే బయటికి వ్యాపించును గాని యితరములు వ్యాపింపవు.
అవియే అపుడు స్వసమానకార్యమందు సహయోగిత్వమును బొందు
చుండును. ఏరీతిగా రాత్రి గృహమందున్నవి యయినను ద్రవ్యములు
దీపము మొదలగు నభివ్యంజకము లేకుండఁ జూడఁబడవో అట్లే యిచ్చ
టను జూడఁదగును. ఇచట వ్యంజకము సాధారణ మనియు నసాధారణ
మనియు రెండువిధములు. అందుఁ బూర్వజన్మమున దృష్టశ్రుతపదార్థము
లసంయోగము మొదటిది. అది విశేషస్మృతిజనకము కాదు. కాని
సామాన్యముగాఁ గర్మము చేయఁబడునపుడు సహయోగి యగుచుం
డును. ఎట్లనఁగా ; పూర్వజన్మమం దధ్యయనము చేయఁబడిన విద్యలు
గలవాని కీజన్మమునందు స్వల్పాయాసముచేతనే శాస్త్రప్రాప్తియు,
పూర్వము పుణ్యముచేసినవాని కీజన్మమునందు ధర్మమునం దభిరుచిగాని
భోగప్రాప్తి గాని గలుగుచుండు నని తెలియవలెను. రెండవది యసాధా
రణము. అది యోగాభ్యాసాదిరూపము. అదియే విశేషస్మృతిజనక
మగును. యోగులకును, తపస్వులకును బూర్వజన్మాదిస్మరణము గలు
గుచునే యున్నదన్న సంగతి శ్రుతిస్మృతీతిహాసములయందుఁ బ్రసిద్ధ
మయియే యున్నది. ఆ సంగతి ;

“సూ. సంస్కారసాక్షాత్కరణా త్పూర్వజాతిజ్ఞానమ్.”

అనఁగా :—ఏకాలమునందు యోగి సమాధిద్వారమునఁ దన
సంస్కారమును సాక్షాత్కరించుకొనునో ఆకాలమం దతనికి వెనుకటిజ
న్మములయందలి సంగతు లన్నియు స్మృతికి విషయము లగును. అని
యోగశాస్త్రములోఁ బతంజలిభగవానులవారు సూత్రించి యున్నారు.

అవ. శుభాశుభాభివ్యంజకముల సంబాధమువిషయమై గ్నోది హేతువో దానిని జూపుచున్నాఁడు :—

సూ. తద్యోగ శ్చాదృష్టవశాత్. ౩౪

భా. ఆశుభాశుభములకు వ్యంజకమయిన యేసంబంధముగలదో యది జీవునిపూర్వజన్మకృతములయిన సుకృతదుష్కృతములనుబట్టి యే కలుగుచుండును. అందుఁ బుణ్యాత్ములును, శుద్ధాంతఃకరణులును నగు పురుషులకుఁ దత్త్వజ్ఞానాభివ్యంజకము లయిన సత్సంగము, సచ్ఛాస్త్రము మొదలగువాని సంయోగము గలుగును. పాపాత్ములును, మలినాంతఃకరణముగలవారును నగుపురుషుల కజ్ఞానాభివ్యంజకము లయిన యసత్సంగము, అసచ్ఛాస్త్రము మొదలగువానిసంబంధము గలుగును.

అవ. "పైని జెప్పినరీతిగా నభివ్యంజకసంబంధ మదృష్టవశమునఁ గలుగుచుండును. సంస్కారోద్ధానము దాని కధీనమయి యుండును. దానియనంతరముజీవునకుఁ బ్రవృత్తి గలుగును. అని యీరీతిగా నదృష్టముచేతను బ్రేరేంపఁబడుచుండెనేని జీవునకుఁ బారతంత్ర్యము ప్రాప్తించియే యున్నది" అని శంకించుకొని జీవునిగూర్చి దేనికిఁ బ్రేరకత్వము గలదు? అని నిర్ణయించుటకై కొందఱుమునులమతములను జూపించుచున్నాఁడు. అందు :—

సూ. కర్మవాసనేతి జైమినిః. ౩౫

భా. "శ్రు. పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన" అనఁగా జీవుఁడు పుణ్యకర్మములచేతను బుణ్యాత్ముఁడై యుత్తమదశను, పాపకర్మములచేతను బాపాత్ముఁడై నీచదశను బొందుచుండును. ఇత్యాదిశ్రుతివాక్యములు ప్రమాణముగా నుండుటనుబట్టి పూర్వజన్మముల యందు సంపాదింపఁబడిన కర్మములయొక్క వాసనయే ప్రేరక మగుచుండు నని జైమిన్యాచార్యులవారు తలంచుచున్నారు. పూర్ణకాముఁడును, అసంగుఁడును నగునీశ్వరునకుఁ బ్రేరకత్వము సంభవింపదు గావునఁ బూర్వజన్మవాసనయే శుభాశుభకర్మములయందు జీవునిఁ బ్రేరేపించుచుండును. ఆవిషయమై :—

"సూ. భావార్థాః కర్మశబ్దా స్తేభ్యః క్రియా ప్రతీ
యే తైష హ్యర్థో ఽభిధీయతే"

అనఁగా — యావన్మాత్రము వేదములోఁ గ్రియాశబ్దము లున్నవో యవి యన్నియుఁ బురుషునిభావనకొఱకే. అనఁగా, నేపురుషుని మనసులో స్వర్గాదిలోకములవాసన గలుగునో వానినే జ్యోతిష్టోమాది యజ్ఞములలోఁ గ్రియాశబ్దము ప్రేరణచేయుచుండును. అందువలనఁ గ్రియయొక్క యారంభము గలుగును. కావున వేదములో యజ్ఞాదికర్మములకు విధానము చెప్పఁబడి యున్నది. అని తమపూర్వమీమాంసా దర్శనములో వారు సూత్రించియున్నారు.

అవ. ఈరీతిగా జైమిన్యాచార్యులవారిమతమును జూపించి యిపుడు పతంజలిమునిమతమును జూపుచున్నాఁడు:—

సూ. ఈశ్వర ఇతి పతంజలిః. ౩౬

భా. "శ్రు. ఏష ఉ హ్యేవ సాధు కర్మ కారయతి" అనఁగా నీయీశ్వరుఁడే జీవులచేతను శుభాశుభకర్మములను జేయించుచున్నాఁడు. ఇత్యాదివేదవాక్యముల ప్రమాణమునుబట్టి యీశ్వరుఁడే శుభాశుభకర్మములవిషయమై జీవునిఁ బ్రేరేపించుచుండును. అని యోగశాస్త్రప్రవర్తకులగు పతంజల్యాచార్యులవారు తలంచుచున్నారు. వాసన చేతన గాదు గనుక దానికిఁ బ్రేరకత్వము సందర్భపడదు. ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడు గనుక నతనికే ప్రేరకత్వము చెప్పుట తగియుండును. ఆవిషయమై:—

"సూ. సమాధిసిద్ధి రీశ్వరప్రణిధానాత్."

అనఁగా, నీశ్వరారాధనవలనను, అతఁడు ప్రసన్నుఁడగుటవలనను సమాధిసిద్ధి గలుగును. అని తమ యోగదర్శనములో వారు సూత్రించియున్నారు.

అవ. పతంజలిమునిమతమును జూపి యిపుడు వ్యాసభగవానులవారిమతమును నిరూపించుచున్నాఁడు:—

సూ. ఉభయ మితి ద్వైపాయనః. ౩౭

భా. "శ్రు. కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః" అనఁగా, నీశ్వ

రుఁడు సర్వకర్మములకు నధిపతియు, సర్వభూతములకును నాశ్రయమును నగుచున్నాఁడు. ఇత్యాదిశ్రుతిప్రామాణ్యమునుబట్టి పూర్వజన్మవాసన, ఈశ్వరుఁడు ప్రేరకులని ద్వైపాయనాచార్యులవారు తలంచుచున్నారు. కేవలవాసన జడము గనుక దానికిఁ బ్రేరకత్వము సంభవింపదు. కేవలేశ్వరుఁడే ప్రేరకుఁ డన్న యెడల నతనికి విషమతాదిదోషము గలుగును. కనుక నుభయమునకును ప్రేరకత్వము యుక్తముగా నున్నది. ఆవిషయమై :—

"సూ. వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వా త్తథాహి దర్శయతి."

అనఁగా, జీవుల కుచ్చనీచఫలముల నిచ్చుచుంటచే నీశ్వరునకు వైషమ్యము, నిర్దయత్వము మొదలగు దోషములు ప్రాప్తింపవు. జీవుఁడు చేసికొన్న కర్మముల ననుసరించియే యీశ్వరుఁ డుచ్చనీచఫలముల నిచ్చుచుండు నని వేదములలో వ్రాయఁబడి యున్నది. అని తమయుత్తరమీమాంసాదర్శనములో వారు సూత్రించియున్నారు.

౭౮. ఈరీతిగా వ్యాసభగవానులవారి మతమును జూపించి యిపుడు శ్రీకృష్ణభగవానులవారి మతమును వర్ణించుచున్నాఁడు:—

సూ. కామ ఇతి వాసుదేవః. ౩౮

భా. "శ్రు. కామమయ ఏవాయం పురుష స్స యథాకామో భవతి తత్క్రతు ర్భవతి, యత్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే." అనఁగా ; నీపురుషుఁడు కేవలమును గామస్వరూపుఁడు. అతఁ డేవిధమయిన కామన గలవాఁడో అందుకుఁ దగిన సంకల్పమునే చేయును. ఎట్లు సంకల్పించునో అట్లే కర్మముల నాచరించును. ఇత్యాదివేదవాక్యముల ప్రామాణ్యమువలనఁ గామమే జీవుని శుభాశుభకర్మములవిషయమై ప్రేరేపించుచున్నది యని శ్రీకృష్ణభగవానులవారు తలంచుచున్నారు. విషయములయందు దోషదృష్టిపూర్వకముగా యోగాభ్యాసము మొదలగు నుపాయములచేతను గామమునకు నిగ్రహము గలుగఁగా బాహ్యప్రవృత్తికి సంకోచ మగుపడుచున్నది గనుకఁ గామమే ప్రేరకము. అని చెప్పుట తగియున్నది. ఆవిషయమై:—

"శ్లో. కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్."

అనఁగా ; ఓయర్జునా ! ఈకామమే పురుషుని దుష్టకర్మముల యందుఁ బ్రవర్తింపఁజేయుచున్నది. అదియే క్రోధరూపముగా మాఱు చున్నది. అది రజోగుణమువలనఁ బుట్టుచుండును. విషయముల ననుభ వించుటవలన దానికిఁ దృప్తి గలుగదు. అది మిక్కిలిని పాపరూపమయి యుండును. కావున నీవు దానిని శత్రువునుగాఁ దెలిసికొనుము. అని భగవద్గీతోపనిషత్తులో వారు స్మరించియున్నారు.

అవ. ఈరీతిగా జీవునిపారతంత్ర్యమువిషయమై వేఱువేఱుమత ములను జూపి యిపుడు వసిష్ఠభగవానులవారిమతమును నిరూపించుచు జీవునకు స్వతంత్రత్వముకూడఁ జూపించుచున్నాఁడు :—

సూ. తజ్జ్ఞమూ త్పౌరుషం వసిష్ఠః ౯౫

భా. "శ్రు. ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరా న్నిబోధత."

అనఁగా, ఓపురుషులారా ! మీరు లెండు. అనఁగాఁ బురుషార్థ మును జేయుఁడు. ప్రమాదరూపమయిన నిదురనుండి మేల్కొనుఁడు. శ్రేష్ఠులగు విద్వాంసులపాలికిఁ బోయి జ్ఞానమును సంపాదించుకొనుఁడు. ఇత్యాదిశ్రుతివచనములనుబట్టి పౌరుషమే జీవుని బ్రేరేపించుచుండును. అని వసిష్ఠభగవానులవారు తలంచుచున్నారు. పూర్వమందుఁ జెప్పఁబ డినకర్మవాసన మొదలగునవి సామాన్యముగాఁ బ్రేరకములయినను నవి ముఖ్యముగాఁ బ్రేరేపించునవి గావు. పౌరుషము కర్మవాసన మొదల గువానిని జయించుచున్నట్లు గనుపడుచున్నది. అది యెట్లందువేని వినుము. పురుషార్థముకొఱకు శుభమార్గమునందుఁ బ్రవర్తించుపురుషు నకుఁ బూర్వము సంపాదితమయిన దుష్టవాసన దుర్బలమయి పోవుచు న్నది. ఈశ్వరుఁడుగూడ యథాశాస్త్రముగఁ బ్రణవముమొదలగువానిని జపముచేయుటయం దాసక్తిగల పురుషునిపయిని తప్పకుండ ననుగ్ర హము చూపుచుండును. ఇట్లే యుభయపక్షములవిషయమై చూచుకొ నునది. కామముకూడ విషయములయందు దోషబుద్ధి గలిగి విరక్తిని గొన్నపురుషునకుఁ దటుచుగాఁ దొలఁగిపోవుచున్నట్టు కనుపట్టుచున్నది.

ఈ ప్రకారముగా నంతటను శాస్త్రీయమయిన పౌరుషమే ప్రబలమైన దగుటవలన నాపూర్వపూర్వపురుషార్థమే యుత్తరోత్తరకర్మమువిషయమై ప్రేరక మగుచుండు ననుట యుక్తము. ఆపురుషార్థమును బ్రయోగించుపని జీవునియధీనమే యగుటవలన నీజీవునకు స్వాతంత్ర్యముగూడ సిద్ధించినది. ఏజీవుఁడు పురుషార్థమును బ్రయోగింపఁడో వానికే ప్రమాదము తటస్థించును. కావునఁ బ్రేరకాంతరము కల్పించుట తగదు. ఆవిషయమై :—

"శ్లో. శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహన్తీ వాసనాసరిత్,
పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి.
న త దస్తి జగత్కోశే శుభకర్మానుపాతినా,
యత్పౌరుషేణ శుద్ధేన న సమాసాద్యతే జనైః."

అనఁగా ; శుభమార్గమునందును, అశుభమార్గమునందును బ్రవహించుచున్న వాసనారూపనదిని పురుషార్థరూపమయిన ప్రయత్నముచేత మంచిమార్గమునందే ప్రవర్తించునట్లు యోజనచేయవలయును. శుభకర్మములయందుఁ బ్రవర్తించుచు శుద్ధమయిన పురుషార్థముచేతను బొందరానివస్తువు బ్రహ్మాండములో లేదు. అను వసిష్ఠభగవానులవారి వాక్యములు ప్రమాణము. కావున సర్వవిధములచేతను సంసారసంబంధములయిన విషయములవంకకుఁ బోక పరమేశ్వరారాధనరూపమయిన పరమపురుషార్థమును విరామములేకుండ శ్రేయస్సును గోరుకొను పురుషులు విధిగా నాశ్రయించి తన్మూలకముగా నీశ్వరునియనుగ్రహమునకుఁ బాత్రులయి పునరావృత్తిరహితమయిన తత్పదమును బొంది యానందించుచుందురుగాత.

ఇట్లు శ్రీబ్రహ్మానందస్వాములవారిచే సంస్కృతమున రచింపఁబడినభాష్యము ననుసరించి పురాణం - సూర్యనారాయణతీర్థులచే నాంధ్రీకరింపఁబడిన యీశ్వరదర్శనభాష్యమునందుఁ దృతీయపాదము సమాప్తమయినది.





శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

---

# ఈశ్వరదర్శనము

## చతుర్థపాదము.

అవ. ఈప్రకారముగాఁ బూర్వమందుఁ జెప్పఁబడిన గ్రంథసందర్భముచేత నీశ్వరారాధనముయొక్క యావశ్యకతను, తల్లక్షణమును నిరూపించి, యనంతరము పరమేశ్వరునిసగుణస్వరూపమును, నిర్గుణస్వరూపమును, తదర్చనాప్రకారమును, సంక్షేపముగాఁ బరమేశ్వరునిస్వభావమును క్రమముగాఁ దత్త్వజ్ఞానప్రాప్తి కుపాయమును వర్ణించి,యిప్పుడు సగుణోపాసనచేసినవారును నిర్గుణోపాసనచేసినవారును నీదేహము విడిచినపిమ్మట నేగతికిఁ బోవుదురో దానిని నిరూపించుటకై చతుర్థపాదమారంభించుచు నందు ముందుగా సగుణోపాసనాఫలమును వర్ణించుచున్నాఁడు. అందు భగవంతుని నుపాసించినయతఁ డొకజన్మముచేతనే విష్ణుపదమునుగూర్చి పోవునా ? చాలజన్మము లెత్తినపిమ్మటను బోవునా ? యని జిజ్ఞాస కలుగఁగా నిర్ణయమును జెప్పుచున్నాఁడు :—

సూ. పరిపాకే గత్యధికారీ. ౧

భా. ఉపాసన పరిపాకావస్థను బొందిననే యీపురుషుఁడు వైకుంఠలోకమునకుఁ బోవుట కధికారి యగును గాని వేఱురీతిగా నెన్నటికిని గాఁబాలఁడు. ఆపరిపాకముగూడఁ గొందఱుపుణ్యాత్ములకు వేగముగాఁ గలుగుచుండును. మఱికొందఱకు (అనఁగా నల్పపుణ్యము చేసినవారికి) జన్మాంతరములయందుఁ గలుగుచుండును. కనుక నావిషయమై యొక జన్మమునందే యనికాని బహుజన్మములయందనికాని నియమము లేదు.ఎప్పుడుపాసన పరిపక్వదశకువచ్చునో యప్పుడే విష్ణుపదమునుగూర్చి

పోఁజాలును గాని పరిపాకదశకు రాకుండ నెప్పటికిని బోఁజాలఁ డని తాత్పర్యము.

అవ. "అటులేని యిప్పటి కుపాసన పరిపక్వదశకు వచ్చిన దను సంగతి యెట్లు దెలియఁగలదు?" అని జిజ్ఞాస కలుగఁగా సమాధానము చెప్పుచున్నాఁడు :—

సూ. స్వాంతశుద్ధ్యుపాస్యగుణావిర్భావాభ్యామ్.

భా. స్వాంత మనఁగా నంతఃకరణము. దానియొక్క శుద్ధిచేతను, ఉపాసింపఁదగిన దేవతయొక్క గుణముల యావిర్భావముచేతను ఉపాసన పరిపాకమును బొందిన దని తెలిసికోఁదగును. అని వాక్యశేషము. ఎప్పుడు పరమేశ్వరు నారాధించుచున్న పురుషుని యంతఃకరణమునకు సర్వవిధములచేతను శుద్ధి గలుగునో (ఒకానొకప్పుడును, ఒకచోటను పాపకర్మములయందుఁ బ్రవర్తింపకుండుటయు, సంసారసంబంధములయిన విషయవాసనలనుండి యుపరమించుటయు నంతఃకరణశుద్ధికి లక్షణము.) ఎప్పుడు భగవంతుఁడును వైకుంఠనాథుఁడును అగు నుపాస్యదేవునియొక్క సత్యసంకల్పము మొదలగుగుణము లుపాసకుని శరీరమందుఁ గూడ నావిర్భవించి కనుపడునో (ఎట్లన; ఒకానొకకార్యమునకొఱకుఁ జేయఁబడినసంకల్పము సత్య మగుచుండును. అన్నమాట తప్పకుండ ఫలవంత మగును. ఇష్టమై కోరఁబడినవస్తువు దొరకుచుండును.) మఱియు నెప్పుడు స్వప్నములయందు మునులయు సిద్ధులయు దర్శనము మొదలగునవి మాటిమాటికిని గలుగుచుండునో అప్పుడే యుపాసన పరిపక్వమును బొందిన దని తెలిసికోఁదగును. భ్రమరము (తుమ్మెద) ననుచింతన చేయుచుండు కీటకము (పురుగు) యొక్క శరీరమునందు భ్రమరగుణముల యావిర్భావము గలిగినట్లుగా నుపాసకునిశరీరమునందుఁగూడ భగవంతునిగుణములసంక్రమము గలుగుచుండును.

అవ. "పైని చెప్పినచొప్పున నుపాసనాపరిపాకము గలిగిననే గతి కధికారి యగునెడల నుపాసనామధ్యనే యపక్వదశలోఁ జచ్చినవాని కేమిగతి యగును?" అని శంకింపఁగా నిర్ణయమును జూపించుచున్నాఁడు :—

సూ. పుణ్యలోకగమన మనేనా నా. 3

భా. స్వర్గము మొదలగు భోగముల వాసనలంతోఁ గూడినవాఁడనియు, తద్రహితుఁడై కేవలమును మోక్షమునే పొందనిచ్ఛ గలవాఁడనియు నుపాసకుఁడు రెండువిధములు. అందు మొదటివాఁడును, భగవదుపాసనచేఁ బాపములన్నియు క్షీణించినవాఁడును నగుపురుషునకు నరకమునకుఁ బోవలసినయవసరము లేదు. ఉపాసన పరిపాకదశకు రాకుండ విష్ణులోకమునకుఁ బోవుటకు వీలుచాలదు. కావునఁ బరిశేష న్యాయమునఁ బుణ్యలోకములకుఁ బోవుట సంభవించును. యజ్ఞములు మొదలయిన పుణ్యకర్మములను జేసినవారి కేస్వర్గాదిలోకములును, లోకపాలురపురములును, మేరుపర్వతప్రాంతములయందలి యుపవనకుంజములు మొదలగు విహారస్థానములును గలవో యచ్చటికే యితఁడును వెళ్ళవలసియుండును. అయాయాపుణ్యస్థలములయందుఁ జిరకాలముండి స్వవాసనానుసారముగా భగవత్ప్రీతములును, తనకభిమతములును అగుభోగముల ననుభవించి మరల నీలోకములో సత్పురుషులును, కులీనులును, సదాచారవంతులును నగు మహాత్ముల యిండ్లలో జన్మించి పూర్వజన్మమునందుఁ జేయఁబడిన యీశ్వరారాధనయొక్క సంస్కారమునశమున మరలఁ బూర్వజన్మమునం దభ్యసింపఁబడిన యాభగవదనుచింతనమునే యనుసరించుచుండును. క్రమముగా నభ్యాసమును వృద్ధిని బొందించుకొనుచుఁ బరిపాకము గలుగఁగానే వైకుంఠలోకమునకుఁ బోవుట కధికారి యగుచుండును. "అనేవంవా" ఇచటివాశబ్దము భిన్నవ్యవస్థార్థము. విషయభోగవాసనారహితుఁడై కేవలమును ముముక్షుఁడే యగునుపాసకునకు స్వర్గాదిలోకములకుఁ బోవలసినయవసరము తటస్థింపదు. మఱియేమన; పూర్వదేహమునకు పాతము గలిగిన యనంతర మీలోకమునందే భగవద్భక్తులగు సత్పురుషుల కులమునందన్యశరీరమును బొంది పూర్వవాసనానుసారముగా భగవంతునియారాధనము ననుసరించి యభ్యాసమును వృద్ధిని బొందించుకొనుచు నితఁడు క్రమముగా నుపాసన పరిపక్వమును బొందినతోడనే విష్ణులోకమును

గూర్చిపోవును. ఆయీసంగతి యంతయు భగవద్గీతలోఁగూడ నిర్ణయముగాఁ జెప్పఁబడియే యున్నది. ఎట్లనఁగా :—

"శ్లో. ప్రాప్య పుణ్యకృతాం ల్లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టో ఽభిజాయతే.
అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్,
పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్."

అనఁగా—ఓయర్జునా! యోగోపాసననుండి భ్రష్టుఁడగుపురుషుఁడు స్వర్గాదిలోకములకుఁ బోయి యచ్చటచ్చటఁ జాలసంవత్సరములుండి తరువాతఁబవిత్రులగు శ్రీమంతులకులములో జన్మించుచుండును. లేదేని; స్వర్గాదిలోకములకుఁ బోక మరల నీలోకములోనే జ్ఞానవంతులగు యోగులకులములోఁ బుట్టుచుండును. అచటఁ బూర్వాభ్యాసముచేతఁ బ్రేరితుఁడై మరల నభ్యాసమును వృద్ధిపొందించుకొని యిట్లనేకజన్మములయందు సిద్ధుఁడై తరువాతను బరమగతిని బొందుచుండును.

అవ. ఈప్రకారముగా నపక్వదశయందలి నిర్ణయమును జెప్పి యిప్పుడాగతినే నిరూపించుచున్నాఁడు:—

సూ. దేవయానేన పథా విహితత్వాత్. ౮

భా. గతి కధికారము గలుగఁగానే వర్తమానశరీరపాతానంతరమందీపురుషుఁడు వైకుంఠలోకమునకుఁ బోవ నిశ్చయించినవాఁడై దేవయానమార్గముచేఁ బోవుచున్నాఁడు. ఈసంగతి యెట్లు దెలిసిన దందువేని వినుము. శ్రుతులయందును, స్మృతులయందును బరమేశ్వరోపాసకుఁడు దేవయానమార్గముచేఁ బోవు నని విహితమగుచు యున్నది. ఆవిషయమై;

"శ్రు. అథ యదు చైవాస్మి ఞ్ఛవ్యం కుర్వన్తి యదిచ నార్చిష
మేవాభిసంభవం త్యర్చిషో ఽహరహ్న ఆపూర్యమాణ
పక్ష మాపూర్యమాణపక్షాద్యా న్షడుదఙేతి మాసాం
స్తా న్మాసేభ్యః సంవత్సరం సంవత్సరా దాదిత్య మాది
త్యా చ్చంద్రమసం చంద్రమసో విద్యుతం తత్పురు

ప్రోzమానవః స ఏతాన్ బ్రహ్మ గమయ త్యేష దేవ
పథో బ్రహ్మపథ ఇతి. ”

అనఁగా :— ఏకాలమున దుపాసకునకు దేహపాత మగునో యటుతరువాత నతనిసంబంధులు గాని శిష్యులు గాని యతనికి శవ క్రియలు (అనఁగా నగ్ని సంస్కారాదులు.) చేసినను చేయకున్నను నతఁడు దేవయానమార్గమునుండియే పోవును. అచ్చట ముందుగా నగ్ని దేవతను బొందును. అక్కడనుండి దినమును, దినమునుండి శుక్ల పక్షమును, అచ్చటనుండి షణ్మాసమును, ఉత్తరాయణమును, అచ్చటనుండి సంవత్సరమును, సంవత్సరమునుండి, సూర్యుని, సూర్యునినుండి చంద్రుని, చంద్రునినుండి విద్యుత్తును, అచ్చటినుండి తరువాత నమానవుఁడగు పురుషుని బొందును. అమానవుఁడగు నాపురుషుఁ డేయుపాసకుని సగుణబ్రహ్మసమీపమునకుఁ దీసికొనిపోవునో అది దేవయానమార్గము. దానినే బ్రహ్మమార్గమని కూడఁ జెప్పుదురు. అని సామవేదీయచ్ఛాందోగ్యోపనిషత్తులోఁ జెప్పఁబడియున్నది. మఱియు,

“శ్లో. అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణమ్,
తత్ర ప్రయతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. ”

అనఁగా—అగ్ని, దినము, శుక్లపక్షము, షణ్మాసములు, ఉత్తరాయణము మొదలగునేదేవయానమార్గము గలదో దానిద్వారమునఁ బోయినయుపాసకుఁడు బ్రహ్మలోకమునకుఁ బోవును. అని గీతోపనిషత్తులో శ్రీకృష్ణభగవానులవారు సెలవిచ్చి యున్నారు. మఱియు నీవిషయమునే, “సూ. అర్చిరాదినా తత్ప్రథితేః” అనఁగా నుపాసకపురుషున కర్చిరాదిరూపమయిన దేవయానమార్గముననే గమనము నిరూపింపఁబడియున్నది. అని యుత్తరమీమాంసలో వ్యాసభగవానులవారు గూడ సూత్రించియున్నారు. పూర్వోక్తమైన శ్రుతిస్మృతివాక్యములందున్న బ్రహ్మశబ్దముచేతను సగుణబ్రహ్మమగు విష్ణుపురమును బ్రహ్మమునకునుగూడ గ్రహణము. బ్రహ్మలోకముయొక్క యూర్ధ్వభాగమునందే వైకుంఠలోక మున్నది గనుక నచ్చట బ్రహ్మవిష్ణులోకములకు మార్గభేదము శంకింపరాదు. ఈవిషయమై :—

"శ్లో. బ్రహ్మణ స్సదనా దూర్ధ్వం తద్విష్ణోః పరమం పదమ్,
శుద్ధం సనాతనం జ్యోతిః పరం బ్రహ్మేతి యంవిదుః."

అనఁగా — బ్రహ్మలోకముకంటె మీఁదుగా విష్ణుని పరమధామము గు వైకుంఠలోక మున్నది. ఆవిష్ణుపరమాత్మునినే శుద్ధుఁ డనియు, సనాతనుఁ డనియు, జ్యోతిస్స్వరూపుఁ డనియు, పరబ్రహ్మ మనియు ఋషులు తెలిసికొనుచున్నారు. అని మహాభారతారణ్యపర్వములో వ్యాసభగవానులవారు వ్రాసియున్నారు. కావున నేమార్గమున బ్రహ్మలోకమునకుఁ బోవుచుందురో ఆమార్గముచేతనే విష్ణులోకమునకును బోవుచుందు రని తెలిసికొనవలయును. ఆదేవయాన మార్గప్రాప్తి యిట్లుగా ననుసంధింపవలయును. అర్చి, దినము, శుక్లపక్షము, షణ్మాసము, ఉత్తరాయణము, సంవత్సరము, దేవలోకము, వాయువు, సూర్యుఁడు, చంద్రుఁడు, మెఱుపు, వరుణుఁడు, ఇంద్రుఁడు, ప్రజాపతి, అమానవుఁ డగుపురుషుఁడు అనువీరందఱును గ్రమముగా నుపాసకుని విష్ణులోకమును బొందింతురు. వీరందఱును అర్చిరాదుల కభిమానదేవత లని తెలియవలయును. ఎందుచేత ననఁగా, కేవలమును జడములయిన యర్చిరాదులయం దుపాసకుని లోకాంతరమునకుఁ దీసికొనివెళ్లుశక్తి సంభవింపదుగదా! ఈవిషయమై :— "సూ. ఆతివాహికా స్తల్లిఙ్గాత్." అనఁగాఁ బైని చెప్పఁబడిన యర్చిరాదుల యభిమానదేవతలే యుపాసకులను దీసికొనిపోవునవి యని తెలియవలెను. ఏమనఁగా, ఉపాసకులను దీసికొనిపోవుట యనుచిహ్నము చేతన దేవతలయందే సంభవించునుగాని యచేతనములయం దెన్నటికిని సంభవింపదుగదా! అని బ్రహ్మమీమాంసలో వ్యాసభగవానులవారును సూత్రించియున్నారు.

౮౭. ఈరీతిగా సర్వసాధారణమైన గతిని జెప్పి యిప్పుడు రెండవప్రకారముగాఁగూడఁ జెప్పుచున్నాఁడు :—

సూ. పార్షదై రపి కేచి చ్ఛ్రవణాత్. ౫

భా. కొందఱుపాసకులు పార్షదులచేఁగూడ విష్ణులోకమునకుఁ దీసికొనిపోఁబడుచున్నారు. భగవంతుని ప్రేరణచే వైకుంఠలోకమునుండి

వచ్చి పార్షదులు దివ్యవిమానముపై నెక్కించి యుపాసకుని విష్ణులోకమునకుఁ దీసికొనిపోవుచుందు రని శ్రుతిస్మృతీతిహాసపురాణాదుల యందుఁ జాలచోట్ల వినవచ్చుచునేయున్నది. కావుననే సూత్రములో "శ్రవణాత్" అని ప్రయోగింపఁబడిన దని తెలియఁదగును.

అవ. "సరియే కాని యిపుడు మీరు చెప్పినరీతిని రెండువిధములయినగతియుఁ బరస్పరవిరుద్ధ మయినది గదా! అది యొకయుపాసన విషయమై యెట్లు సంభవించెడిని?" అని శంక రాఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. అనుగ్రహీతస్య తు న క్రమాపేక్షా. ౬

భా. సూత్రములోని 'తు' శబ్దము శంకను బరిహరించుటకు. ఆలోచించి చూడఁగా సాధారణముగాను దఱచుగాను భగవదుపాసకుల కర్చిరాదిమార్గమునసే గతి గలుగుచుండును. కాని యెవనియందుఁ జేరిమాతిశయమువలనఁ బరమేశ్వరుఁడైన శ్రియఃపతి కనురాగము విశేషముగా నుండునో ఆయుపాసకున కర్చిరాదిక్రమాపేక్ష యక్కఱ లేదు. మఱియేమన, భగవంతునియాజ్ఞచేతను పార్షదులే సత్వరముగా నుపాసకుని విష్ణుమూర్తియొద్దకుఁ దీసికొనిపోవుదురని తెలియవలయును. రాజాదుల కనుగ్రహము గలిగినచో భృత్యాదులకు నియమితమైన క్రమ మక్కఱయుండదు. అనఁగా నారాజుమొదలగు గొప్పవా రెవని యందు మిక్కిలి ప్రసన్ను లగుచుందురో వానిని వెంటనే తమసన్నిధికిఁ బిలిపించుకొందురు. ఈసంగతిలోకములో నెల్లరును నెఱిఁగినదియే. కావున నర్చిరాదిక్రమమునను, పార్షదులద్వారమునను రెండువిధములుగాను ఉపాసకునికి గమనము యుక్తియుక్తముగానే యున్నది.

అవ. ఇదిగాక యర్చిరాదిమార్గమున నే వెళ్ళవలయునని నియమముగూడ లే దని యోగిదృష్టాంతముచేఁ జూపించుచున్నాఁడు:—

సూ. యోగసిద్ధస్య నోభయతంత్రత్వమ్. ౭

భా. ఏపురుషు లీలోకములో యోగాభ్యాసముచే నణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము నను నెనిమిది యైశ్వర్యములును లభించుటచే సిద్ధు లగుచున్నారో

వారికి వైకుంఠలోకమునకుఁ బోవుట కుభయతంత్రస్వము లేదు. అనఁగా వారి కర్చిరాదిమార్గాధిపత గాని పార్షదాధిపతి గాని యుండఁబోదు. ఎందుచేత ననఁగా వారు తమయిచ్ఛానుసారముగా యోగబలముచే తను బ్రహ్మరంధ్రమును భేదించుకొని యీపాంచభౌతికశరీరమును విడిచి యెచ్చటికిఁ బోవఁదలచుకొనిరో యచ్చటికే యోగధారణచే నడ్డులేకుండఁ బోవుచుందురు. యోగులకు స్వతంత్రముగాఁ బోఁగలశక్తి యున్న దని శ్రుతిస్మృతిపురాణేతిహాసములయందుఁ బ్రసిద్ధమైయున్నది. ఆవిషయమై ;

శ్లో. యోగేశ్వరాణాం గతి మాహు రంత
ర్బహి స్త్రిలోక్యాః పవనా స్తరాత్మనామ్,
న కర్మభి స్తాం గతి మాప్నువ న్తి
విద్యాతపోయోగసమాధిభాజామ్.
యది ప్రయాస్య న్నృప ! పారమేష్ఠ్యం
వైహాయసానా ముత యద్విహారమ్,
అష్టాధిపత్యం గుణసన్నివాయే
సహైవ గచ్ఛే న్మనసేంద్రియై శ్చ."

అనఁగా—పవనరూపముగా సూక్ష్మశరీరములతోఁ సంచరింపఁజాలు యోగీశ్వరులకు మూఁడులోకముల వెలుపలను లోపలను గతి గల దని చెప్పుదురు. విద్య, తపస్సు, యోగసమాధి గలిగినవారి యీగతి కేవలమును గర్మములచేఁ బొందశక్యము గాదు. మఱియు నోరాజా! దేహమును విడుచుకాలమునం దేయోగికి బ్రహ్మలోకమునకుఁ గాని దేవతలకు విహారభూమి యగు స్వర్గలోకమునకుఁ గాని, అష్టసిద్ధులు గలవారిస్థానమునకుఁ గాని త్రిగుణములసముదాయమగు సర్వబ్రహ్మాండమునకుఁ గాని యది యిది యన నేల ? యెచ్చటికిఁ బోవలయు నని యిచ్ఛ గలుగునో యచ్చటి కతఁడు మనస్సుతోడను ఇంద్రియముల తోడను గూడనే పోవుచుండును. మఱియు ;

"సూ. తతో మనోజవిత్వం వికరణభావః ప్రధానజయ శ్చ."

అనఁగా—యోగికి మనోవేగముతో సమానమయిన గతి గలు

గుదు. మఱియు గోళకము లక్కఱలేకుండఁగనే సూక్ష్మములును, వ్యవహితములును, విప్రకృష్టములును నగుపదార్థములయం దింద్రియముల ప్రవృత్తియుఁ బ్రకృతియొక్క జయమును గలుగును. అని యోగశాస్త్రములోఁ బతంజలిభగవానులవారును సూత్రించియున్నారు.

అవ. ఈరీతిగా నుపాసకునకు వైకుంఠలోకమునందు గతిని నిరూపించి యిప్పు డచ్చటికిఁ బోయినవారి కందఱకును పదప్రాప్తి సమానముగానే యుండునా? లేక హెచ్చుతగ్గులుగా నుండునా? అని జిజ్ఞాస గలుగఁగా నచ్చటివిశేషమును నిరూపించుచున్నాఁడు :—

సూ. చాతుర్విధ్యశ్రవణాన్న తుల్యత్వమ్. ౮

భా. సగుణబ్రహ్మోపాసకులకు సాలోక్యము, సామీప్యము, సాయుజ్యము, సారూప్యము నను భేదములవలన నాలుగువిధములయిన ముక్తి గల దని శ్రుతిస్మృతిపురాణేతిహాసములయందు వినవచ్చుచున్నది. అందుఁ గొందఱుపాసకులు విష్ణులోకనివాసమునే పొందుదురు గాని విష్ణుసామీప్యమును బొందఁజాలరు. మఱికొంద ఱుపాసకులు విష్ణుసామీప్యమునే పొందుచుందురు గాని విష్ణుభగవానునితోఁగూడ విహరించుటను బొందఁజాలరు. ఇఁకఁ గొంద ఱుపాసకులు విష్ణుసాయుజ్యమునే పొందుదురు గాని తత్సారూప్యమును బొందఁజాలరు. మఱియుఁ గొందఱుపాసకులు విష్ణుభగవానునితో సమానముగాఁ జతుర్భుజత్వము మొదలగు తత్సరూపత్వమును బొందుచుందురు. ఈరీతిగా వైకుంఠలోకమునకుఁ బోయినవారికి వేఱువేఱుగా నాలుగువిధములయిన పదములు దొరకుచుండును. కావున నచ్చటికిఁ బోయినవారి కందఱకును తుల్యతి సంభవింపదు. భాగవతము మొదలగుపురాణములయందు;

"శ్లో. సర్వే చతుర్బాహవ ఉన్మిషన్మణిప్రవేకదివ్యాభరణాః సువర్చసః."

అనఁగా, వైకుంఠలోకములో నందఱును జతుర్బాహువులు గలవారును, ప్రకాశించు మణివికారములయిన దివ్యాభరణములు ధరించినవారును, మంచితేజస్సు గలవారును నై యుందురు. అని యున్నందున వైకుంఠలోకనివాసుల కందఱకును సమానరూపము గలిగియుండు నని చెప్పఁబడినట్టియునది గాదా యందువేమో? అది సరిగాదు. ఏమన నది

సారూప్యముక్తిని బొందినవారును భగవంతునికి ముఖ్యసాన్నిధ్యులును నగువారికే కాని యందఱకును సంభవింపదు. అట్లే కానిచో గరుడుడు, శేషుడు మొదలగువారికిఁగూడఁ జతుర్భుజత్వము మొదలగు సారూప్యము గలుగవలయును గదా! అట్లు వినవచ్చుట లేదు గనుక నందఱకును సామ్యము గలుగు నని యనుకొనరాదు.

అవ. "సరియేకాని యొక్క-ధ్యేయస్వరూపమునందే నిష్ఠగల వారి కందఱకును సమానమయిన పదవియే లభింపవలయును గాని హెచ్చుతగ్గులుగా నుండఁగూడదు గదా! ఈనాలుగువిధములయిన భేదములును గలుగుటకుఁ గారణ మేమి" యనఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. స్థితిభేద స్తూపాధితారతమ్యాత్.

భా. సూత్రములోని "తు" శబ్దముచేత నాక్షేపమును బరిహరించుచున్నాఁడు. వైకుంఠలోకమును బొందినయుపాసకులకు వినవచ్చుచున్న నాలుగువిధములయిన యేస్థితిభేదము గలదో అది యుపాసనయొక్క-తారతమ్యమునుబట్టియే కలుగుచున్నది. "శ్రు. తం యథా యథోపాసతే తత్తథైవ భవతి" అనఁగా—ఆపరమేశ్వరు నేయేపురుషుఁ డేయేరీతిగా నుపాసించుచుండునో యతఁ డాయారీతిగానే యగుచుండును. అను శ్రుతివచనము ననుసరించి యేయుపాసకునకు భగవంతునివిషయమై యెటువంటియుపాసన యుండునో అతని కటువంటిపదముయొక్క-ప్రాప్తియే కలుగుచునుండును. అది యెట్లనఁగా; ఎవరు పరమేశ్వరుని వైకుంఠాదిస్థానములను బొందినవానినిగాను తనకంటె దూరమందున్నవానినిగాను భిన్నునిగాను దెలిసికొని యుపాసించుచుందురో వారు సాలోక్యపదవిని బొందుదురు. ఎవరు ప్రతిమ మొదలగువానిని బొంది తనకు సమీపమునందే యున్నవానినిగాఁ దెలిసికొని భేదబుద్ధిచే భగవంతు నారాధింతురో వారు సామీప్యపదవిని బొందుదురు. ఎవరు సర్వత్ర నిండియున్నవానినిగాను, అంతర్యామినిగాను "శ్రు. ద్వాసుపర్ణా సయుజా సఖాయా" అనుశ్రుతియందుఁ జెప్పఁబడిన న్యాయముప్రకారము తనజీవాత్మకు స్నేహితునిగాను దెలిసికొని పరమేశ్వ

రుని జింతనసేయుదురో వారు సాయుజ్యపదవిని బొందుదురు. ఇఁక నె
నరు సర్వదా అధ్యాత్మవిద్యాపరాయణులై "శ్లో. మమైవాంశో జీవ
లోకే జీవభూతస్సనాతనః." అని భగవద్గీతలోఁ జెప్పఁబడిన న్యా
యము ననుసరించి తనయాత్మ కంశిభూతుఁడును, సచ్చిదానందమయుఁ
డును, స్వహృదయకమలమునం దున్నవాఁడును నగుపరమేశ్వరుని నిరం
తరమును భేదబుద్ధి లేకుండ ధ్యానించుచుందురో వారు సారూప్యపద
విని బొందుదురు. ఈప్రకారముగా నుపాసనాతారతమ్యమునుబట్టి స్థితి
తారతమ్యము గలుగుచుండును.

అవ. ఈరీతిగా నుపాసకులకుఁ బరస్పరమును స్థితిభేదమును
జెప్పి యిప్పు డీశ్వరునికంటెనుగూడ వారికి స్థితిభేదమును వర్ణించు
చున్నాఁడు:—

సూ. విభూతిసామ్యం వినారంభాత్. ౧౦

భా. విష్ణులోకమును బొందినయుపాసకులకుఁ గేవలమును జగ
త్సృష్టి తక్కఁ దక్కినసర్వవిధములయిన వైభవమును బరమేశ్వరునితోఁ
దుల్యముగానే గలుగును. ఈసంగతి,

"శ్రు. సా యా బ్రహ్మణో జితి ర్యా వ్యష్టి స్తాం
జితిం జయతి తాం వ్యష్టిం వ్యశ్నుతే య ఏవం వేద"

అనఁగా—ఎవఁడీప్రకారముగా నుపాసించి బ్రహ్మలోకమునకుఁ
బోవునో అతఁడు సగుణబ్రహ్మమున కెంతజితియు, విభూతియుఁ గలదో
ఆజితిని, విభూతిని పొందును. అని కౌషీతకీయబ్రాహ్మణోపనిషత్తులోఁ
గూడఁ జెప్పఁబడియున్నది. ఈశ్రుతివచనమువలనఁ బరమేశ్వరుఁ డగు
మహావిష్ణువున కెంతయుపభోగసామగ్రి గలదో అది యంతయు వారికిఁ
గూడ నుపస్థితమై యుండును. మఱియుఁ బరమేశ్వరునితో సమానమ
యిన యణిమాదులసామర్థ్యముగూడ నాయుపాసకులకు లభించును
గాని పరమేశ్వరునియం దేజగదారంభశక్తి గలదో అది మాత్ర ముపా
సకులకు లభింపఁబోదు. ఇచ్చట నారంభశబ్దముచేత స్థితియు నాశమును
గ్రహింపఁబడును. ఈవిషయమై.

"సూ. జగద్వ్యాపారవర్జం భోగమాత్రసామ్యం లిఙ్గాచ్చ."

అనఁగా—సగుణబ్రహ్మలోకమును బొందినయుపాసకునకు జగత్సృష్టిమొదలగువానియం దధికారము లేదు. కేవలమును బరమేశ్వరునితో సమానముగా భోగప్రాప్తిమాత్రము గలుగును. అని బ్రహ్మమీమాంసలో వేదవ్యాసభగవానులవారు నిర్ణయించియున్నారు. మఱియు,

"శ్లో. తత స్స్వాభావికాః పుంసాం తే సంసారతిరోహితాః.
ఆవిర్భవన్తి కల్యాణా స్సర్వజ్ఞత్వాదయో గుణాః.
ఏవం గుణా స్సమానా స్స్యు ర్ముక్తానా మీశ్వరస్య చ,
జగత్కర్తృత్వ మేవైకం తేభ్యో దేవే విశిష్యతే."

అనఁగా—సంసారబంధముచేతను లోపించిన సర్వజ్ఞత్వము, సర్వశక్తిత్వము మొదలయిన యనేకకల్యాణగుణములు జీవునకు స్వాభావికముగాఁ గలవో అవి విష్ణులోకమునకుఁ బోయినతరువాతను మరల నుపాసకునకుఁ బ్రకట మగుచుండును. ఈరీతిగా నీశ్వరునకును ముక్తులగుజీవులకును సమస్తగుణములును సమానముగానే యుండును. కాని యొక్క జగత్కర్తృత్వముమాత్రమే జీవులకంటెఁ బరమేశ్వరునియం దధికముగా నుండును. అని మాధవాచార్యులవారు సర్వదర్శనసంగ్రహము లోఁగూడ వ్రాసియున్నారు.

అవ. ఇప్పుడు చెప్పఁబడిన ప్రకారముగా విష్ణులోకమును బొందినయుపాసకుల కుపాసనాఫల మంతము నొందఁగానే యేమిగతి గలుగునని జిజ్ఞాస గలుగఁగా నిర్ణయమును జెప్పుచున్నాఁడు :—

సూ. అధికారాన్తే పరే లయో వచనాత్. ౧౧

భా. తమతమయుపాసన ననుసరించి లబ్ధాధికారులగు చతుర్విధోపాసకులకును దమ యధికారములు సమాప్తి నొందఁగానే పరమాత్మయగు నిర్గుణబ్రహ్మమునందు లయ మనఁగా నేకీభావము గలుగును. అది యెట్లు దెలియు నందువేని వినుము. ఈవిషయమై శ్రుతిస్మృతివచనములు ప్రమాణ మున్నవి. ఎట్లనఁగా :—

"శ్రు. తే బ్రహ్మలోకేషు పరాన్తకాలే
పరామృతాః పరిముచ్యన్తి సర్వే,

పరే౽వ్యయే సర్వ ఏకీభవన్తి
పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్."

అనఁగా—సగుణబ్రహ్మముయొక్క లోకమును బొందినయుపాసకులు కల్పాంతమందు ముక్తస్వరూపులై కైవల్యపదమును బొందుదురు. మఱియు ముక్తులయిన జీవులయొక్క ప్రాణాదిసర్వకళలలును బరబ్రహ్మమునం దేకీభావమును బొందును. మఱియు నాముక్తులు ప్రకృతికంటెఁ బరుఁడైనయేదివ్యపురుషుఁ డగుపరమాత్మ గలఁడో అతనిని బొందుదురు. అని ముండకోపనిషత్తులోఁ జెప్పఁబడియున్నది. మఱియు,

"శ్లో. బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే,
పరస్యాంతే కృతాత్మానః ప్రవిశన్తి పరం పదమ్."

అనఁగా— మహాప్రళయసమయమునందు బ్రహ్మతోఁగూడ నుపాసకులందఱును జ్ఞానమును బొందినవారై పరమపదమగు నిర్గుణపరబ్రహ్మమునందుఁ బ్రవేశింతురు. అని స్మృతివచనముగూడఁ బ్రమాణమున్నది.

అవ. "సరియే జీవుఁడు నిరంతరమును నీశ్వరున కధీనుఁ డగుటవలన నతనితోఁగూడ నేకీభావము గలుగుట తగదు. వైకుంఠలోకమును బొందినపిమ్మటనుగూడ నాజీవుఁడు సర్వదా భగవంతునకుఁ గింకరుఁ డయి యుండుటయే యుక్త మగునే" అని యాక్షేపింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. పృథగవస్థితి రితిచే న్నానవకాశదోషప్రసంగాత్. ౧౨

భా. వైకుంఠలోకమునుగూర్చి పోయినయుపాసకులకు నెల్లప్పుడును బరమేశ్వరునికంటె భిన్నమయిన స్థితియే సంభవింపవలయునందువేని యది సరి యయినసంగతి గాదు. ఏమనఁగా, అట్లే యొప్పినయెడల ననవకాశమను దోషము తటస్థించును. అనఁగా నదివఱకచ్చట నున్నవారి కిప్పటికిని స్వపదత్యాగము లేనందువలనఁ దరువాతను బోయినయితరులకుఁ దత్పదము లభింపక యున్నచో ననవకాశమే కలుగు నని యర్థము. అందఱియొక్కయుపాసనయు వేఱువేఱుగానే యుండవలయునను నియమముగూడ లేదు. కావున నొకప్పుడుపాస

నకుం దుల్యత్వముగూడ నవశ్యముగా నంగీకరింపవచ్చును. అట్లగుటవ లన గరుడశేషాదులపదమును బొందుకొఱకు యోగ్యమగు యుపాసనను జేసినవాఁడై యీశరీరపాతానంతరము వైకుంఠలోకమునుగూర్చి పోయినవానికిఁ దత్తత్పదలాభము తప్పక దొరకవలసినదే యున్నది. శ్రుతిస్మృతీతిహాసాదులయందుఁ బ్రసిద్ధమయి యుండుట లేదు గనుక గరుడాదులు చాలమంది యున్నారనుటకు వీలు లేదు. గరుడశేషాదిపదప్రాప్తికిఁ దగినయుపాసన యితరులచేఁ జేయుటకు వీలు లేదనికూడఁ జెప్పరాదు. అట్లు చెప్పినచోఁ బూర్వగరుడాదులయందుఁగూడ నదే దోషము ప్రసక్తమగును. మఱియు నుపాసన చేసినచో భగవంతునిసారూప్యపదవియే లభించుచుండఁగా నిఁక గరుడాదిపదలాభముసంగతి వేఱ చెప్పవలయునా ? కావున విష్ణులోకమునకుఁ బోయినయుపాసకుల కందఱకును తమతమయధికారము సమాప్తినిబొందినతరువాత నిర్గుణమగు పరబ్రహ్మమునం దేకీభావము గలుగుట కేవిధమయినయభ్యంతరమును లేదు.

అవ. ఈసంగతినిబట్టికూడ నేకీభావము నిశ్చయింపఁదగి యున్నదన్న సంగతి చెప్పుచున్నాఁడు :—

సూ. ఉత్పత్తిశ్రవణాత్. ౧౩

భా. మహాభారతము మొదలగు గ్రంథములయందు గరుడాదులకు వినతాదులగర్భములనుండి యుత్పత్తి వినవచ్చుచున్నది. అట్లగుటవలన గరుడుఁడు పుట్టకమునుపు విష్ణుభగవానున కేవిధమయినవాహనమును లేదని చెప్పవలయును. కాని యట్లు చెప్పుటకు వలనుపడదు. "శ్రు. సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్." అనఁగా నెట్లు సూర్యుఁడు చంద్రుఁడును బూర్వమం దుండిరో యట్లే బ్రహ్మ యీకల్పమునందును మొదట సృజించెను. అనువేదవాక్యము ననుసరించి చూడఁగాఁ బూర్వమందుఁగూడ గరుడాదు లున్నారని యంగీకరింపక తప్పదు. వారు తమ యధికారము ముగియఁగానే కైవల్యమోక్షపదమును బొందుటవలన మరల నాయధికారమునం దితరులగు క్రొత్త యుపాసకుల నుంచుట యుక్తముగా నుండును. కావున విష్ణులోకమును

బొందినయుపాసకులకుఁ బరమేశ్వరునికంటె సర్వదా భిన్నస్థితి సంభవింపదు. మఱియు,

సూ. సామ్యశ్రుతివిరోధా చ్చ. ౧౮

భా. మోక్షదశయందు జీవేశ్వరుల కభేదమును బ్రతిపాదించు ననేకశ్రుతులకు విరోధము సంభవించుటవలనఁగూడ సర్వదా వారికి వేఱువేఱుగా నునికి యంగీకరింపరాదు. ఈవిషయమయి,

"శ్రు. యథా నద్య స్స్యన్దమానా స్సముద్రే z_స్తం
గచ్ఛన్తి నామరూపే విహాయ, తథా విద్వాన్
నామరూపా ద్విముక్తః పరాత్పరం పురుష
ముపైతి దివ్యం. తదా విద్వాన్ పుణ్యపాపే విధూ
య నిరంజనః పరమం సామ్య ముపైతి."

అనఁగా—ఏరీతిగాఁ బ్రవహించుచున్న గంగాదినదులు తమ నామరూపములను విడిచి సముద్రములో లయమగుచున్నవో యదే రీతిగానే జ్ఞానియగు పురుషుఁడును తననామమునుండి రూపమునుండి విముక్తుఁడై ప్రకృతికంటెఁ బయిగానుండు పరమాత్మునియందు లయమగుచున్నాఁడు. మఱియు నేకాలమందు జ్ఞానియగుపురుషుఁడు పుణ్యపాపములనుండి విడుదలను బొంది సర్వముతోడను నిర్లేపుఁడై యుండునో అప్పుడు పరమాత్మతో సామ్యమును బొందును. అని ముండకోపనిషత్తు చెప్పుచున్నది. కావునఁ దమయధికారమున కంతము గలుగఁగానే యుపాసకులందఱును బరమేశ్వరునియం దేకీభావమును బొందుదురని నిశ్చయింపఁదగును.

అవ. ఈప్రకారముగా వైకుంఠలోకమును బొందినయుపాసకుల కందఱకును మోక్షదశలోఁ బరమాత్మునియం దేకీభావ మగునా లేక యందుఁ గొందఱు కీలోకమునందుఁ బునరాగమనముగూడ సంభవించునా యని జిజ్ఞాస గలుగఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. పునరనావృత్తిసం నిమిత్తాభావాత్. ౧౯

భా. సగుణ బ్రహ్మమునుపాసించుటచే దేవయానమార్గముగుండ విష్ణులోకమును బొందిన యుపాసకులు మరల నీలోకమునకు రావల

సినవారు గారు. ఎందుచేత ననఁగా, వారు మరల వచ్చుటకు నిమి త్తము లేదు. మరల జన్మించుట కజ్ఞానమే కదా కారణము ! ఆయజ్ఞానము వైకుంఠలోకము సత్త్వగుణప్రధాన మయినది గనుక నచ్చటికిఁ బోయినవారి కాత్మజ్ఞానముచేతను వెంటనే వినాశమును బొందును. ఈవిషయమై "శ్రు. ఛాయాతపయో రివ బ్రహ్మలోకే" అనఁగా సగుణ బ్రహ్మముయొక్క లోకమునందు ఛాయ, యెండవలెను స్ఫుటమయిన జ్ఞానము గలుగును. అనఁగా నెట్లు ఛాయ, యెండయు నిస్సందేహముగఁ బ్రతీత మగునో అట్లే అచ్చట నాత్మయొక్కయు, అనాత్మ యొక్కయు జ్ఞానము నిస్సందేహముగా స్ఫుటముగాఁ గలుగును. అని యీవిధముగా యజుర్వేదీయకఠోపనిషద్వాక్యము ప్రమాణముగానున్నది. అందువలన నజ్ఞానరూపమయిన కారణము నశించినతరువాత మఱి పునర్జన్మరూప కార్య మెట్లు గలుగును ? కావునఁ గ్లేశములు, కర్మములు మొదలగు నిమిత్తములు లేకపోవుటవలన నుపాసకుల కీదుఃఖబహుళ మయిన మనుష్యలోకమునకు మరల రావలసిన యవసరము లేదు. కనుక వారు మఱి పుట్ట రని రూఢిగాఁ దెలిసికొనుము. మఱియు ;

సూ. ప్రమాణాచ్చ. ౧౯.

భా. శ్రుతిస్మృతిపురాణేతిహాసములు ప్రమాణముగా నుండు టవలనఁగూడ వారికి మరల జన్మించుట సంభవింప దని తెలిసికోఁ దగును. ఈవిషయమై :—

"శ్రు. ఏష దేవపథో బ్రహ్మపథ ఏతేన ప్రతిపద్యమానా ఇమం
మానవ మావర్తం నావర్తన్తే నావర్తన్తే."

అనఁగా, వెనుకఁ జెప్పఁబడిన యర్చిరాదిరూపమయిన మార్గమే దేవయానమార్గము. దానినే బ్రహ్మమార్గ మనికూడ వ్యవహరింతురు. కావున నీమార్గముగుండఁ బోయినపురుషుఁడు మరల నీమనుష్యలోకము లోనికి రాఁడు రాఁడు. అనిఛాందోగ్యోపనిషత్తు ప్రమాణముగా నున్నది. మఱియు నీవిషయమై ;

"శ్లో. శుక్లకృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే,
ఏకయా యాత్యనావృత్తి మన్యయావర్తతే పునః."

అనఁగా, శుక్లరూపము, కృష్ణరూపము నగు దేవయానమార్గము, పితృయానమార్గము ననునీరెండుగతులును జగత్తునకు శాశ్వతమయినవి. అందులో నొకదానిచే ననఁగా దేవయానమార్గముచేఁ బోయినవానికి మరల రావలసిన యవసరము లేదు. రెండవదియగు పితృయానమార్గమునఁ బోయినవాఁడు పునరావృత్తిని పొందును. అను గీతోపనిషద్వాక్యముగూడఁ బ్రమాణము. మఱియు ;

“సూ. అనావృత్తి శ్శబ్దా దనావృత్తి శ్శబ్దాత్.”

అనఁగా “శ్రు. న స పునరావర్తతే” ఇత్యాదివేదశబ్దములు ప్రమాణముగా నుండుటవలన దేవయానమార్గముగుండఁ బోయినయుపాసకుల కీలోకములోనికి రానక్కఱ లేదు. అని బ్రహ్మమీమాంసాధ్యాయములో వ్యాసభగవానులవారుగూడ సూత్రించియున్నారు.

అవ. “సరియే. ఇపుడు తాము వైకుంఠలోకమునుగూర్చి పోయినయుపాసకులకుఁ బునరావర్తనము లేదని చెప్పితిరి గాని యదియంత యుక్తియుక్తముగాఁ గనుపట్టుట లేదు. పురాణేతిహాసాదులలో భగవంతునిపార్షదులుగూడ వైకుంఠలోకమునుండి క్రిందికిఁ బడి రనుసంగతి వినవచ్చుచున్నదిగదా ! మరల నీలోకమునకు రారని మీ రెట్లు చెప్పెదరు” అనఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. శ్రవణా దితి చే న్నాన్యహేతుకత్వాత్. ౧౭

భా. భగవంతునిపార్షదులకు విష్ణులోకమునుండి నిపతనము వినవచ్చుటవలన నీలోకమునుండి యచ్చటికిఁ బోయిన యితరులగు నుపాసకులకుఁగూడ నానిపాతము సంభవించు నని నీవు చెప్పినది యొప్పుకోఁదగి యుండలేదు. ఏమనఁగా నాపార్షదులు మరల నీలోకములోనికి వచ్చుటకు సనకాదులశాపాత్మకమయిన యితరకారణ మున్నది. కాని యుపాసనచేఁ బొందఁబడిన యధికారము ముగియుటవలనఁ గాదు. కావున నీపార్షదన్యాయము సర్వత్ర యొప్పఁదగదు. కనుక నిదివఱకుఁ జూపఁబడిన శ్రుతిస్మృత్యాదిప్రమాణములవలన వైకుంఠలోకమునుండి యుపాసకులకుఁ బునరావృత్తి సంభవింప దని నిశ్చయించుకోవలయును.

అవ. “సనకాదుల శాపముమొదలగు కారణములవలనఁగూడ

నీలోకములోనికి వచ్చినపార్షదులకు మనుష్యాదిశరీరసంబంధమువలన మరల జన్మమరణరూపమయిన సంసారబంధము తప్పక కలుగునే ” అని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. నిమిత్తవశాన్న బంధనం పునరధికారలాభాత్. ౧౫

భా. శాపాదినిమిత్తవశమున విష్ణులోకమునుండి యీ లోకమునకు వచ్చినపార్షదులకు సంసారబంధనము సంభవింపదు. ఎందుచేతననఁగా వారికిఁ బునరధికారలాభ మున్నది. అనఁగా నాపార్షదు లేయధికారమును విడిచి యేదేనికార్యమువలన నీలోకమునకువచ్చినను ఆకార్యము ముగిసినయనంతరము వారాయధికారమునే పొందుచున్నారు. ఎట్లన; రామకృష్ణాద్యవతారములకు భూభారహరణము మొదలగు కార్యములు నెఱవేర్చుటకై యీలోకమునకు వచ్చుటయు మరలఁ దమచోటికి పోవుచుండుటయు వినవచ్చుచున్నది. మఱియు నీవిషయమున భీష్మాదులుగూడ నుదాహరింపఁదగి యున్నారు. ఆభీష్ముఁడు పూర్వజన్మమునం దెనమండ్రువసువులలోను ఒక్కఁడై యుండువాఁడు. వసిష్ఠభగవానులవారిశాపమున భీష్మత్వమును బొంది దేహపాతాంతమందు మరలఁ దనయధికారమును బొందె నని భారతము చెప్పుచునే యున్నది. కావున నిచ్చటికి వచ్చినంతమాత్రమున బంధము సంభవించు ననుటకు వీలులేదు. ఈయర్థమునే బ్రహ్మమీమాంసలో వ్యాసభగవానులవారు,

“సూ. యావదధికార మవస్థితి రధికారిణామ్. ”

అనఁగా— అధికారముగల పురుషుల కధికారసమాప్తిపర్యంతము స్థితి సంభవించును. మధ్యను నేదేనికారణమువలన జన్మమును బొందుటవలన వారికి సంసారబంధము ప్రాప్తింపఁబోదు. అని సూత్రించి యున్నారు. కావున భగవదుపాసనచే వైకుంఠలోకమును బొందినపురుషుల కీలోకమునుగూర్చి మరల రాక సంభవింప దని నిశ్చయించుకొనవలయును.

అవ. ఈప్రకారముగా సగుణోపాసకులకుఁ గ్రమముక్తిప్రకారమును నిరూపించి యిప్పుడు నిర్గుణపరమేశ్వరస్వరూపమును జింతనసే

యువారికిఁ గ్రనల్యమోక్షప్రాప్తిప్రకారమును నిరూపించుచున్నాఁడు :—

సూ. పూర్ణజ్ఞానవతాం ముగమనమ్. ౧౫

భా. వేదాంతశాస్త్రమును చిరకాలపర్యంతమును విచారించుచుండుటవలన,

"శ్రు. సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలానితి శాంత ఉపాసీత."

అనఁగా, నీజగత్తంతయు బ్రహ్మరూపమే. ఆబ్రహ్మమే సర్వబ్రహ్మాండములయొక్క యుత్పత్తిస్థితినాశనములకుఁ గారణము. అను శ్రుతియొక్కయు,

"శ్లో. మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ,
న త దస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్."

అనఁగా—నోయర్జునా! ఈజగత్తంతయు సూత్రమునందు మణిగణములవలె నాయందు గ్రుచ్చఁబడి యున్నది. మఱియు నాతో సంబంధములేని వస్తు వీచరాచరప్రపంచకములో నొక్కటియు లేదు. అనఁగా సంతటను నేను నిండియున్నాను. అను స్మృతియొక్కయు సిద్ధాంతము ననుసరించి యెవరు సర్వవ్యాపకుఁడును సచ్చిదానందస్వరూపుఁడును నగు పరమాత్మను నిరంతరమును భేదబుద్ధి లేకుండఁ జింతన చేయుచున్నారో అనఁగాఁ బరమాత్మునియథార్థస్వరూపమును దెలిసికొని సర్వకాలసర్వావస్థలయందును జింతనసేయుచుందురో అట్టిపూర్ణజ్ఞానులును, జ్ఞానాగ్నిచే దహింపఁబడిన శుభాశుభరూప కర్మములు గలవారును, లోకాంతరముల గమనము నిమిత్తమైన వాసన లేనివారును, నిష్కాములును నగువారికి శరీరపాతానంతర మిచ్చటినుండి వైకుంఠాది లోకములకు గమనము సంభవింపదు. ఈవిషయమున,

"శ్రు. అథాకామయమానో యోఽకామో నిష్కామ
ఆత్మకామ ఆప్తకామో న తస్య ప్రాణా ఉత్క్రామన్తి."

అనఁగా, నేపురుషుఁడు సర్వకామములచేతను శూన్యుఁడును, నిష్కాముఁడును,పూర్ణకాముఁడును, కేవలమును ఆత్మస్వరూపమునందు స్థితిగలవాఁడును నగుచున్నాఁడో యతని ప్రాణములు పరలోకమునకుఁ బోవు. అని బృహదారణ్యకవచనమును ;

"శ్లో. సర్వభూతాత్మభూతస్య సర్వభూతహితస్యచ,
దేవాపి మార్గే ముహ్యన్తి అపదస్య పదైషిణః."

అనఁగా—ఏజ్ఞానియగుపురుషుఁడు సర్వభూతములకును నాత్మభూతుఁడై సర్వభూతములకును హితుఁడై ప్రవర్తించుచుండునో యతనిమార్గములో దేవతలుగూడ మోహమును బొందుచుందురు. ఎందుచేత ననఁగా నతఁడు గమనములేనివానిని వెదకుచున్నాఁడు. అనుభారతశాంతిపర్వ వచనమును బ్రమాణముగా నున్నవి.

అవ. లోకాంతరగమనము లేనిచో మృత్యుకాలానంతరమునఁ దత్త్వవిదుఁడగు నాజీవాత్మ కేమివ్యవస్థ సంభవించు నని జిజ్ఞాస గలుగఁగా సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. అత్రైవ బ్రహ్మయోగో వ్యాపకత్వాత్. ౧౦

భా. సర్వత్ర బ్రహ్మభావన గలవాఁడును, వాసనాశూన్యుఁడును నగుతత్త్వవేత్తకు శరీరపాతము గలిగినప్రదేశమునందే బ్రహ్మముతోఁగూడ నేకీభావము గలుగును. పరమాత్మ సర్వత్ర నిండియున్నవాఁడు గదా! ఈవిషయమును.

"శ్రు. ఆకాశవ త్సర్వగతశ్చ నిత్యః"

అనఁగా, నీభగవంతుఁ డాకాశమువలె సర్వగతుఁడును నిత్యుఁడు ననియు,

"శ్రు. యాన త్కించి జ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా,
అన్త ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః."

అనఁగా—యావన్మాత్ర ప్రపంచకము వినవచ్చుచున్నదో కనవచ్చుచున్నదో అంత ప్రపంచకమునకును లోపలను వెలుపలను వ్యాపించి నారాయణపరమాత్మ యున్నాఁడు. అనుశ్రుతులును,

"శ్లో. మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా,
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్."

అనఁగా—ఓయర్జునా! ఈప్రపంచమంతయు నాయవ్యక్తమూర్తిచే వ్యాప్తమయి యున్నది. మఱియు నే నొకయంశముచే నీజగత్తంతను స్తంభింపఁజేసి యుంచియున్నాను.అనుస్మృతియును చెప్పుచున్నవి.

ఏరీతిగా ఘటము భగ్నము కాఁగానే ఘటాకాశ మచ్చటనే మహాకాశములోఁగూడ నేకీభావమును బొందుచుండునో అదేరీతిగా నాత్మవేత్తగూడ జ్ఞానప్రభావముచే నంతఃకరణస్వరూపమయిన యుపాధితో విశ్లేషము గలుగఁగానే సర్వగతుఁడగు పరమాత్మతో నేకీభావమును బొందుచుండును.

సూ. నిగమాచ్చ. ౨౧

భా. వేదవచనములవలనఁగూడ నాత్మవిదున కిచ్చటనే పరమాత్మయం దేకీభావము నిశ్చయింపఁదగియున్నది. ఈవిషయమై,

"శ్రు. యథోదకం శుద్ధే శుద్ధ మాసిక్తం తాదృగేవ భవతి,
ఏవం మునే ర్విజానత ఆత్మా భవతి గౌతమ !
యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్యహృదిశ్రితాః,
అథ మర్త్యో ఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే."

అనఁగా—ఏరీతిగా స్వచ్ఛమైననీటిలో రెండవస్వచ్ఛమైననీరు కలుపఁగా నేకరూపమగునో అటులనే ఆత్మతత్త్వమును దెలిసికొన్న జ్ఞానియగుపురుషునిజీవాత్మ పరమాత్మతోఁగలిసి యేకరూపమైపోవును. మఱియు నేకాలమందు జ్ఞానముయొక్క ప్రభావమువలన నీపురుషుని హృదయములో నున్న సర్వకామములును బోవునో ఆకాలమందే యీ మర్త్యస్వభావముగల పురుషుఁ డమృతస్వభావముగలవాఁ డగును. ఇచ్చటనే బ్రహ్మమును బొందును. అనుకఠోపనిషద్వాక్యములును,

"శ్రు. సంప్రాప్యైన మృషయో జ్ఞానతృప్తాః కృతాత్మా
నో వీతరాగాః ప్రశాంతాః, తే సర్వగం సర్వతః
ప్రాప్య ధీరా యుక్తాత్మానః సర్వ మేవావిశన్తి."

అనఁగా,జ్ఞానముచేతఁ దృప్తిగలవారును, శుద్ధాత్ములును, విరక్తులును, ధైర్యవంతులును నగుఋషులు సర్వవ్యాపకుఁడగు పరమాత్మను సర్వవిధములచేను బొంది సమాహితచిత్తులై సర్వస్వరూపమయిన పరమాత్మునియందుఁ బ్రవేశించుచుండురు. అనుముండకోపనిషద్వాక్యమును బ్రమాణము.

అవ. వైకుంఠలోకమునకుఁ బోయినయుపాసకులకు సాలోక్యా

దిము క్తిభేదము గలిగినట్లే కైవల్యమోక్షమునకుఁ బోవువారికిగూడఁ గైవల్యమోక్షమునందు న్యూనాధికభావము గలుగునా కలుగదా యని జిజ్ఞాస గలుగఁగా సమాధానమును జెప్పుచున్నాఁడు.

సూ. గతిసామ్యం విభాగాభావాత్. ౨౨

భా. నిర్గుణపరమేశ్వరునిఁ జింతించుచు దేహాంతమునందుఁ బరమేశ్వరునియం దేకీభావమును బొందినవారి కందఱికిని సమానమయినగతియే గలుగును. అచ్చట విభాగము లేదు గదా! దేశాదివిభాగ మెచ్చట నున్నదో ముక్తికిఁగూడ విభాగము గలుగును. సజాతీయవిజాతీయస్వగతభేదశూన్యుఁడును, సర్వత్ర సమవ్యాపకుఁడును, నిరాకారుఁడును నగు పరమాత్మునియందు దేశకాలాదివిభాగము లేకపోవుటవలన గతికిని విభాగము సంభవింపదు. ఈసంగతి,

"శ్లో. న భవతి విదుషాం తతో భయం యదవిదుషాం
సుమహాద్భయం భవేత్, నహి గతి రధికాస్తి
కస్యచి త్సతి హి గుణే ప్రవద త్యతుల్యతామ్."

అనఁగా—జన్మమరణ రూపమయిన సంసారమునుండి యజ్ఞానికిఁ గలుగు భయము తత్త్వవేత్తయగు జ్ఞానికిఁ గలుగదు. కైవల్యమోక్షమునం దెవ్వరికిని గత్యాధిక్యము లేదు. న్యూనాధికభావ మెప్పుడును గుణములతారతమ్యమునుబట్టి కదా వచ్చును! అట్టితారతమ్యము నిర్గుణునియం దెట్లును సంభవింపదు. అను మహాభారతమోక్షధర్మపర్వములోనివాక్యమువలనఁ దెలియుచున్నది. మఱియు,

సూ. జ్ఞానైకత్వాచ్చ. ౨౩

భా. నిర్గుణ పరబ్రహ్మవిషయికమయినజ్ఞాన మొకేవిధ మగుటవలనఁ గూడ జ్ఞానుల కందఱికిని సమానమగు గతియే కలుగు నని నిశ్చయింపఁదగును. ఈవిషయమై;

"శ్రు. ఏకధైవానుద్రష్టవ్య మేత దప్రమేయం ధ్రువం
నాన్యః పంథా విద్యతే ఽయనాయ, మనసై
వేద మాప్తవ్యం నేహ నానాస్తి కించన."

అనఁగా—ఆపరమాత్ముని స్వరూప మొకేవిధ మని తెలియవ

లేను. మోక్షముకొఱకు జ్ఞానమార్గమే తక్క దక్కిన యేమార్గమును బనికిరాదు. మఱియుఁ గేవలమనస్సుచేతనే పరమాత్మను బొందనగును. ఎందుచేత ననఁగా, అందు ద్వైతత్వము మొదలగునది కొంచెమైనియు లేదు. ఇత్యాదిశ్రుతియు,

"శ్లో. వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన!"

అనఁగా—ఓఅర్జునా! జ్ఞానముయొక్క నిశ్చయరూప మయిన బుద్ధి జ్ఞానులందఱకును నొక్కటియే యయియుండును. అనుస్మృతియుఁ బ్రమాణము. పైని చూపఁబడినశ్రుతిస్మృతులను బట్టి చూడఁగా నిర్గుణపరమాత్మవిషయికమయిన జ్ఞాన మొక్కటే విధముగా నున్నట్లు కనుపట్టుచున్నది. మఱియు యోగవాసిష్ఠము మొదలగు కొన్నివేదాంత గ్రంథములలో నిర్గుణజ్ఞానమువిషయమయి కూడ సప్తభూమికలక్రమమున్నట్లు నిరూపింపఁబడి యున్నదందువేమా? అది జ్ఞానసాధనములలో జ్ఞానము పుష్టి నొందుటకై నిరూపింపఁబడిన దని తెలియవలయును గాని సాక్షాత్తుగా నపరోక్షజ్ఞానమువిషయమైయని కాదు. ఎందువలనఁ గాదనఁగా నిర్గుణపరమాత్మయం దేవిధమైన విభాగమును లేదు. అందువలననే యచ్చట జ్ఞానమునకును భేదము సంభవింపదు. సగుణబ్రహ్మమునందో ఉపాసనాభేదమునుబట్టి గతికని భేదముగలుగుట యుక్తముగానే యున్నదని తెలిసికొనుము.

౮౨. ఈరీతిగా సర్వవ్యాపకుండైన పరమాత్మయం దేకీభావమును బొందిన ముక్తులకు మరల నెప్పుడేని యచ్చటినుండి వేఱుపాటు సంభవించునా సంభవింపనే సంభవింపదా? యని జిజ్ఞాస కలుగఁగాఁ జెప్పుచున్నాఁడు:—

సూ. న పున ర్వియోగో ఽశ్రవణాత్. ౮౨

భా. పరమాత్మయం దేకీభావమును బొందిన ముక్తులకు మరల నచ్చటినుండి వియోగము సంభవింపదు. అది యెట్లు దెలియుచున్నదందువేని శ్రుతిస్మృతీతిహాసపురాణాదులగు నేకైవల్యమోక్షప్రతిపాదకశాస్త్రములయందును వారికి మరలఁ బరమాత్మునిదగ్గఱనుండి వేఱుపాటు గలుగు నని వినవచ్చుట లేదు సరిగదా మీఁదుమిక్కిలి,

"శ్రు. యస్తు విజ్ఞానవా న్భవతి సమనస్కః స్సదాశుచిః,
సతు తత్పద మాప్నోతి యస్మా ద్భూయో నజాయతే."

అనఁగా:—ఏపురుషుఁడు విజ్ఞానవంతుఁడును, శాంతమనస్కుఁ డును,సదా శుచియునగుచున్నాఁడో యతఁడు మరల నెచ్చటనుండి వచ్చి పుట్టఁడో ఆపదమునే పొందుచున్నాఁడు. అనుశ్రుతియందును,

"శ్లో. మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ నవిద్యతే,
యద్గత్వా ననివర్తన్తే తద్ధామ పరమం మమ."

అనఁగా:—ఓ కుంతీనందనా! అర్జునుఁడా! నాస్వరూపమును బొందుటవలన మరలఁ బుట్టనక్కఱలేదు. మఱియు నేపదమును జ్ఞాని యగు పురుషుఁడు పొంది మరల వెనుకకుఁ దిరిగి రాఁడో అదియే నా పరమధామము. అను స్మృతియందును బరమాత్మతో మరల వియోగము లేకపోవుటయే వినవచ్చుచున్నది. కావునఁ బరమాత్మయం దేకీభావమును బొందినపురుషులకు మరల నొకప్పుడును నచ్చటనుండి వేఱుపాటు సంభవింపదు. మఱియు,

సూ. సామగ్రీవిరహాచ్చ. ౨౫

భా. పరమాత్మునినుండి వేఱుపాటు గలిగించుటకు జీవాత్మకు దేహేంద్రియాదికమగు నేసామగ్రి గలదో అది కైవల్య మోక్షదశలో నాశమును బొందును. ఈవిషయమున,

"శ్రు. గతాః కలాః పంచదశ ప్రతిష్ఠా దేవాశ్చ సర్వే
ప్రతిదేవతాసు, కర్మాణి విజ్ఞానమయశ్చ ఆ
త్మా పరేఽవ్యయే సర్వ ఏకీభవన్తి."

అనఁగా:—ఏకాలమందు జ్ఞానియగుపురుషుఁడు కైవల్యమోక్షమును బొందుచున్నాఁడో అప్పుడతనిప్రాణాదికములగు పంచదశకలలును తమతమకారణములలో లీనమయిపోవును. మఱియు నతని నేత్రాదికములయిన యింద్రియములుగూడఁ దమతమయధిష్ఠాతలగు సూర్యాదిదేవతలయందు లీనమయిపోవును. అతనికర్మములు, జీవాత్మ పరబ్రహ్మమునం దేకీభావమును బొందుచుండును. అని ముండకోపనిషద్వాక్యము ప్రమాణముగా నున్నది. కావున జీవత్వమును బ్రతిపాదించు

నంతఃకరణము మొదలగు నుపాధులతో విరహము గలుగుటవలన ఘటము నశించినతోడనే ఘటాకాశము మహాకాశములో లయమయిపోయి నట్లు పరమాత్మయందు లయమును బొందినజీవాత్మకు మరల నుత్థానముగాని వియోగముగాని సంభవింపదు. ఈవిషయమై,

" శ్రు. యోహ వై పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి,
నాస్యాబ్రహ్మవిత్కులే భవతి, తరతి శోకం, తరతి
పాప్మానం, గుహాగ్రంథిభ్యో విముక్తో ఽమృతో భవతి. "

అనఁగా:—ఏపురుషుఁడు పరబ్రహ్మముయొక్క స్వరూపమును బాగుగాఁ దెలిసికొనుచున్నాఁడో యతఁడు పరబ్రహ్మరూపమే యగును. అతనికులమందుఁగాని, సంప్రదాయమందుఁగాని యజ్ఞాని యెవ్వఁడును నుండఁడు. మఱియు నతఁడు సర్వవిధములయిన క్లేశములను, పాపములను తరించును. మఱియు నజ్ఞానరూపమయినహృదయగ్రంథులతో రహితుఁ డగుచుఁ గైవల్యమోక్షమును బొందుచున్నాఁడు. అని ముండకోపనిషద్వాక్యము ప్రమాణముగా నున్నది.

అవ. బ్రహ్మస్వరూపుఁడే యగుటవలన నిత్యముక్తస్వరూపుఁడయిన జీవాత్మునికి బ్రహ్మముతో వేఱుపాటును గలిగించులింగశరీరమను సామగ్రి కెట్లు సంబంధము గలుగు నని జిజ్ఞాస గలుగఁగా స్వదర్శనము ననుసరించి సమాధానము చెప్పుచున్నాఁడు:—

సూ. లిఙ్గయోగః ప్రకృతిపరిణామా దీశ్వరేచ్ఛయా. ౨౬

భా. ఈశ్వరునియిచ్ఛవలన సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థారూపమయిన ప్రకృతియొక్క పరిణామమే యగుటవలన జీవాత్మకు మనఃప్రాణేంద్రియాత్మకమైన లింగశరీరముతో సంయోగము గలుగుచున్నది. ఇచ్చటఁ గొంచెము సిద్ధాంత ముపన్యసింపఁబడుచున్నది. ఎట్లనఁగా :—

చరాచరరూపమయిన యీ సర్వజగత్తునందును చేతనము, అచేతనము నని రెండేతత్త్వములు గలవు. చేతనముకంటెను,జడముకంటెను విలక్షణమయిన వస్తు వేదియు లేదు గనుక మఱియొకతత్త్వ మున్నట్లు గల్పించుట యుక్తము గాదు. ఆరెండింటిలో నొకటి బ్రహ్మమనియు,

పరమాత్మ యనియు, పురుషుఁ డనియుఁ జెప్పఁబడుచుండును. రెండవది ప్రధాన మనియు, ప్రకృతి యనియు, మాయ యనియుఁ జెప్పఁబడుచుండును. ఈరెండుపదార్థములే దేశమునుబట్టియు, కాలమునుబట్టియు, అనాదులును అనంతములును నగుచున్నవి. అనఁగా నీరెంటికిని దేశముతోడను, కాలముతోడను నెప్పుడును అంతము లేదు. అందుఁ బ్రకృతి పరిణామశీలము, ప్రసవధర్మముగలది, సత్త్వరజస్తమోగుణాత్మకము, జడము నయి యుండును. పురుషుఁడు పరిణామము లేనివాఁడు, ప్రసవధర్మము లేనివాఁడు, చిద్రూపుఁ డనగాఁ జేతనస్వరూపుఁడు, నిర్గుణుఁడునై యుండును. ఆయీప్రకృతిపురుషుల కిద్దఱకును పరస్పరమును సేవకస్వామిభావముచే సంబంధ మనాదిగా నున్నది. ఈసంబంధమునే పురస్కరించుకొని వేదాంతశాస్త్రములో శక్తికిని శక్తిమంతునకును నభేద మను నభిప్రాయముచే "ఏకమేవాద్వితీయమ్" అని చెప్పఁబడినది. ఆప్రకృతిపురుషులకుఁ గల యేయనాదిసంబంధము గలదో దానికే యీశ్వరుఁ డని పేరు. ఆప్రకృతియొక్క సంపూర్ణమైన సత్త్వగుణముతో సంబంధముండుటవలన నీశ్వరుఁడు సర్వజ్ఞత్వసర్వశక్తిత్వాదిగుణములతో సంయోగముగలవాఁ డగుచున్నాఁడు. తానుస్వామి గనుకఁ బ్రకృతితోఁ గ్రీడించుచుండు నాపరమేశ్వరునకు "శ్రు. బహు స్యాం ప్రజాయేయ" అనఁగా నే నొక్కఁడనే యనేకరూపములుగలవాఁడ నయి యుత్పత్తిగలవాఁడ నగుదును. అనునిచ్ఛచేఁ గ్రియాశక్తిసమన్వితమయిన ప్రకృతియందుఁ బరిణామపరంపర గలుగుచుండును. ఆలోచించి చూడఁగా ప్రకృతి పరిణమించుస్వభావముగలదియే కాని దానికి "నాచే నిరూపముగా నెట్లు? ఎప్పుడు? ఎవరియుపయోగముకొఱకుఁ బరిణమింపఁదగి యున్నది." అనుజ్ఞానము లేదు గనుక స్వతఃపరిణామము సంభవింపదు. కావునఁ బరమేశ్వరునియిచ్ఛ ననుసరించియే యది మహదాదిరూపముగాఁ బరిణమించుచుండును. తరువాతను మహదాదులవలన మనఃప్రాణేంద్రియాత్మకమయిన లింగశరీర ముత్పత్తి యగుచుండును. ఎచ్చటనెచ్చటను లింగశరీరమున కావిర్భావము గలుగునో యచ్చటచ్చటనే చేతనశక్తికి ఘటమునకును ఆకాశమునకునువలెనే మాయాశరీరము

తోఁ సంబంధము గలుగుచుండును. ఈసంయోగమునే వేదాంతమతములోఁ జైతన్యముయొక్క ప్రతిబింబమునుగాఁ గూడఁ జెప్పుచుందురు. లింగశరీరోపాధితోఁ గూడియున్న యాచైతన్యమునకే జీవుఁడని పేరు గలిగినది. లింగశరీరము లేకుండఁ గేవలము అవిద్యతోఁ గూడియున్న చైతన్యమునే జీవ మని యంగీకరింపరాదు. ఎందుచేత ననఁగా, కారణావస్థలోఁ బ్రకృతిరూపమైన యేయవిద్య గలదో యది వ్యాపకమును నిరవయమును నగుటవలన దాని కచ్చట నీశ్వరునికంటె భిన్నముగా నుపాధిత్వము చెప్పుటకు వలనుపడదు. అవిద్యకు వ్యాపకత్వము జగత్తున కుపాదానకారణ మయి యుండుటచేఁ బ్రసిద్ధమే యయి యున్నది. ఆకాశముమొదలైన నిరవయపదార్థములకుఁ గారణ మగుటవలననే నిరవయవత్వ మున్నదని తెలియఁదగును. సావయవకారణమునకు నిరవయవ మయిన కార్యము కాఁదగదు గదా! నిరవయవమునకుమాత్రము సావయవమయినకార్యము గలుగును. ఎట్లన; ఆకాశమునకు వాయువుకార్య మగుచున్నట్లు. "శ్రు. మాయా చావిద్యాచ స్వయమేవ భవతి" అనుశ్రుతివలన సత్త్వగుణప్రధానము, రజోగుణప్రధానమును నగుప్రకృతి భిన్నమయినది యందులేని యది సరికాదు. ఎందుచేత ననఁగా, ప్రకృతియొక్కగుణవైషమ్యము పరమేశ్వరునియిచ్ఛ కలిగినతరువాతను గదా కలుగుచున్నది! ఈశ్వరేచ్ఛ లేకుండఁ గేవలమును చిత్సన్నిధానముచేతనే గుణవైషమ్యము గలుగుచున్న దని తలంపరాదు. ఎందుచేత ననఁగా ఆవైషమ్యము బుద్ధిపూర్వకమయినది గాక పోవుటవలన నుపయోగించునది గాకపోవలసివచ్చును. మఱియుఁ బ్రకృతికిఁ జైతన్యమునకును గలసంబంధము నిత్యమగుటవలన నిత్యము సృష్టి కావలసివచ్చును. "శ్రు. మాయా చావిద్యాచ స్వయమేవ భవతి" అనుశ్రుతికి మాత స్వయముగానే పుత్త్రిని గనుచున్నది. అని యీరీతిగా నర్థ మనుసంధింపవలయును. అనఁగా నేప్రకారముగాఁ దల్లియొక్కతెయుఁ బుత్త్రిని స్వయముగాఁ గనఁజాలదో ఆప్రకారముగానే ప్రకృతియు స్వయముగా మాయారూపము, అవిద్యారూపము గాఁజాలదు. అటులే కానిచోఁ బ్రకృతి జగద్రూపముగాఁగూడ స్వయముగానే

కాగలదు. అట్లే యయినచోఁ బైనిచెప్పినదోషము తప్పనేతప్పదు.

"శ్రు. తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్,
తదాత్మానం స్వయమకురుత."

అనఁగా, ఆయీశ్వరుఁడుజగత్తును సృజించి యందుఁ దానే ప్రవేశించుచున్నాఁడు. మఱియు నాయీశ్వరుఁడు తానే జగద్రూపముగా నగుచున్నాఁడు. ఇత్యాదిశ్రుతివచనమువలనను జగత్తున కాదికాలమం దీశ్వరునికంటె జీవునకు వేర్పాటు సంభవించుట లేదు. కాఁబట్టి యంతఃకరణాదిరూపముగాఁ బరిణమించిన యవిద్యయే పరిచ్ఛిన్నమయిన దగుటవలనఁ జైతన్యమునందు జీవత్వమును గలిగించుచున్నది. కనుక నంతఃకరణావచ్ఛిన్నచైతన్యమే జీవుఁడని తెలియవలయును. అందు జీవచైతన్యమున కుత్పత్తి లేకపోవుటవలనను, అంతఃకరణసంయోగ మనాదియగుటవలనను జీవునకుఁగూడ ననాదిత్వము చెప్పఁబడుచున్నది. ప్రకృతియొక్క యల్పసత్త్వముతోడి సంబంధమువలనను, స్థూలశరీరసంబంధమువలనను, బాహ్యవిషయములయందలి యనురాగమువలనను జీవుఁడల్పజ్ఞత్వాల్పశక్తిత్వాదిగుణములతోఁ గూడుకొని యుండును. జీవాత్మున కుపాధియగు నంతఃకరణము సుషుప్త్యవస్థలో నాశమును బొందు నని తలంపరాదు. ఏదుచేత ననఁగా; అప్పు డంతఃకరణము సూక్ష్మరూపముగా నుండును. సుషుప్త్యవస్థలోఁ దమోగుణము ప్రధానమై యుండుటవలన నప్పుడు తమోగుణముచేతను నిరుద్ధమై యంతఃకరణము విశేషజ్ఞానమును బుట్టింపఁజాల దని తెలియవలయును. "సూ. అభావప్రత్యయాలంబనా వృత్తి ర్నిద్రా." అను యోగసూత్రమునందు సుషుప్తిగూడఁ జిత్తవృత్తివిశేషమే యని చెప్పఁబడినది. "సుఖ మహ మస్వాప్సం, నచ కించి దవేదిషమ్." అనఁగా, నేను సుఖముగా నిద్రపోతిని. నా కేమియుఁ దెలియలేదు. అని నిద్రపోయి లేచినపురుషునకు స్మృతి గలుగుటవలన సుషుప్తికాలమునందు సుఖముయొక్కయు, తమోగుణముయొక్కయు ననుభవమును గలిగించుచిత్తవృత్తియొక్కయునికి నిశ్చయింపఁబడుచున్నది. అట్లే ప్రళయకాలమందుఁగూడ నంతఃకరణములు సూక్ష్మబీజరూపముగాఁ బ్రకృ

తియుండదు. సాంఖ్యమతము ననుసరించి చూడఁగా నేకార్యమునకును స్వరూపమునుబట్టి నాశము సంభవింపదు. లేనియెడల నుపాధికభావము గలుగఁగా సర్వజీవాత్మలకును స్వతస్సిద్ధముగా ముక్తి ప్రసక్తమగును. మఱియు కారణావస్థలోఁ బ్రకృతి వ్యాపకమయి యుండుట వలన జీవున కుపాధి కాఁజాలకపోవును. ప్రళయముగూడ,

"శ్రు. తద్ధేదం తర్హ్యవ్యాకృత మాసీత్ తన్నామరూపాభ్యా
మేవ వ్యాక్రియతే."

అనఁగా—ఈసర్వజగత్తును ఉత్పత్తికంటె ముందుగా నవ్యాకృతమై యున్నది. అనఁగా సంకోచావస్థలో నున్నది. అది మరల నుత్పత్తికాలములోఁ గేవలమును నామరూపములచే విస్తరింపఁబడినది. ఇత్యాదిశ్రుతిప్రమాణమునుబట్టి చిత్రపటసంకోచోపమమే యని తెలియఁదగును. చిత్రపటమును సంకోచమును బొందించినంతమాత్రమున దానియందలిచిత్రముల కెట్లభావములేకుండునో యట్లే ప్రళయకాలమునందును సృష్టి ప్రకృతియందు సూక్ష్మబీజరూపముగా నుండు నని తెలియవలయును. మఱియు రెండవసృష్టియందుఁ బరమేశ్వరునియిచ్ఛచేతను బ్రకృతియొక్కగుణములపరిణామక్రమముచేఁ బూర్వార్జితకర్మసంస్కారయుక్తములయిన యాయాంతఃకరణములే వర్షము గురిసినతోడనే భూమియం దడఁగియుండి లీనమయియున్న బీజములు మరల సంకురించుచున్నట్లావిర్భావమును బొందుచుండును. ఆచేతనసంయోగమే వానియం దప్పుడు స్ఫుటత్వమును బొందుచుండును. సృష్టియొక్కప్రారంభమునకుఁ గారణమగు నీశ్వరేచ్ఛవిషయమై జీవులయదృష్టమే కారణమగుచుండును. ఈరీతిగా సర్గపరంపర యనాది యగుటవలన జీవులుగూడ ననాదులే యనుట సమంజసము. అందీశ్వరుఁడు కారణోపాధిగనుక నియామకుఁడును, జీవులు కార్యోపాధులు గనుక నియమ్యులును నగుచుందురు. కైవల్యమోక్షావస్థలోమాత్రము జీవోపాధి నశించుట వలన జీవేశ్వరుల కైక్యమే సంభవించుచున్నది.

అవ. "అంతఃకరణములకుఁగూడ నాత్మ కనాదిత్వమైనట్టి యే

సంబంధము నిరూపింపఁబడినదో దాని కేమికారణము గలదు ?" అని జిజ్ఞాస గలుగఁగాఁ జెప్పుచున్నాఁడు :—

సూ. తస్య కారణ మజ్ఞానమ్. ౨౭

భా. పురుషునకును, అంతఃకరణమునకును గల యీసంబంధమున కజ్ఞానమే కారణము గాని యితరము గాదని యర్థము. ఈసంగతి "సూ. తస్య హేతు రవిద్యా." అనఁగా నాయంతఃకరణపురుషుల సంబంధమునకు హేతు వవిద్య. అని యోగశాస్త్రములోఁ జెప్పఁబడినది. అంతఃకరణమునందుఁ గారణరూపముగా ననుగతమైయున్న యజ్ఞాన మావరణమును గలిగించుస్వభావముగలది యగుటవలన స్వానచ్ఛిన్నమైన చైతన్యమునే యావరించుచుండును. పిమ్మట తద్వృత్తియందుఁ బతితమైన చైతన్యము తత్కార్య మగు నంతఃకరణాదికము తనస్వరూపముగా నంగీకరింపఁబడి తద్గతమైనసుఖదుఃఖములను బొందునదగుటచే జీవత్వమును బొంది శుద్ధాసంగమయ్యును సంసారిత్వమును బొందుచుండును. అంతఃకరణముతోఁగూడ నాజీవునకుఁ గల తాదాత్మ్యాధ్యాసమే బంధ మని చెప్పఁబడుచున్నది. ఈతాదాత్మ్యభావముచేతనే స్వతస్సిద్ధముగా నిత్యముక్తుఁడే యయినను ఆత్మకు బుద్ధిగతములయిన బంధమోక్షముల కధికరణత్వము గలుగుచున్నది. ఏప్రకారముగా శుద్ధమయినదయినను గాజుపాత్రకు రక్తపుష్పములసాన్నిధ్యముచే రక్తవర్ణాధికరణత్వము గలుగునో అట్లేయని తాత్పర్యము.

అవ. మీఁదఁ జెప్పఁబడినచొప్పున నంతఃకరణాద్యుపాధులతోఁగూడియున్న జీవాత్మ మరల నాయుపాధులనుండి యేయుపాయము చేత ముక్తుఁ డగు ననఁ జెప్పుచున్నాఁడు.

సూ. తత్త్వజ్ఞానేన తదపాయే కైవల్యమ్. ౨౮

భా. యథార్థముగా వేఱువేఱగు ప్రకృతి పురుషుల స్వరూపము తెలిసికొనుటచేతను అంతఃకరణమునకును పురుషునకును తాదాత్మ్యభావమును గలిగించునట్టి యజ్ఞానము నశించినతోడనే జీవాత్మకుఁ గైవల్యమోక్షము గలుగును. అనఁగా, పూర్వము చెప్పఁబడిన ప్రకారముగా నీశ్వరు నారాధించుచుండుటచేత శుద్ధమయిన యంతఃకరణము

గల్పపురుషునకు సాధుసమాగమముచేతను, వేదాంతశాస్త్రవిచారణము చేతను చైతన్యముయొక్కయు జడముయొక్కయు వివేకము దృఢతత్వ మును పొందినదగుచుండఁగా నాపురుషుఁడు తనస్వరూపమును లింగశరీరరూపమయిన యుపాధికంటె వేఱయినదానినిగాఁ దెలిసికొని యాయు పాధియొక్క సంబంధమందు దోషమును జూచువాఁడయి సమస్తమైన భోగములయందును గొంచెమేనియుఁ గోరిక లేకుండ నాయుపాధిని విడుచుకోఁదలఁచినవాఁడయి మాయయొక్క బలము శాంతించుటకై యీశ్వరుని శరణుపొంది యాభగవంతుని దయచేతను ప్రారబ్ధకర్మముల ననుభవించినతరువాతను నిర్విఘ్నముగా నాయుపాధినుండి ముక్తుఁడ గును. అనఁగా, లోకాంతరమునకుఁ గారణమయిన వాసనారూపమగు దారము తెగిపోవుటవలన లింగశరీరసామగ్రి నిరాధారమయి తమతమ కారణములలో విలయమగును. జీవచైతన్య మంతటను నిండియున్న బ్రహ్మమునం దైక్యమును బొందును. మరల నాజీవుఁడు బ్రహ్మము నుండి యెప్పటికిని వేఱుగాఁడని యర్థము.

అవ. "మీరు చెప్పిన చొప్పున బ్రహ్మమునం దేకీభావమును బొందిన జీవాత్ముల కా బ్రహ్మమునుండి యెప్పటికిని వేఱుపాటు లేక పోవుటయే నిజమైనచో నెంతకాలమునకైనను గ్రమముగా ముక్తిని బొందుచుఁబొందుచు సర్వజీవులును సమాప్తినే పొందుదురే?" అని శంకింపఁగా సమాధానము చెప్పుచున్నాఁడు :—

సూ. నజీవసమాప్తి రానంత్యా దానంత్యాత్. ౨౬.

భా. సూత్రములో "ఆనంత్యాత్, ఆనంత్యాత్" అని రెండు మాఱ్లుచ్చరించుట శాస్త్రసమాప్తిని సూచనసేయుటకు. కైవల్య మనుపదశేలో(?) బరమాత్మునియం దైక్యమును బొందినజీవులకు సమాప్తి యెన్నటికిని గలుగదు. జీవులు పరిమితిగా నుండినచో సమాప్తిని బొందునుగాని వానికిఁ బరిమితియే లేదు. కావున నవి యనంత ములు, అనంతములు. ఈవిషయమును,

"శ్రు. వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ,
భాగో జీవ స్స విజ్ఞేయ స్సచానంత్యాయ కల్పతే"

అనఁగా—తలవెండ్రుకయొక్క కొన నూఱుభాగములుగాఁ జీరి యందొకభాగము మరల నూఱుభాగములుగాఁ జీరిన యెడల నెంతసూక్ష్మముగా నుండునో జీవునిస్వరూప మంతసూక్ష్మముగా నుండునని తెలియవలయును. మఱియు నట్టిజీవ మనంతము. అని శ్వేతాశ్వతరోపనిషద్వచనము చెప్పుచున్నది. పరమాత్మకు శక్తిభూతమయిన ప్రకృతియొక్క వికారములయిన పృథివ్యాదిమహాభూతపరమాణువులకే లెక్కలేనపుడు పరమాత్మ కవయవభూతములయిన జీవులకు లెక్కయుండ దని వేఱుగఁ జెప్పవలయునా? క్షీణ మగుచున్నవస్తువునకు సమాప్తి తప్పక కలుగునని కూడ నీవిషయమున ననుమేయించరాదు. అనంతమయినవస్తువునకు వ్యయమగుచున్నను క్షీణము గానరాదు. అట్లు కానిచో బ్రహ్మమునకుఁగూడ నంతము గలుగు నని యొప్పక తప్పదు. బ్రహ్మాండమునకు బయటను దూర్పుదిక్కు మొదలుకొని పశ్చిమదిశవఱకును నెదురుగా నతివేగముగా నిరంతరమును నడుచుచున్న గరుడాదులను శక్తిగలపురుషులకు బ్రహ్మముయొక్క యవతలిపైపు తప్పక దృష్టిగోచరమే యయితీరును. ఏమనఁగా మార్గము వ్యయమయినప్పుడు దాని కంతము తప్పక కాఁదగియే కదా! యుండును. మఱియు నాబ్రహ్మమున కవతల నేమి యున్నదో చెప్పుటకు వీలు గాదు గనుకను, ఈకల్పన వేదశాస్త్రములకు విరుద్ధమయినది గనుకను మంచిది గాదు. కావున బ్రహ్మ మనంతమని చెప్పుటయే యొప్పును. అట్లే యాబ్రహ్మమున కవయవభూతములయిన జీవులును అనంతములే యని నిశ్చయించుకోఁదగును. మఱియు "శ్లో. మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే." అను గీతావాక్యము ననుసరించి చూడఁగా నెవ్వఁడో యొక్కఁడే యెప్పుడో యొకప్పుడేజీవుఁడు కైవల్యమోక్షమును పొందుచుండు నని తేలుచున్నది. ఈకారణముచేతనుగూడ జీవులకు సమాప్తి యగునని శంకింప నక్కఱలేదు. ఈప్రపంచమునకు మెప్పుడు ప్రారంభ

మ్మయినది? అనుసంగతి తెలిసికొన శక్యముగాదు గనుక నిది యనాది యనియు నిది యెప్పటికి సమూలముగా సమాప్తిని బొందును? అను నిశ్చయము లేదుగనుక ననంత మనియు సిద్ధ మగుచున్నది. కావున మేము చెప్పిన దంతయు సరిగానే యున్నది.

శ్లో. ఆనన్దాద్ధి సముద్భూత ఆనందేనైవ జీవతి,
ఆనన్దే విలయం ప్రాప్య జీవ ఆనందతా మియాత్.

శ్లో. బ్రహ్మానన్దేన యతినా కృత మీశ్వరదర్శనమ్,
పఠతాం శృణ్వతాం చైవ బ్రహ్మానన్దాయ కల్పతే."

ఇట్లు శ్రీబ్రహ్మానన్దస్వాములవారిచే సంస్కృతమున రచింపబడిన భాష్యము ననుసరించి పురాణాం - సూర్యనారాయణతీర్థులచే నాంధ్రీకరింపఁబడిన యీశ్వరదర్శన భాష్యమునందుఁ జతుర్థ పాదముతోఁగూడ నీయీశ్వరదర్శనము

సమాప్తము.





శ్రీ ర స్తు.

ఓం నమః కామేశ్వర్యై.

---

# శ్రీ వి ష్ణు స్తో త్ర ము.

(బ్రహ్మానందస్వామికృతము.)

శ్లో. జయ మాధవ! మంజులాకృతే జయ విష్ణో! నలినాయతేక్షణ,
జయ జన్మజరావిపత్తిహా! జయ వైకుంఠపతే! జగత్పతే! ౧

తా. మంజులాకృతివగు నోమాధవా! సర్వోత్కృష్టముగా నుండుము. తామరఱేకులవంటికన్నులుగల యోవిష్ణూ! సర్వోత్కృష్టముగా నుండుము. జన్మము, ముదిమి మొదలగు నాపదలను బోఁగొట్టువాఁడవగు నోభగవంతుఁడా! సర్వోత్కృష్టముగా నుండుము. జగములకుఁ బతివగు నోవైకుంఠపతీ! సర్వోత్కృష్టముగా నుండుము.

శ్లో. మకరాకృతికుండలోజ్జ్వలం వనమాలాపరిరంభితోరసమ్,
నవరత్నకిరీటశోభితం తవ రూపం స్మరతాం కుతో భయమ్. ౨

తా. ఓవిష్ణూ! మొసలియాకృతిగల కుండలములచేఁ బ్రకాశించునదియు, వనమాలచేఁ గౌఁగిలింపఁబడిన వక్షస్థలము గలదియు, నవరత్నకిరీటముచే శోభితమయినదియు నగు నీరూపమును స్మరించువారికి భయ మెక్కడిది?

శ్లో. తవపాదసరోజపోతకం సముపాశ్రిత్య దృఢం విపశ్చితః,
భవసాగర మాశు దుస్తరం కమలానాథ! తరన్తి లీలయా. ౩

తా. కమలానాథా! పండితులు నీపాదపద్మములనెడి దృఢమయిన నావ నాశ్రయించి శీఘ్రముగా దాఁటశక్యముగాని సంసారసముద్రమును విలాసముగా దాఁటుచున్నారు.

శ్లో. కమలాకరలాలితం సదా మునిబృందై రభివందితం ముదా,
చరణం తవ చింతితార్థదం దయయా దర్శయ మే దయానిధే! ౪

తా. దయానిధివగు నో శ్రీహరీ! యెల్లప్పుడును లక్ష్మియొక్క కరములచేతను లాలనచేయఁబడుచున్నదియు, మాటిమాటికిని మునిసమూహములచేతను నమస్కరింపఁబడినదియు, భక్తులకుఁ గోరినకోరికల నిచ్చునదియు నగు పాదమును నాకు దయచేతను జూపించుము.

శ్లో. యది మేఽస్తి న నాథ! యోగ్యతా తవ పాదాంబురుహావలోకనే,
మమ దోషచయాం తిరస్కురు నహి సూర్యేణ తమో నిరీక్ష్యతే. ౫

తా. నాథా! నీపాదపద్మములను జూచువిషయమై నాకు యోగ్యత లేదేని నాపాపములను దొలఁగించుము. సూర్యునిచేతను జీకటి చూడఁబడదుగదా!

శ్లో. నహి మేఽస్తి తప స్సమర్జితం పరితోషో నను యేన తే భవేత్,
నియమం పరిహాయ కర్మజం కురు దేవేశ! దయా మహేతుకామ్. ౬

తా. దేవేశా! దేనిచేతను నీకు సంతోషము గలుగునో అట్టితపస్సు నా కార్జింపఁబడి యుండలేదు. (అనఁగా నిన్ను సంతోషపెట్టుటకుఁ దగినంతతపస్సు నేను జేయలేదని యర్థము.) కర్మములవలనఁ బుట్టిన నియమమును విడిచి నిర్హేతుకమయిన దయను జూపుము.

శ్లో. కఠినం కిల కర్మబంధనం విషయాశ్చాపి సుదుర్జయా విభో!
ప్రబలా స్తిచ మోహవాసనా నవినా తే కరుణాం విమోక్షణమ్. ౭

తా. విభూ! కర్మములనిబంధనము కఠినమయినది గదా! ఇఁక విషయములో జయింపరానివి. మోహవాసన ప్రబలమయి యున్నది. నీదయ లేనిచో మోక్షము లేదు.

శ్లో. గతకంటక ముజ్జ్వలం పరం మునివర్యై రనిశం నిషేవితమ్,
తవ మార్గ మపాస్య మాపతే! నిరతా హా! కుపథేషు దుర్ధియః. ౮

తా. లక్ష్మీపతీ! కంటకములు లేనిదియు, మిక్కిలి ప్రకాశించునదియు మునివర్యులచేత నెప్పుడును సేవింపఁబడుచున్నదియు నగునీ మార్గమును విడిచి బుద్ధితక్కువవారు చెడుమార్గములయం దాసక్తు లగుచున్నారు. ఎంతకష్టము!

శ్లో. నజపం నతపో నవై వ్రతం నచ తీర్థోపగమం సురార్చనమ్,
కృతవా నహ మచ్యుతాదరా త్త్వవ విశ్వాసపరోఽస్మి కేవలమ్.౯

తా. అచ్యుతా! నేను జపము చేయలేదు. తపస్సు చేయలేదు. వ్రతములు చేయలేదు. తీర్థయాత్ర చేయలేదు. దేవతల నారాధింప లేదు. కేవలమును నిన్నే యాదరముగా నమ్ముకొని యున్నాను.

శ్లో. సకలేశ్వర సర్వదేహినాం హృదయేష్వాపగతోఽపి సర్వదా,
జగతా ముపకారహేతవే సతతం శేషతనౌ విరాజసే. ౧౦

తా. సకలమునకును ప్రభువగు శ్రీహరీ! నీవు సమస్తదేహుల హృదయములలో నున్నవాఁడవయ్యు లోకములయుపకారముకొఱకు యెప్పుడును శేషునిశరీరమందుఁ బ్రకాశించుచుండుదువు.

శ్లో. దితిజా నవహంసి సంగరే కురుషే దేవ! హితం దివౌకసామ్,
అపి సర్వసమేక్షణస్య తే భజతాం నైవ భజనం హి రోచతే.౧౧

తా. దేవా! నీవు యుద్ధములో రాక్షసులను జంపెదవు. దేవతలను మేలుచేయుచుందువు. అందఱను సమానముగాఁ జూచువాఁడవయి నను నీకు సేవించువారిసేవ యిష్టమగుచుండును గదా!

శ్లో. నిహతా నను రోషదృష్టితో భవతా యే దనుజా రణాజిరే,
దృఢయోగవతాం గతిం గతా స్తవ కోపోఽపి విభో! వరాయతే.

తా. ప్రభూ! యేరాక్షసులు నీచేతను యుద్ధరంగమునందుఁ గోపదృష్టిచేతను జూచి చంపఁబడిరో వారు యోగులుపోవుగతికిఁ బోయిరి. నీకోపముగూడ వరమే యగుచున్నది గదా!

శ్లో. జనిమృత్యుజరాదియంత్రితం వివిధై రోగగణైశ్చ పీడితమ్,
పరతంత్ర మిదం కళేబరం కథ మారాధన మీశ! తేభవేత్. ౧౩

తా. ఈశ్వరా! ఈదేహము జన్మము మృత్యువు జర మొదలగువానితో నియమింపఁబడి యున్నది. అనేకములయిన రోగములచేఁ బీడింపఁబడుచున్నది. పరాధీనమయినది. ఇట్టిశరీరముచేతను నీకారాధన యెట్లు జరుగును?

శ్లో. తవ చింతనకల్పపాదపం పరమానందకరం విహాయ వై,
విషయేషు విషోపమేషు మే రమతే హ_స్త! రమేశ మానసమ్. ౧౮

తా. రమేశా! పరమానందమును గలిగించునీచింతనయనెడి కల్పవృక్షమును విడిచి యక్కటా! నామనస్సు విషముతో సమానములగు విషయములయందు రమించుచున్నది.

శ్లో. విదితం కిల శాస్త్రతో మయా జగదేత న్నితరాం వినశ్వరమ్,
త్యజతీహ మనో న వాసనాం తవ మాయా నను నాథ! దు_స్తరా.

తా. నాథా! యీజగమంతయు నశించుస్వభావము గలదియని నాకు బాగుగా శాస్త్రములవలనఁ దెలిసియేయున్నది గదా! అయినను నామనస్సు వాసనను విడువదు. నీమాయ దు_స్తర మయినది గదా!

శ్లో. ప్రముదస్య గృహం సబాంధవం విజనే తే పరిచింతనే రతః,
ముషితో ఽస్మిచ విఘ్నదస్యుభిః పరిపాహీశ! నమా ముపేక్షయ.

తా. ప్రభూ నేను బందుగులతోఁ గూడియున్న గృహము విడిచి విజనమందు నిన్నుఁ జింతించువిషయమై యాసక్తిగలవాఁడ నయితిని. విఘ్నములనెడి దొంగలచేతను దొంగిలింపఁబడితిని. నన్ను రక్షింపుము. నన్ను పేక్షచేయకుము.

శ్లో. పరిహాయ సమ_స్తదైవతం శరణం తే సముపాగతో ఽస్మ్యహమ్,
యది మా మధునాఽజ! నేక్షసే కృపయా కా భవితా ను మేదశా.

తా. భగవంతుఁడా! నేను సమ_స్తదేవతలను విడిచి నిన్ను శరణుపొందితిని. అట్టినన్ను నీవు దయతోఁ జూడ వేని నాయవస్థ యేమి కానున్నదో కదా!

శ్లో. బహవ_స్తవ సంత్యుపాసకా దివి పాతాలతలే చ భూతలే,
గణనా మమ తత్ర కీదృశీ క్రియతాం నాథ! తథాప్యనుగ్రహమ్.

తా. నాథా! స్వర్గమర్త్యపాతాళలోకములలో నిన్నుపాసించువా రనేకులు గలరు. వారిలో నాకు లెక్క యెట్టిది? అయినను నాయందనుగ్రహింపుము.

శ్లో. భవతో వపురేవ కోమలం హృదయం తే కఠినం విభాతి మే,
బహువర్షగణైరపి ప్రభో! స్మరతో య న్నదదాసి దర్శనమ్. ౧౧

తా. ప్రభూ! నీశరీరముమాత్రమే కోమలమయినది గాని హృదయము కఠినమయినదనియే తోఁచుచున్నది. కనుక నే నెన్ని సంవత్సరములనుండి స్మరించుచున్నను నాకు దర్శన మీయకుండనున్నావు.

శ్లో. నధనాని సుతా నయోషితో నచ దీర్ఘాయురపి ప్రభో! మయా,
నహి మోక్షపదం న యాచ్యతే తవ కైంకర్య మనంత దేహిమే.

తా. అనంతా! నేను నిన్ను ధన మిమ్మని యడుగను. బిడ్డల నిమ్మని యడుగను. భార్యల నిమ్మన లేదు. దీర్ఘాయువు గోరలేదు. తుదకు మోక్షపదవిగూడ నా కక్కఱలేదు. ఒక్క నీకైంకర్యముమాత్రము [redacted]కిమ్ము.

శ్లో. [redacted] కర్మవశేన మే భవేత్ సురలోకే భువివా రసాతలే,
జను రీశ్వర! తత్రతత్ర మే స్మరణం స్యాద్భవతో నిరన్తరమ్.

ఇతి శ్రీ బ్రహ్మానందస్వామివిరచితం శ్రీవిష్ణుస్తోత్రమ్.

తా. ఈశ్వరా! ఒకవేళఁ గర్మవశమున నేను స్వర్గమందు గాని భూలోకమందుఁగాని పాతాళలోకమందుఁగాని పుట్టినను. ఎచ్చటఁబుట్టినను నిరంతరమును నాకు నీస్మరణమాత్రమేయుండినఁ జాలును.

ఇట్లు పురాణం - సూర్యనారాయణశాస్త్రులచే వ్రాయఁబడిన
తాత్పర్యముతోఁ గూడిన శ్రీవిష్ణుస్తోత్రము
సమాప్తము.

శా. బ్రహ్మానందయతిప్రణీతము మతత్రయ్యార్యపాఠ్యమ్ము బల్
జిహ్మాస్వాంతుల కక్షిధూమము లసత్సిద్ధాంత శ్రీగ్రంథ మా
బ్రాహ్మణ్యప్రియుఁడైన నాథమునిపేరం గూర్పఁగాఁబడ్డది
బ్రహ్మాండం బలరారునంతవఱకుం బ్రఖ్యాతమై యుండుతన్.

శ్లో. మఙ్గళం నాథమునయే విద్వదంభోజభానవే,
మఙ్గళం కృతయే చైతత్పాఠకేభ్యశ్చ మఙ్గళమ్.